# పరిసరాలు

[ మొదటి భాగం ]

*

17 గురు కథకుల 17 కథలు

దేశోద్ధారక గ్రంథమాల

హైదరాబాదు

# పరిసరాలు

17 గురు కథకుల 17 కథలు

[ మొదటి భాగం ]

•

సంకలనం:

శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి

•

ప్రచురణ 22

దేశోద్ధారక గ్రంథమాల

3-5-1027, నారాయణగూడ, హైదరాబాదు.



# మ న వి

ఇంతవరకు ఈ గ్రంథమాలద్వారా "*ఉదయ ఘంటలు*" గేయసంపుటిలో 56 గురు కవులను, "*జీవనరంగం*" ఏకాంకదృశ్య నాటికల ద్వారా 15 గురు రచయితలను పాఠకులకు పరిచయం చేశాం. ఈ ప్రథమ సంపుటిలో 17 గురు కథకులను పరిచయం చేస్తున్నాం. త్వరలోనే యింకా 17 గురు కథకులను రెండవ సంపుటిలో పరిచయం చేయనున్నాం. ఇదేవిధంగా రాబోవు ప్రచురణలలో పద్యరచయితలను, వ్యాసరచయితలను సంకలన సంపుటాల రూపంలో పరిచయం చేయదలచాం. ఈ విధంగా సారస్వతంలోని వివిధరంగాల్లో కృషిచేస్తున్న రచయితలను వారి రచనలద్వారా పాఠకుల ముందుకు తేవాలని మా సంకల్పం. మా సంకల్ప మీడేరుటలో రచయితలు మాకు తోడ్పడుతున్నారు. అందుకు మా కృతజ్ఞత లందచేస్తున్నాం.

పాఠకులు ముఖ్యంగా గ్రంథములకు చందాలు, విరాళములు యిచ్చి హృదయ పూర్వకంగా ఆర్థికసాయం చేస్తున్నారు. వారి ప్రోత్సాహమే, నిరాటంకంగా మా కర్తవ్యాన్ని నేటివరకును, ముందు ముందు నిర్వహించుటకు కారణమని మనవిచేస్తున్నాం.

హైదరాబాదు
29-3-56

విన్నవించు,
పట్టికోట ఆళ్వారుస్వామి
వ్యవస్థాపకుడు, ప్రకాశకుడు.

శ్రీ సోమాగౌడు పుల్లయ్యాగారు, అలంపురం.



వీరు మా గ్రంథమాలకు రూ. 400 లు విరాళం ఇచ్చారు. వీరికి మా గ్రంథమాల పక్షాన హార్దిక కృతజ్ఞత లందజేస్తున్నాం.

★

"ముఖ్యముగా మన ప్రజల జీవితమునుండి కథలను సృష్టించవలెను. రచయితలు మొదట రసానుభూతిని పొందవలెను. ప్రజాజీవనమును తమ పాత్రలద్వారా ప్రతిబింబింపజేయవలెను. ఈ రెంటిని దృష్టిలోపెట్టుకొని రచించిన కథలకు ఎన్నదగిన లోపముండనేరదు."

—కీ. శే. సురవరం ప్రతాపరెడ్డి.



# అంగుడు పొద్దు

❖

శ్రీ జి. సురమౌళి



జననం : 1934

చిరునామా : 63, ఇండస్ట్రియల్ లేబర్ కాలనీ,
చిక్కడపల్లి - హైదరాబాదు.

కార్యకలాపాలు : జిజ్ఞాసాసమితి.

అభిరుచి : నాస్తికత్వం.

రచనలు : ముద్రితం : కథానికలు - స్కెచ్‌లు.

అముద్రితం : —

అభిమాన రచయితలు : ముల్కరాజ్ ఆనంద్ - గోపీచంద్ - చలం - శరత్.

*

2

# అంగుడు పొద్దు

"ఏమోయ్ మల్లయ్యా పట్నం బోయినవేమొ ? ఎప్పుడస్తివి ? ఏమేం జూసచ్చినవు ? మీసబ లెట్ల జరిగె గింత జెప్పవ్ ?" పనిదీరి కూకున్న పటేలు మల్లయ్య నడిగిండు.

"ఏం జెప్పమంటవ్ పటేలయా, మా పెద్ద సబ జెప్పింరు. అబ్బ ఏం జనం ఏం జనం ? ఓ పెద్ద తీరుతమోలె ఉన్నదనుకో."

"ఎంతసేపాయె నువ్వచ్చి, బుక్కెడంత సల్లవడే వత్తన్నవా ?"

"ఇంటికోయి సల్లవడే వత్తాన్న బుక్కెడు, గింతగ్గిపుల్లింటిత్తారు సుట్టేసుకుంట"

పటేలయ్య అగ్గిపుల్ల యియ్యంగనే సుట్టమీద అగ్గివెట్టుకొని, మోకాల్లకు రుమాలు జుట్టుక కచ్చీర్లకూకున్న మల్లయ్య సుట్టదాక్కుంట చెప్పు తాంతు, తాను పట్నంల జూసివచ్చిన పెద్ద సబ సంగతి.

"నాలుగు రోజుల ముందుగనే నేనీ ఊల్లకెల్లి ఎల్లిపోయిన్నా ? నా అసుంటోల్లు ఓ యాభై మంది దచ్చింరు.... మేమందరం గలిసో రెండెకరాల మైదానం సాపుజేసుట్ల దలిగినం. అన్లున్న ముస్లు పల్లేరుగాయలు ఏరి, గడ్డిజెక్కి, ఊడ్చి ఆ మైదాన్ల ఓ పెద్ద పందిరేసినం.

పెద్ద పెద్ద బొమ్మలు పటాలు పరదాలు గట్టి సగ్గమోలిగె జేసిన మామైదానాన్ని. అంతకు ముందాడ పందులు మేసేటియి. పందిర్లేసిన మోతె ఒంగలాల్లగూడ అంత సుకముండదనిపించింది. సర్గమే అనుకో. రాత్రనక పగలనక, యాల్లపూట నిద్దర్లేక యాల్లకూడులేక పనిజేత్తె రేపు సబవంగ అన్ని తయారై పోయినయి. ఆనాడు మాత్రం కంటికి కూరుకు రానిచ్చింరా ? ఆగుల పంటఉర్కి పరైల్దియ మనిరి. ఎండవాల

మాయె. అచ్చేటోల్లందరికి నీల్లెట్ల? ఇంజనపెట్టి పంపుల్తోని పర్రెల్లనుంచి పాకల్లకు నీల్లు దెస్తిమి. ఇగ సబనాడు ఆ పందిట్ల కూకుండి ఆల్లు జెప్పే మంచిమాటలేమన్న ఇందామంటె సాగనిచ్చింరా? అచ్చిన పెద్ద పెద్ద దొరలు ఆగల్లకెల్లి పంపుల్లచ్చిన ఉడుకునీల్లు దాగెటోల్లు గాకపోయిరి. పెద్ద పెద్ద కొత్త కడవలు దెచ్చి నీల్లునింపి పెట్టినం. ఓ నూరు కొత్తకడవలు నింపుడుం రోజు తెల్లారంగనె. ఇగ సబ మొదలయితవనంగ మాత్రం మమ్ముల్నందర్ని పనిటిసిపెట్టి ఆల్లతోని రమ్మన్నరు. ఊరవతలి దాంక మేమూ ఊల్లునోల్లు, అందరంగలిసి పోయినం. ఆయిన పేరేందో ఆ పెద్ద దొరచ్చిండు. ఆనాడు మన కచ్చీర్ల కాయిదం గొట్టలే? ఆ కాయిదంల ఉన్నదొర. ఆయిన్ని పందిట్లదాంక 'జై' 'జై' అనుకుంట దెచ్చినం. పందిట్ల కాయినె అడుగు పెట్టంగనే మమ్ములను దోలుకొని అంటకాడికి దీసుకపోయిరి. ఆడ నీల్లు నింపుడు, ఇత్తార్లేసుడు, ఊడ్చుడు దీంతోనె సరిపాయె. ఒక్కమాట సబల జెప్పిందింటె ఒట్టు. రోజు ఎంతమంది దింటాండిరో ఏమొ? అంతమంది యాడ్నుంచి అచ్చింరో ఏమొ? ఒక్కొక్క బంతికి మున్నూరుమందిదాంక లేత్తాండిరి. అసుంటియి పూటకు ఇరువయి బంతుల్లేసేటియి. బంతికి కూకుండగనే ఇత్తార్లేసుడు; ఆల్లందరికి నీల్లువోసుడు, ఆల్లు లేవంగనె ఆ ఇత్తార్లు దీసుడు. మల్లా ఇంకొగబంతి. ఇట్ల యిరువయి బంతుల్లేసెటాల్లకు పొద్దంగు. మేం బుక్కెడు దిని లేస్తుం. సుట్ట ఓబుక్క దాగుతుమొ లేదొ మల్ల మొదటి బంతోల్లు ఇంకోపూటకు తయారవుదురు. ఇగెప్పుడు దీరాలె. అందరు రెండుపూటలు తినెటాల్లకు నాత్తిరి రెండు జాములౌ. ఇట్ల సబ జరిగిన మూడురోజులు పెద్ద పెద్ద దొరలచ్చి మంచి మంచి మాటలు జెప్పుతాంరనేగాని, ఒక్క మాటిన్న పాపాన పోలేదు. అన్నందుకు ఆకరునాడు, అదేం సబనో రెండు జాములాత్తిరికి మొదలు పెట్టింరు. ఆ నాత్తిరి పోదామన్నా పందిట్లకు పోనియ్యకపోయిరి. కట్టెపట్టుకొని ఏవడో సోప

లకుపోయె పోరగాడు అడ్డగిచ్చె. లోపలికెల్లి ఎవరో ఉరికచ్చి నన్నాడ జూసి, బల్లమీద జంపుకానాలు దులుపాల్నని, నన్ను దోలుకపాయె. న్యాలమొ అన్యాలమొ, జంపుకానాలు దులుపపోయినోన్ని ఇగాన్నే కూకున్న. మొట్టమొదలు ఎవలో ఒకాయినె, కల్ల కద్దాలు బెట్టుకున్నడు, హరిదాసోలిగె శెల్లాగప్పుకున్నడు ; లేసి పుత్తకాలు రాసెటోల్లకని ఏమేమొ జెప్పిండు. పుత్తకాలల్ల దరిద్రుల కతలుండాల్నట. ఎవడు జదువతడు పటేలా ? మరి మాకేమొ సదువే రాకపోయె. సదువచ్చినోల్లేమొ దరిద్రులు గాకపోయిరి. అయినా ఆయినె పుత్తకాలు రాసెటోల్లకు జెప్పిండు, ఇని అల్లు సప్పట్లుగొట్టింరు. నడుమ నాకెందుకు, ఆ మాటజెప్పి ఆయినె గూకుండగనె ఇగ పాటలు జదువుడు మొదలు పెట్టింరు. సుక్క పొడిసె దాంకా దెగలేదు. ఒక్కొక్కలే వత్తరు. ఒకటో రెండో పాటలో పద్దాలో జదువుతరు. దిగుతరు. దిగినోడు మల్ల ఎక్కడు. ఇట్ల తెల్లారగట్లదాక జదివినోడు మల్ల జదువకుండ జదివింరె పాటలు. నాత్తిరాయె ఏం పని లేక పాయెనని పోయికూకున్న. తపుల, తాలం, ఆర్మోని, మద్దెల, ఏది లేకుండగనె జదువుతాంరు. ఒగలో రాగంల జదివితె ఇంకోలింకో రాగంల జదివిరి. అయ్యన్ని అల్లు గట్టిన కయిత్తాలట. అయితే రాగంలేకుండ జదువాన్నా ? మనూరు పొట్టిలింగడు కయిత్తం గడితె ఏం కమ్మగ జదువుతడు. తాళం లేకపోతే మానాయె. చేతులున్నయి గదా ? చప్పట్లు గొడితె అరిగిపోతాయి ? పాటంత అయిపోయినాంక అందరు గొడ్తరేమె చప్పట్లు? తాలం గలిసెటట్లు అల్లకు గొట్టరాదా ?" ఎరుకలేని మల్లయ్యా పటేలయ్యాకేమన్న ఎరుకనేమొ అని అడిగిండు.

"కాదోయి పిచ్చిమల్లయ్య, అంతయి పోయిన మోలిగె చప్పట్లు గొడితె, అల్లు చదివింది మంచిగున్నదన్నట్లు." పట్నం పోయిన మల్లయ్యకు తెలువ జెప్పిండు పల్లెటూరి పటేలు, "గట్లనా ? మరె అన్నిటికి గట్లనె కొట్టింరు, అన్ని మంచిగున్నయనేనా ? ఏమొ అల్లుగొట్టిన కొద్ది

నేను గొట్టిన. దొమ్మరాట జూడంగ గొట్టినట్టు. తెల్లారగట్లదాక అట్లనే పాటలినుకుంటగూకున్న. ఇగ తెల్లారినమోలె అందరు ఎల్లిపోతాంరు. అందరికి బిస్తర్లు కట్టాలె. ఆల్ల బిస్తర్లన్ని లారీలల్లనింపి ఆల్లందరిని తేసనకు సాగదోలెదాంక నిదురవోలె. ఆల్లందరెల్లిపోంగనె ఆనాడు నాత్తిరి దాక పందిల్లిచ్చుట్ల బెట్టింరు. ఒక్కపూటల అంత ఇచ్చిపెట్టినం. నాలుగు రోజులు కట్టపడి తయారుజేసిన పందిరి ఇచ్చుడుకు దప్ప మాకెంద కక్కరికచ్చినట్టు ?" మల్లయ్యడిగిన ఈ పెద్ద ప్రశ్న, "వేడుక బొమ్మరిండ్లిసుకలో బాగొప్ప నిర్మించి" పటేలయ్య నీ పద్దెం జదివెటట్టు జేసింది. "ఏదో మనకోసం రజాకారోల్లను ఎదుర్కొని రాజ్జం సంపాయించిపెట్టి సబలు జేసుకుంటున్న పెద్ద పెద్దగ సదువుకున్నోల్లకు మేం జేయగల్గినంత రెక్కలకట్టం జేత్తనే ఉన్నం. పనంత అయిపోయినమోలె నాలుగు జొన్న రొట్టెలు సద్దిగట్టిచ్చి సాగదోలింరు ?" మల్లయ్య జెప్పిన సబసంగతి పటేలయ్య బాగానే ఇన్నడు. కాని పటేలయ్య యినాలనుకున్నది, సబల జెప్పిన మాటల సంగతి, అది మల్లయ్య కేమెరుక ? ఇంతలకె "ఏం పంతులుగారూ ? అంతా బాగేనా ?" అనుకుంటచ్చిండు ఆ వూరి అయ్యోరు రెంకయ్య. అయ్యోరెంకయ్యగూడ సబజూడ వోయిండు పట్నం. మల్లయ్యంత ముందుగ పోలేదుగని, మల్లయ్యకంటె ముందుగనె వచ్చిండు. "ఎంకయ్య పంతుల్తోటి ఇయ్యాల్రేపు మాటే బంగారమై పోయింది మల్లయ్యా, పట్నాలకు పోతాండు సబలల్ల దిరుగుతాండు. మన సంగతే మరచిపోతాడు." పటేలయ్య తాను ఎంకయ్యపంతులు కిచ్చిన దానాలన్ని యాదికచ్చెటట్టన్నడు "మీరుగూడా అలాగే అంటెట్ల పటేలుగారూ ? మీ నీడన్నే మేం బతుకులువెళ్ళబోసుకుంటు ఉంటిమి. మీరేంది మల్లయ్య ఏంది ? ఓసంవరిక్షేమము మా బతుకు. మిమ్ములను మరచి పోతె ఎట్ల ?" నక్కవినయం జూపిచ్చుకుంటున్నడు అయ్యోరు. "ఏదో అట్లన్నగని, పట్నం సబకుపోతివి సంగతులు జెప్పవు, మల్లయ్య నడు

గుతె ఇంతసేపు ఏమేమోజెప్పిండు. అల్లు జెప్పిన మాటలు ఒక్కటి జెప్పలేదు." కోరికదీరనిపచేలు ఎంకయ్య నడిగిం డీమాటు.

"ఐతె అయ్యగారూ మీరుగూ దచ్చినారుంౘని పట్నం సబలకు ?" ఊరోడు వచ్చి కలువకుండ పోతడా అనుకునే మల్లయ్య అడిగిండు. "ఆ ఆ నిన్నుగూడ జూచిన. నువ్వు నాకు మాకనుపడ్డవు, నువ్వే నన్ను జూశ్లేదు." అయ్యగారు మల్లయ్యమీదనే తప్పంత మోపాల్నని జూసిండు. "నేను సూడకుంటె సూడకపోతి, సూసినోల్లు మీరన్న పిలుత్తె మాట్లాడప పోదునా ?" మల్లయ్యడిగిన సవాలుకు అయ్యోరెంకయ్య దగ్గర జవాబు లేదు. అయ్యోరెంకయ్యపాపం పట్నంల మల్లయ్యను మాట్లాడియ్యాల్నని మాఅనుకున్నడు. కాని తనచుట్టున్న సోపతిగాన్లు నల్లబట్టలతోనున్న మల్లయ్యతోని మాట్లాడుతాంటే జూసి నవ్వుతరేమొ ననిపిచ్చి ఊరుకున్నడు. ఆ సంగతి మల్లయ్యకు జెప్పటానికి ఎంకయ్యకు నోరెట్లొస్తది ? ఎంకయ్య జవాబియ్యక పోయెటాల్లకు మల్లయ్యకు గొంత అనుమానమే అయింది. తనను తనూరి ఎంకయ్యనే చిన్నచూపు జూసిం డనుకునెటాల్లకు మల్లయ్య కాడఁడ బుద్ధిగాలె. పొద్దంగుతుంది. మల్లయ్యకు ఇంట్ల నాగండ్లు గట్ట జూసుకోవాలె. ఈడుంటె ఇగ ఎంకయ్య చెప్పే సంగతి ఇనాలె. పట్నం వేటికోసం బోయిండో ఆ సబల సంగతే. ఆడికిబోయినా అంటని సబలసంగతి మల్లయ్య కీడెందుకు ?

మల్లయ్య అన్నం చెల్లిపోయిండు. పొద్దు అంగుతుంది తల్లి కడుపులకు ఎట్టవడుకుంట.



7



# ఏకాకి

❖

శ్రీమతి నందగిరి ఇందిరాదేవి

---

జననం : 1919

చిరునామా : 123, మారేడుపల్లి, సికింద్రాబాదు.

కార్యకలాపాలు : —

అభిరుచి : కథాసాహిత్యము.

రచనలు : ముద్రితము : కథలు సంచికల్లో - రేడియోలో.

అముద్రితం : —

అభిమాన రచయితలు : మొపజాన్, చలం.

*

౪

# ఏకాకి

ఆ అమ్మాయి ఈ ప్రపంచానికి సంబంధించని వాతావరణంలో పెరిగింది. ప్రపంచంలో ఉండే కుళ్లు మోసం ఏమీ తెలియనియ్యకుండా పెంచారు, ఆమె తలిదండ్రులు. కొందరుంటారు తమ పిల్లలను అవతలికి కదలనియ్యక ఇంకోళ్ళతో కలిస్తే చెడిపోతారని ఎప్పుడూ అతిజాగ్రత్తగా ఇంట్లోనే మూసిపెట్టుకొనే తలిదండ్రులు. బళ్ళోకి కూడా సరిగ్గా పంతులు వచ్చాక పంపటం, పంతులు పోగానే పిల్చుకురావటం, అట్లాంటి పిల్లలు తన్నులు తినటంలోని రోషంకాని తన్నటంలోని హాయికాని అనుభవించకుండా పెరుగుతారు, అతి అమాయికంగా మంచిగుణాలన్ని కలిగివుంటూ. కాని అనుభవంలోకి వచ్చేటప్పటికి చెలాకితనం ఏమీలేక ప్రపంచాన్ని ఎదురుకోలేక బాధపడతారు.

ఆ అమ్మాయి తండ్రి వ్యవసాయం చూసుకునేవాడు. కాస్త పాడి పంట ఓ రకంగా ఉన్నవాళ్ళే గనుక తల్లికి పాలుతోడెయ్యటం, మజ్జిగ చిలకటం, వెన్న తియ్యటం, వంటవార్పులతోనే సరిపోయ్యేది. వాళ్ళకు పై ప్రపంచంతో సంబంధమేలేదు. దేవుడిచ్చిన పొలంతో బతుకుతూ ఒకాయిజోలి అక్కరలేకుండా భారత భాగవతాలతో కాలక్షేపం చేసేవాళ్లు తీరికసమయాల్లో. పక్కయింటి వితంతు అమ్మాయి దీక్షితులుగారి అల్లుడితో లేచిపోయిన సంగతి ఊరంతా పొక్కిపోయిన తరువాత పిల్లలు ఎవ్వరూలేకుండా చూసి "ఆ అమ్మాయిసంగతి విన్నారా?" అనేది తల్లి ఉండబట్టలేక. "పోనిద్దూ మనకెందుకు" అనేవాడు తండ్రి. చెడిపోవటానికి అట్లాంటివార్త వినటమే చాలునన్నంత భయంతో అది పైకి రానీయకుండా అణచేసేవాడతను. ఇట్లాంటి తలిదండ్రుల మధ్య పెరిగింది ఆ అమ్మాయి వెంకటనరసమ్మ.

వెంకటనరసమ్మకు పెళ్ళియీడు వొచ్చిందని బడి మాన్పించేసారు. ఇంట్లోనే కావ్యాలు సాధనచేయించేవాడు తండ్రి. కాస్త బుద్ధి తెలిసినాకొద్దీ ఆమె తనకు కాబొయ్యే భర్తను ఊహించుకునేది. రామాయణం చదివి నప్పుడల్లా రాముడిలాంటి ఏకపత్నీవ్రతుడయిన భర్త లభించాలని కోరు కునేది. అట్లాంటివాడి మహిమ తెలియక రాముడి పొందుకోరి వచ్చిన శూర్పణఖకు అయిన శాస్తిని మళ్ళీ మళ్ళీ చదివేది. నలదమయంతుల కథ చదివి వాళ్ళ ప్రేమానురాగాలు వాళ్ళ విరహం తలంచి తల్లడిల్లేది. కిరాత కుణ్ణి భస్మంచేసిన దమయంతి పాతివ్రత్యమహిమను ఆదర్శంగా ఉంచు కునేది.

వెంకటనరసమ్మ పెళ్ళి సందర్భంలో ఒకరిని దేహీ అనకుండా నిజదార సుతోదర పోషణార్థం హాలికుడుగా బతకటం కన్నా కాస్త రెండు ఇంగ్లీషుముక్కలు చదివి, సూటు ధరించి పట్నవాసంలో గులాంగిరీ చేసి సంపాయించే ఏ ముప్ఫయి రూపాయిల గుమస్తా అయినాసరే, తమకంటే గొప్పవాడుగా తలంచే ప్రపంచ తత్వానికి శాస్త్రిగారు కూడా లొంగి పొయ్యారు. కాలేజి చదువు చదివి ఓ మోస్తరుగా పట్నవాసంలో సంపా దించుకుంటున్న రామారావు స్థిరపడ్డాడు వెంకటనరసమ్మకు. కట్నాలు కానుకలతోసహా పెళ్ళి జరిగిపోయింది.



వెంకటనరసమ్మ కాపరానికి వచ్చిన తరువాత రామారావుకు వేతనం కూడా వృద్ధి అయింది. గట్టిసిగ, ముక్కుపుడకలు, మొహంనిండా పసుపు, పెద్ద కుంకుమబొట్టు, కాళ్ళకు పట్టాలు, వేళ్ళకు మట్టెలు పెట్టుకునే నరసమ్మ సహజంగా అందమయింది కాబట్టి పట్నవాసానికి తగిన అలంకరణాలతో

భర్త అభిరుచి కనుగుణంగా వేషభాషలను మార్చుకోగలిగింది. భర్తకు ప్రతివిషయంలో అనుకూలంగా అనురాగంగా ఉండేది. ఆమెకు భర్త అపరదైవం. తల్లి దండ్రి గురుడు దైవం అంతా అతనే. తనకు వ్యక్తిత్వం కాని ప్రత్యేకత్వం కాని యేమీలేదు. అతని కిష్టమయిన రంగుల్లోనే చీరలు కట్టేది. చివరికి రుచుల్లో కూడా అతనికిష్టమయిన గుమ్మడికాయ ఆమెకు తీపి. అతనికిష్టం కాని కాకరకాయ ఆమెకు చేదే. అతను ఆఫీసునుండి రావటం ఆలస్యమవుతే ఎన్నో అపాయాలను ఊహించుకుంటూ వీధి కిటికిలో నిలబడి చూచేది అతను వచ్చేదాకా. రాగానే "అమ్మయ్యా వచ్చారా! ఎంత భయపడ్డాను!" అనేది. అతను విడిచిన కోటును వంకెకు తగిలిస్తూ ముద్దుపెట్టుకునేది హృదయభారం తగ్గేటట్టు. "ఆఁ రాకపోతే నన్నెవరన్నా పెళ్ళిచేసుకుపోతారా?" అని ఎగతాళి చేసేవాడు రామారావు ఆమె ఆదుర్దాను.

రామారావు కూడా ప్రేమగానే ఉండేవాడు ఆమెతో. దయగానే మాట్లాడేవాడు. అప్పుడప్పుడు సినిమాలకు తీసికెళ్ళేవాడు వెంకటనరసమ్మను. మైరావణ, భూకైలాసం, స్వప్నసుందరి లాంటివాటికి ఆమె రుచికి అవ్వే సరిపడతాయని. వేషమంటే మార్చుకో గలిగింది కాని అభిరుచులెల్లా మారతాయి! ఆమెకు అదే పదివేలు. భర్త ఔదార్యాన్ని మనసులో కొనియాడుకుంటూ భోజనాలు చేస్తున్నప్పుడు తాను చూసివచ్చిన సినిమాలను డిస్కసుచేసేది. బ్రహ్మ, విష్ణు మహేశ్వరుల డ్యూటీలు వాళ్ళ ప్రతాపాలు, వాళ్ళ మధ్యన నారదుని చాకచక్యం మొదలయినవి. నారదుడు సినిమాలో ఏ సహాయంలేకుండా అమాంతం ఆకాశంనుంచి చిరుతగజ్జెలతో సహా దిగిరావటం మననం చేసుకుని "నిజంగానండీ! బతికుండగానే స్వర్గానికి వెళ్లేవాళ్ళు పుణ్యాత్ములయినవాళ్ళు మహిమ అదంతా" అనేది. ఆమెను కాంట్రడిక్టు చేయకుండా ఆమె అమాయికానికి నవ్వుకునేవాడు రామారావు.

రోజులు కులాసాగానే గడిచిపోతున్నాయి. కాని రామారావు ఆలస్యంగా రావటం మాత్రం కాస్త తగాదాకు కారణమయ్యేది. సాయంకాలం ఆలస్యంగావచ్చి కాస్త ఏదయినా నోటగొట్టుకొని మళ్ళీ రాత్రిదాకా రాకపోవటాన్ని చూచి వెంకటనరసమ్మ చాలా ఆందోళనపడేది. చీకట్లో అంత పొద్దుపొయ్యేదాకా ఉండక తొందరగారమ్మనేది రోజు. కాని వేతనం వృద్ధి అయినందువల్ల పనికూడా అట్లాగే చేయాల్సివుంటుంది - అని నచ్చ చెప్పేవాడు రామారావు. తమభర్తలు ఏం పనిచేస్తారో, ఎంతజీతందొరుకుతుందో ఏమీతెలియని ముగ్గల్లో జమ అయిన వెంకటనరసమ్మకు ఆ పట్టింపు అంతగా లేకపోయింది.

3

ఒకరోజు ఒక కుర్రాడు చీటితెచ్చాడు రామారావుకియ్యమని. అది చూసుకుని అగ్గిఅయిపోయింది. కోపంతో వాణికిపోయింది. ఏదో ఊహించరాని ఉపద్రవం వచ్చినట్టు బాధపడసాగింది. రామారావు రాగానే ఆ చీటి కాస్త అతనిమీద పడేసి తనకేదో పెద్ద అన్యాయం జరిగినట్టు గదిలోకి వెళ్ళి ఏడవటం మొదలు పెట్టింది.

రామారావు చీటీ చూసుకున్నాడు. తెలివయినవాడు కాబట్టి చీటి మడచి జేబులో పెట్టుకుని ఆమెను సముదాయించటానికి వెళ్ళాడు గదిలోకి. ఏడుస్తున్న ఆమెను లేవనెత్తి తన చేతుల్లోకి వేసుకుని ప్రేమగా లాలిస్తూ,

"చూడు నరుసూ, ఈ కాస్తకే నువ్వెట్లాగోలపెడితే యెట్లాచెప్పు. ఆమె చాలా మంచిమనిషి. నీకు వీళ్ళందరితో కలవటం ఇష్టం ఉండదని నిన్ను తీసికెళ్ళలేదు. ఇట్లాంటి స్నేహితులు ఇంకెంతమంది ఉన్నారో తెలుసా నాకు. ఆమె నాకు చాలారోజులబట్టి పరిచయం. అందులో తప్పే

ముంది చెప్పు! ఉత్త పిచ్చిపిల్లవి! కావలిస్తే నిన్నుకూడా తీసికెడతాను, సాయంకాలం" అన్నాడు.

మంచుకరిగినట్టు కరిగింది నరసమ్మ హృదయం అతని మంచి మాటలకు. అతనిమీద అనుమానపడ్డందుకు నిందించుకుంటూ తక్షణం లేచి పనిలో ప్రవేశించింది.

లీలావతి గొప్పయింటి యిల్లాలు. కాస్త చదువు సంస్కారాలు గల మనిషి. ఆమె వయసుమీరిన భర్త ఆమెకు మంచి వయసువచ్చేటప్పటికి కావలసినంత ఆస్తి వొదిలిపెట్టి చనిపోయినాడు. ఒక్కొక్కరికి ఒక్కొక్కరకపు ఆదర్శం ఉంటుంది. కొందరికి అస్తమానం ప్రయాణాలు చేయాలనివుంటుంది. కొందరికిబాగా డబ్బుకూడబెట్టాలని ఉంటుంది. కొంరికి రకరకాల పిండివంటలు తినటంలో అభిరుచి. అట్లాగే లీలావతికి అట్లాంటివి తాను తినటంలో కంటె ఇతరులకుపెట్టడంలో ఆమెకు అమితానందం. ఆమె జీవితంలో ఆమెను అందరూగొప్పచేసి మంచి అనాలని ఆమె ఆదర్శం.

ఆమె ఇంట్లో ఒక్కర్తే అయనా ఇంటినిండా వచ్చిపొయ్యేచుట్టాలు, ఎక్కణ్ణుంచో బంధుత్వం కలుపుకున్న బీద విద్యార్థులు, నౌకర్లు చాకర్లతో నిండివుండేది అమె యిల్లు. ఆమె తన ప్రాపకంలో ఉన్నవాళ్ళందరికి అన్నిరకాల సౌకర్యాలు కలిగించి సంతోషించేది. కాస్త చదువు సంస్కారాలుగల మనిషికాబట్టి స్నేహితులు కూడా చాలా ప్రేమించే వాళ్ళు ఆమెను. మగవాళ్ళుకాని ఆడవాళ్ళుకాని అందరితో చాలా కులాసాగా ఉండేది. తన యిల్లు తాను ఆదరణకు (Hospitality) కి పేరుపొందాలని ఆమె ఆశయం. ఆమె కొద్దో గొప్పో దానం పంపని ప్రజాసంస్థ ఒక్కటీ లేదు. అంతా ఆమెను "ఓహో" అని పొగిడిపోస్తే ఆమెపొందే హాయి సంతోషంకోసం ఆమె తన డబ్బును ఎంతయినా వెనుదీయకుండా ఖర్చుపెట్టేది. ఆమె ఈ మంచి పేరుకోసం ఎన్నోసార్లు తనకు ఇష్టంలేని

వాళ్ళతో మాట్లాడాల్సివచ్చేది. తనకు నమ్మకం లేకపోయినా సంవత్సరానికోసారి వ్రతాలుకూడా చేయించి బ్రాహ్మలకు భక్తిగా ప్రణమిల్లి సంభావనలు ఇచ్చేంత విపరీతంవరకు పెరిగిపోయింది.

సాయంకాలం కాగానే వెంకటనరసమ్మ రామారావు లీలావతి యింటికివెళ్ళారు. ఆమె యింటిముందరి చిన్న గేటులోపల రకరకాల పూలమొక్కలు, గులాబీలు, క్రోటనులు ఎంతో అందంగా ఉన్నాయి. లోపల తలుపుముందర కూర్చుని ఉన్న వాళ్ళ "రోజు" కొత్తవ్యక్తిని చూడటంతో "భౌ" మన్నది. రామారావు "రోజీ రోజీ" అని పిలవటంతో తోక ఆడించుకుంటూ వెళ్ళమన్నట్టు ఊరుకున్నది. గరాజుదగ్గర కబుర్లాడుతున్న వాళ్ల డ్రైవరును "అక్క వున్నారా?" అని అడిగాడు రామారావు. వెంకటనరసమ్మ ఈ వరుసను తృప్తిగా విన్నది. లీలావతి అందరికీ అక్కే. ఆమెకంటె పెద్దవాళ్ళుకూడా ఆమెను అక్క అని పిలుస్తారు. అది ఆమె పట్ల గౌరవవాచకంగా ఉపయోగపడేది. ఉన్నారనిచెప్పాడు. వరండాలోంచి హాలులోకిదోవ. అంతా విలువయిన ఫర్నిచరుతో ఫర్నిషుచేసి ఉన్నది.

ఆమె కింద లేకపోవటం మూలాన సరాసరి మేడమీదికి వెళ్లాడు. మేడమీద సోఫాలో ఒరిగి కూర్చుని ఆమె రేడియోపాట వింటోంది. ఆ యింటి ఆలంకారం, శోభ, నాజూకుదనం, అంతా చాలా fine taste గల మనిషిలాగా కనబడుతోంది. మెట్లమీదనుండి రామారావును చూడగానే ఏదో కొత్త ఉత్సాహం పుట్టుకొచ్చినట్లు లేడిపిల్లలాగా చంగున గంతేసి నిలబడి అతనిని చిరునవ్వుతో ఆహ్వానించింది. కాని రామారావు వెనకాల నిలబడిన ఆ కొత్తవ్యక్తిని చూసి కాస్త బొమముడితో చప్పున వెనక్కు తగ్గింది. మళ్ళా మామూలు చిరునవ్వుతో "యెవరు రామం! ఈ అమ్మాయి?" అని అడిగింది. లోపలికిరండని ఆమెను కూడా రమ్మంటూ రామం అంటూ అంత చనువుగా ఆమెపిలవటం వెంకటనరసమ్మ గమనించింది.

తన పోషణలో ఉన్న ఒక కాలేజి విద్యార్థిద్వారా పరిచయమయ్యాడు రామారావు లీలావతికి. రానురాను అతని కళాభిరుచి సారస్వతాభిరుచి ఆమెను ఆకర్షించాయి. ఎంతో కులాసాగా ఎన్నో విషయాలు వాదించుకునేటంత పరిచయులు అయ్యారు. తనతో సమంగా వాదించగలిగిన ఆమె చాతుర్యాన్ని ఆశ్చర్యంగా పొగిడేవాడు రామారావు. ఆమె అతని లలిత విమర్శనను నూతన సమస్యలను సాధించగలిగే మేధాశక్తిని మెచ్చుకునేది. రామారావు ఏకారణంచేత నయితేనేమి లీలావతి హృదయంలో ప్రత్యేకస్థానం ఏర్పరచుకున్నాడు. కాలేజిరోజుల్లో డబ్బులేక అవస్థపడుతుంటే లీలావతిచేసిన సహాయాన్ని పొందటం మర్యాదకు విరుద్ధం అని రామారావు అనుకోలేదు. అందరికి ఇచ్చినట్టు మంచి పేరు కోసం ఇస్తున్నానని లీలావతి అనుకోలేదు.

రామారావు ఆమె చెరొక సోఫాలో కూర్చున్నారు. "ఈమె నాభార్య. నీకు చూపాలని తీసుకొచ్చాను" అన్నాడు, రామారావు వెంకటనరసమ్మను చూపిస్తూ. "అట్లాగా" అన్నది లీలావతి. "కూర్చొండి" అంది వెంకటనరసమ్మను చూసి. వెంకటనరసమ్మ కూడా కూర్చున్నది కుర్చీలో. రామారావు లేచి రేడియోదగ్గర కూర్చున్నాడు. లీలావతి వెంకటనరసమ్మతో "మీ తల్లి వాళ్ళు ఏవూరు? యెంతమంది అక్కచెల్లెళ్ళు?" అంటూ మానర్సుకు విరుద్ధం కాకుండా మాట్లాడింది. రామారావు ప్రోగ్రాం మార్చాడు. ప్రైంమినిస్టరుగారి ఉపన్యాసం అవుతోంది. రామారావు లీలావతి శ్రద్ధగా వింటోంటే వెంకటనరసమ్మ గదిలోని ఫొటోలను, కిటికీదగ్గర పెట్టిన క్రోటన్లను, క్రిందపరచిన తివాచీలను పరీక్షగా చూస్తోంది.

టీ పట్టుకొచ్చాడు వంటమనిషి కాసేపయాక. వెంకటనరసమ్మ మొహమాటపడితే తీసుకోమ్మని బలవంతపెట్టింది లీలావతి. ఆమె తన లిస్టులోనుండి వెంకటనరసమ్మను పోనియ్యలేదు. ఆమాట ఈమాట మాట్లాడి రాత్రి భోజనానికి ఇద్దరినీ ఆపింది. వెళ్ళేప్పుడు మర్యాదకోసం

అప్పుడప్పుడు వస్తూవుండమని అన్నది వెంకట నరసమ్మను ఉద్దేశిస్తూ. ఆమెరూపం, ఆమెమాట, తనయెడల ఆమెప్రవర్తన, ఆమెమీద కలిగిన దురభిప్రాయం నిశ్శేషంగా మాయమై పోయింది. ఇంటికి వెడుతూ ఆమె గుణగణాలను ఇంకా పొగడుతూ ఆమె డబ్బంతా మందే తినిపోతారని చెప్తుతూ ఒకసారి జబ్బు వడితే యెవ్వరూ ఆదుకో లేదని తనే రాత్రిం బగళ్లు కనిపెట్టుకు కూచున్నానని చెపితే సానుభూతితో కొట్టుకుంది ఆమె హృదయం.

౪

మనసులో వున్నదున్నట్టు చెప్పక చెప్పినట్టు చేయని ప్రపంచాన్ని యెరుగదు వెంకటనరసమ్మ. తెల్లటివన్ని పాలేనని అనుకునే వెర్రిబాగుల వెంకటనరసమ్మ లీలావతి పిలిచిందే తడవుగా తరచుగా వెళ్లేది వాళ్ళ యింటికి. లీలావతికి అది భారంగా ఉన్నప్పటికీ ఏమంటుంది! రావద్దని అనగలదా! రామారావు తీరిక సమయాల్లో తాను తయారయ్యేది వెంకట నరసమ్మ. ఆవూళ్ళో ఆమెకు స్నేహితులు యెవరూ లేనందువల్ల తన తీరిక సమయంలో ఆమెకూడా లీలావతి దగ్గరకు రావటం ఇష్టంలేక ఆమెను వొద్దనలేక తాను వెళ్లటమే మానుకున్నాడు రామారావు. లీలా వతికి రామారావు రాకపోవటం బాధగా వున్నా వెంకటనరసమ్మతో మంచి మాటాడక తప్పేదికాదు. పైగా ఆమె అమాయికానికి జాలిపడుతూ తాను ఆమెకు ద్రోహం చేస్తున్నానని జాలిపడేది. లీలావతి మృదుభాషణవల్ల మొహమాట ప్రవర్తనవల్ల ఆమెమీది గౌరవం హెచ్చు సాగింది వెంకట నరసమ్మకు. లీలావతికి ఇది తీరని సమస్య అయింది.

విసుగెత్తి రామారావును మరచిపోలేక ధైర్యంచేసి వెంకటనర సమ్మతోనే కబురంపేది. "అక్కను మరచిపోయేడు రామం" అని.

ఆమె రాయబారాన్ని బరువు హృదయంతో అందుకునేవాడు రామారావు. ఏం చేస్తాడు. తనమీద పెద్ద అనుమాన పడకుండా ఒక్కసారి పొరపాటు చేసేటప్పటికి అది ఇంత ప్రమాదకరంగా పరిణమించింది. వెంకట నరసమ్మకు తమ సంబంధం ఏమని చెపుతాడు ? ఆమె తనను లీలావతిని కూడా ఏకంగా ప్రేమిస్తున్నది. ఆ సంబంధం వదల్చుకోలేదు. ఎటూ తోచక ఏమీ పాలుపోక కొంపలోనే పడివుండేవాడు రామారావు. ఆలస్యంగా రాక పోవటాన్నిచూచి అప్పటల్లే పనిలేదేమో ననుకునేది వెంకటనరసమ్మ.

మంచిపేరుకోసం సహించగలిగిన వ్యక్తుల్లో జమకాక వెంకట నరసమ్మ లీలావతికి అతి సున్నితంగా గొప్ప గాయంచేసి బాధ పెట్టింది. ఆమె ఒంటరి జీవితంలోని కులాసాగా గడిపే కొన్ని ఘడియలుకూడా దూరమయినాయి. ఎన్నిసార్లు చెప్పిపంపినా రామారావు రాడు. వచ్చినా సతీసమేతంగా. అతని మెడకుపడి తన ఉబుసును వెళ్లగొట్టుకుందామంటే అవకాశం లేకుండా వెంకటనరసమ్మకూడా. కూడారావటంవల్ల తనను అనుమానించిందేమో నని అపోహపడేది. అట్లాంటి మనిషి అయితే మళ్ళీ తన గుమ్మం తొక్కుతుందా ? పండంటి వాళ్ల సంసారంలో తాను నిప్పులు వోయటం ఎంత అన్యాయం ?

ఏమయినా సరే రామారావును పూర్తిగా మరచిపోవటానికి నిశ్చయం చేసుకున్నది. వెంకటనరసమ్మకు అటు రామారావు గోలకాని, ఇటు లీలావతిగోలకాని యేమీ తెలియవు.

లీలావతికి అదివరకున్న హిస్టీరియా మళ్ళీ ఆరంభ మయింది. వెంకటనరసమ్మ ఏ నిమిషాన ఇంటికి వెళ్ళేదో కాని ఆమె పడక కని పెట్టుకుని సేవచేస్తోంది.

రామారావు సర్క్యూటునుండి అప్పుడే వచ్చాడు, వెంకటనరసమ్మ ఇంకా నిద్రలేవక ముందే ఒక కుర్రాడు చీటీ తెచ్చాడు.

నారాయణం,

నువ్వు ఒక్కడివే రా. ఇవి నా చివర ఘడియలు. నీ ముద్దు రుచిలో, నీ ఆలింగన సౌఖ్యంలో శాశ్వతంగా నిద్రపోతాను.

మీ కిద్దరికీ శుభమగుగాక !

నీ లీలా.

రామారావు చీటీ చూసుకుని కంగారుపడి ఎట్లు వున్న మనిషి అట్లా పరుగెత్తాడు.

లీలావతి చనిపోయి వారంరోజులయింది. వెంకటనరసమ్మకు ఒక ఆప్తబంధువురాలు పోయినట్టు ఉన్నది. ఒంటరిగా కూర్చొని ఆమెకోసం మెలుగెత్తి యేడ్చేది. రామారావు మొగవాడు కాబట్టి పొంగకుండా ఉన్నాడు. లీలావతి తన ఆస్తి అంతా రామారావు పరంచేసింది.

రామారావు ఆమె చనిపోయిన దగ్గరనుండి వింతమనిషి అయ్యాడు. తనే ఆమె చావుకు కారణమయ్యానని బాధపడసాగాడు. ఆఫీసుకు వెళ్ళటం పనులు చూసుకోటం అంతా ఎందుకూ ! ఎవరికోసం ? అతని హృదయం మళ్ళీ అట్లాంటి ప్రేమకోసం తహతహలాడింది. అతని బ్రతుకంతా నిస్సారం అనిపించింది.

ఇరవయినాలుగు గంటలూ ఆమె ఆలోచనతో బతకలేకుండా ఉన్నాడు.

ఆమెను కలుసుకుని తీరితేనేతప్ప తన ఆత్మకు శాంతి ఉండదని నిశ్చయం చేసుకున్నాడు,

చివరకు తన మనశ్శాంతికోసం రామారావు ఒకరోజు రాత్రి మాయమయ్యాడు.

ప్రియులిద్దరూ కనబడకుండా కలుసుకున్నారు.

అభం శుభం ఎరగని అమాయక వెంకటనరసమ్మ మాత్రం ఏకాకి అయింది. సహృదయతకు కలిగే ఫలితం ఇదేకాబోలు !

18



# ఏయిర్ మేల్

❖

శ్రీ వెల్దుర్తి మాణిక్యరావు

జననం : 1914

చిరునామా : వెల్దుర్తి. మెదకు తాలూకా; జిల్లా.
ప్రస్తుతం : షాదునగరం, మహబూబ్‌నగర్ జిల్లా.

కార్యకలాపాలు : ప్రభుత్వ ఉద్యోగం - ప్రజాసేవ.

అభిరుచి : గేయాలు - నాటికలు - కథలు.

రచనలు : ముద్రితం : రాజ్యాంగ సంస్కరణలు ; రైతు ; దయానందుల చరిత్ర; ఖాది; దయ్యాల పన్గడ; శ్రీ మాడపాటి హనుమంత రావుగారి జీవితం మొ.

అముద్రితం : 'హసీనా' బాలగేయాలు - 'మల్లి....' 'చేనుకాడ, మంచెమీద' నాటికలు - 'వెల్దుర్తి కథలు' - 'మాణిక్యాలు' గేయాలు.

అభిమాన రచయితలు : దాశరథి - కాళోజీ - శివశంకరశాస్త్రి - సానె గురూజి - ప్రేంచంద్.

౧౯

# ఏయిర్ మేల్

"పూర్ణిమా! లే, తెల్లవారొచ్చింది....టాన్గా, రిక్షాల సందడిగూడా మొదలైంది. పాపను తర్వాత లేపుదాంగాని."

రామం భార్యను మేల్కొలుపు తున్నాడు. అత్తవారు బొంబాయిలో ఉద్యోగరీత్యా ఉంటున్నారు. తన మరదలు పెళ్ళి. విధిలేక పూర్ణిమను బొంబాయికి ప్రయాణం చేయిస్తున్నాడు. రాత్రి మూడు ఝాములు మెలకువతో ఉండటంవల్ల పూర్ణిమకు నిద్రమబ్బు వీడలేదు.

"అబ్బా. ఏమి తొందరండి! ఏది చెయి చూతాం....కుడిచెయ్యి ఎవరిమ్మన్నారు?"

పూర్ణిమ, రామం ఎడమచెయ్యి పట్టి లాగి కూర్చోబెట్టి ఎడమ ముంజేతిని ఎడమచెవిదెగ్గరకి పోనిచ్చి "టక్, టక్, టక్, టక్," అన్నది కొంటెగా.

పెదవులు నవ్వులపువ్వులు విసరుతున్నట్టు కండ్లు వలపు జల్లులు చల్లుతున్నట్టు రామం కనిపెట్టాడు.

"అట్లంటే ఏమన్నట్టు?" అని ప్రశ్నించింది పూర్ణిమ.

"ఏమైనట్లో నీవే మొదలు చెప్పు. మీరు నా కనుచూపు మేరలో లేనంతసేపు నా గుండె యిట్లా కొట్టుకుంటుంది అన్నమాట. జీవామృతపు ఒక్కొక్క చుక్క ఆవిరై అదృశ్య మవుతున్నదన్నట్లు?"

"ఎప్పుడు వేదాంతమే నీకు."

"ఇప్పుడే కదూ పున్నమ తెల్లవారింది. రాత్రి తొమ్మిదినుంచి నాలుగు వరకు గడియారపు ప్రతిగంట మోతలో హెచ్చరికను గమనిస్తున్నాను. పైన చూదామా చందమామ నిండు వెలుగుతో పరుగెత్తుతున్నాడు.

ఓరళ తగ్గించుకోటానికి ఎంత తొందరపడుతున్నాడో అతను. ఇటు పక్కలో చూతామా పూర్ణిమ ప్రయాణపు గడియలు సమీపిస్తున్నవి నాహృదయాన్ని."

"ఔను పాపం కలతజెందిస్తున్నవికదూ?" అని పూర్ణిమ అందు కొన్నది.

ఇద్దరు రమ్మని తాము మరచిపోయినారు. ఒక అరగంటసేపు.

*　　*　　*　　*

"నాస్నానం అయింది. ఉపహారం గిన్నెల్లో సిద్ధంగా వున్నది ఇవిగో: ఈ డబ్బాలో యాపిల్ రవ్వావుండలు. ఈ బుట్టలో తయ్యారుగ కర్పిపెట్టిన అటుకులు, టిఫిన్ క్యారియర్ లో వర్సగా బజ్జీలు, పూరీలు, చేగోడీలు—ఇవి ముగిసేవరకు వుండలకు చేయిపెట్టవద్దు. హోటల్ ఫల హారం తింటె ఒట్టు." చీరకట్టు కుంటూనే ఒట్టుపెట్టుతూవున్న పూర్ణి మను, రామం కండ్లనిండ చూసుకున్నాడు. అట్లే చూస్తూ చిత్తరువువలె నిలిచాడు.

"అయ్యో! మిమ్ముల అడుగకుండానే" అని గునుగుకుంటూ రామాన్ని, పూర్ణిమ సామానుగదిలోకి తీసికొనివెళ్ళింది. పెట్టె విప్పింది. "చెప్పండి ఏది కట్టుకోవాలో" అన్నది. ఒకటొకటి మడతలు విప్పు తున్నది, రామం చూస్తూ వున్నాడు.

ఆకు పచ్చనిచీర, ప్రకృతి కన్య కోయిలల కూతలలో కట్టుకునేది. వెన్నెలకన్న చల్లనిదేమో అనిపించింది. ఎంచి యాపై దుకాణాలు తిరిగి ఉభయులు మెచ్చి తెచ్చికొన్నచీర, అది సీమంతంనాడు కట్టుకోవడం జరిగింది. ఆనాటి దినచర్య జ్ఞాపకం వచ్చింది. తలపూపినాడు రామం. మడత విప్పింది పూర్ణిమ. మొగిలిరేకుల వాసన గుప్పుమన్నది. ఎండి పసుపైన రెండు మొగిలిరెక్కలు రామం ముఖం మీద పడ్డవి. ఒళ్లు జలదరించింది. వాసన మొగిలిరెక్కలు చూచేసరికి ఎందుకో ఏమో గుండె

దడదడమన్నది. "పెరిగి పెద్దనయ్యే పచ్చరంగు కావాలంటె, ఈ ఎండిన పూరెక్కలేమిటి ?" అనే భావం మెరుపువలె వచ్చింది; పోయింది.

"నాన్నా ! నాకు పూల అంగి కావాలె" అంటున్న అమ్మాయిని ఎత్తుకొని బనారసీ బూటాల ఆకుపచ్చ ఫ్రాకు వెదికి తొడిగినారు. నవ్వు తున్న అమ్మాయిని చెరోచెంప ముద్దు పెట్టుకున్నారు.

ప్రొద్దునస్నానం చెయ్యగానే కుంకుమ పెట్టుకుంది— పూర్ణిమ సీసాల కుంకుమ, కలర్ కుంకుమ, సీమ కుంకుమలకు బదులు. సాయంత్రం ముస్తాబయ్యేటప్పుడు కుంకుమ బరిబె పెట్టినచోట లేదు. విచారాన్ని కనబడనీయకుండ అణచి సీమకుంకుమతో నుదుట బాల చంద్రుని దిద్దుకొని "ఏమంటున్నారు ?" అన్నట్టు రామంవైపు చూసింది.

ఉపహారానికి పదమన్నాడు రామం. మామూలు ప్రకారం కాఫీ గిన్నె అమ్మాయిముందు పెట్టి ఇంట్లో చేసిన బిస్కట్లు అందించింది. తాము చేసిన్ లడ్డూలు వడ్డించుకున్నారు. అది కావాలని పట్టుపట్టింది మూడేండ్ల సుధ. "నీకు సరిపడదు. తినగూడదు." అని తల్లి బుజ్జ గించింది. కావాలని కాళ్ళు రాసింది సుధ, అంతటితో రెండు కాఫీ కప్పులు పగిలినాయి. రామం ధోవతిచెంగు, పూర్ణిమ చీరెకొంగు తడిసి నాయి. ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. సుధను కోపగించడంకాని తాము కీచులాడటం కాని వారికి తెలియదు. నవ్వు తెచ్చుకొని ఇద్దరు రేగు పండంత లడ్డు యిచ్చి, సుధను బుజ్జగించి పాలుత్రాగించినారు. పూర్ణిమ తన కాఫీ రామానికిచ్చింది. రామం తనకు సాయంత్రానికని మిగిల్చిన పాలను పూర్ణిమకు ఇచ్చాడు. పాలు ఫలహారం అయిపోయింది.

"ఇకలే ప్రయాణసన్నాహానికి" అన్నాడు రామం.

టాంగావాడు సామాన్నెక్కిస్తున్నాడు. తాళంకోసం వెదుకుతూ పూర్ణిమ గదిలోకి వెళ్ళింది. రామం వెనకాలె వెళ్ళాడు. నిలువుటద్దంలో ఒకరినొకరు చూచుకున్నారు. కడుపులో ఏమిటో ఆవేదన చెప్పుకోరాదు.

యంత్రాల మోస్తరు తిరుగుతున్నారేకాని ఎవరి హృదయం వారి అధీనంలో లేదు. అద్దంలో నీడను చూస్తూ ఇద్దరు చేతులు చాచారు; పలిచారు.

వరండాలోకి వస్తున్న పూర్ణిమను, మరోసారి పలుకరిస్తామని "ఇదిగో!" అని పిలిచాడు రామం. తమలపాకు విడెం మరింత ఎరుపెక్కిన ఆ నాగ్గు పెదిమలు నాలుగు అంగుళాల అంతరంలో ఉన్నవి.

"పోతున్నావా పూర్ణమ్మా" పక్కింటి శేషమ్మ బొంగురు కుతుక వినపడ్డది. వణుకుతున్న పెదవులు కలువలేక వెనక్కు కదిలినవి. ఆశ ఉంటిపోయింది. ఎవరో అడిగినట్టు "ఏమంత తొందరపని పూర్ణమ్మా! దినాలుచూస్తే బాగులేవు. ఐనా, పంపించిరా నాయనా! రామం!" అంటూ జారుకుంది శేషమ్మ టాంగా ముందు నుంచి,

ముగ్గురు టాంగా ఎక్కి స్టేషన్ చేరుకున్నారు. పోర్టర్‌కు పావలా ఇచ్చి కంపార్ట్‌మెంటులో చోటుచేయించాడు. రైలు కదలటానికి పది నిమిషాలు మాత్రమే ఉంది.

"చూడండి" అని మొదలు పెట్టింది పూర్ణిమ. "సొమ్ముల పెట్టె తాళంచెవి అల్మారిలోని చందనపు డబ్బిలో ఉంది. చంద్రహారం, గుండ్లు, నాను, రెండుజతలగాజులు. నా వెంట ఉన్నవి. వెండికంచం, చెంబు, గ్లాసు, వెంకయ్యగారి కూతురి పెండ్లంటే యిచ్చాను. తెప్పించండి"....

...."అవుసలి కొండయ్య రెండు తులాల వెండిగిన్నెల బాబతు యివ్వాలె. చాకలికి ఈ నెలజీతం నేను ఇవ్వలేదు. మీ ఎర్రంచు ధోతి రావాల్సి ఉంది." ఈ విధంగా చేబదుళ్ళవరకు సంసారపు లావాదేవీలను అప్ప జెప్పింది. ఇప్పుడు రామానికి కావల్సింది సంసారపు గొడవకాదు. హాయి గూర్చు నాలుగు ముక్కలు, ఆ గొంతులోని మధురవాణి.

"ఉద్యోగులు బదిలి అయ్యేటప్పుడు కవిలెకట్టలు అప్ప చెప్పినట్టు ఇదేమిటి?" అన్నాడు రామం నవ్వుతూ.

"ఏదో చెప్పా లనిపించింది. మనసు కుదుటపడుతుందను కున్నాను. ఐనా మీకెన్నని జ్ఞాపకముంటాయి లెండి?" అన్నది పూర్ణిమ.

"ఇక నేను చెప్పుతాను విను." అంటూ రామం పర్సుదీసి. "ఇవి ప్రయాణం ఖర్చులకు, ఇవి కట్నాలకు, ఇవి చిల్లర ఖర్చులకు." అంటూ నోట్లు చూపించాడు. "ఫౌంటెన్ పెన్ ఇందులో ఉన్నది. ఏయిర్ మేల్ కవర్ విలాసం వ్రాసి వుంది. క్షేమంగా చేరినట్టు వెంటనే ఈ కవరు పంపు." అని చేతికందించాడు; స్పర్శసుఖం అనుభవించాడు.

రైలు కదలడానికి అరనిమిషం మాత్రమే ఆలస్యం ఉంది. హడా వుడిగా రైలు ఎక్కుతున్న రామిరెడ్డిని సమీపించి "మావా శ్శదే రైలులో వెళ్లుతున్నారు. నీవు బొంబాయికే వెళతానన్నావుగా! కామాటిపురాలో దించు. వెంటనే ఏయిర్ మేల్ కవర్ రాయి" అన్నాడు రామం.

"తప్పకుండా, అంతా జాగ్రత్త చేస్తాను. ప్రతిస్టేషన్‌లో పూర్ణ క్కయ్యను చూస్తుంటాను. నీవేమి చింతపడకు."

పచ్చ ఝండా ఎగిరింది.

"ఏయిర్ మేల్" అనే రామంకేక పూర్ణిమ చెవిలో మరోసారి ప్రతిధ్వనించింది.

రామం కలంబట్టి రెండు గీట్లు గీయలేదు. కాని—దినం గడి చింది. అరగంపైనా కనుమూయలేదు కాని—రాత్రి గడిచింది. ఉదయం పదకొండు గంటలు వీధిలో ఎయిర్ మేల్ వార్తా పత్రికల అమ్మకం హడా వుడి కేకలు వినవచ్చాయి. రామం పేపరుకొన్నాడు. "యవనపురంలో రైలుపైదాడి. సాయుధ గుండాల ఘోర దౌర్జన్యాలు" అని తాటికాయ లంత అక్షరాల శీర్షికలు. రామానికి ముఖంలో నెత్తురు చుక్కలేదు.

"కత్తులుఝళిపిస్తు గుండాలు ఆడవాండ్ల డబ్బాలో జొరబడ్డారు."

"తొక్కుళ్ళో పదిమంది పిల్లలు నలిగిపోయారు."

"సుమారు యాభైవేల లూటీ."

—ఇవి, అదే రైలులో ప్రయాణం చేస్తున్న ఒక ప్రయాణీకుడు చెప్పిన వివరాలుగా పత్రికలో వివరించబడ్డాయి.

ఆ పైన చదువలేక పోయాడు రామం. పత్రిక జారిపోయింది. చెమటలు కమ్ముకున్నాయి.

"పోస్టుమెన్" కేక వినబడ్డది.

రామం ఉలికిపడ్డాడు. కిటికీలోంచి చెయిచాపి ఉత్తరం అందుకున్నాడు. చించి చూచాడు.

హృదయం చినిగి చింపులైంది.

"రామం !

ఏమనిరాయను. చూచింది రాయటానికి కలం దూగటం లేదు. అమ్మాయి తొక్కుళ్ళో ప్రాణం విడిచింది. పూర్ణిమక్కయ్యను గూండాలు పట్టుకపోయినారు. చూస్తూనేనేమిచేయలేనందుకు బ్రతికి ఉన్నంతవరకు ఏడుస్తుంటాను. ఏమని మళ్ళీ నీకు నా ముఖం చూపించగలను?

—రాంరెడ్డి."

తెరచిన తలుపు తెరచినట్లే ఉంది. ఉత్తరం చేతిలో పట్టుకున్న రామం ఇల్లువిడిచి వెళ్ళిపోయాడు.

ఈ విశాల ప్రపంచంలో ఎక్కడికో, ఎమో? రామానికే తెలియదు.



25

# వోట్లకోసం

❖

శ్రీ అక్కిరాజు వెంకట జనార్దనరావు



జననం : 19, ఏప్రిల్ 1934

చిరునామా : 1-8-452, చిక్కడపల్లి, హైదరాబాదు-ద.

కార్యకలాపాలు : —

అభిరుచి : పుస్తక పఠనం, కథలు వ్రాయడం, హేతుబద్ధమైన విమర్శనాత్మకమైన రచనలు చేయడం.

రచనలు : ముద్రితము : 'ఆంధ్రపత్రిక', 'ఆంధ్రప్రభ', 'తెలుగు దేశం', 'నేత', 'చిత్రవిచిత్ర', 'బాల' మొదలగు పత్రికలలో వివిధరచనలు ప్రచురిత మైనాయి.

అముద్రితం : —

అభిమాన రచయితలు : "ప్రేమ్‌చంద్", పద్మరాజు, బుచ్చి బాబు, నార్ల, గోపీచంద్.

*

26

# వోట్లకోసం

స్కూలు ఫైనల్ పరీక్ష నెగ్గడంతో బస్తీగానె వ్యవహరిస్తున్న తన పల్లెటూరి హైస్కూలుకి స్వస్తిజెప్పి కాలేజీ చదువులకై నగరం చేరుకున్నాడు కే. వి. కాశీపతిరావు. కాలేజీ వాతావరణాన్ని చవిచూట్టం కాశీపతి కానాడే ప్రప్రథమం. అందువల్ల వాడు ప్రతిచిన్న విషయాన్నీ ఎంతో దీక్షతో పరిశీలించ నారంభించాడు. అసలు కాలేజీ చేరిన కొన్ని గంటల వరకూ కాశీపతి ఆ భవనాలనూ, ఆ తోటలనూ, విద్యార్థిసోదరులు విద్యార్థినులముందు ప్రదర్శించే చిత్రవిచిత్ర వైఖర్లూ మొదలగు విషయాలను పరిశీలించడములోనే గడిపాడు.

పరిశీలనా సందర్భంలో కాశీపతిని ఒక్క విషయం మాత్రం బాగా ఆకర్షించిందని చెప్పక తప్పదు. ఎటు చూచినా "ఎకనామిక్స్ అధ్యక్షతకై కోదండరామయ్యకే మీ వోటు నివ్వండి." "కామర్స్ కార్యదర్శిగా శోభనాద్రినే నెగ్గించండి" మొదలగు నినాదాలతో వాల్పోష్టర్లూ, పాంఫ్లెట్లూ తాటికాయలంతటి జాజు వ్రాతలు మహాప్రళయంగా గోడలనిండా అలంకరించ బడ్డాయి, రావు కిదంతా ఏమిటో బోధపడలేదు. మొన్న మొన్నటి వరకూ అతి హంగామా చేసిన జనరల్ ఎన్నికల తాలూకు ప్రచారాలై వుండవచ్చునేమో అనుకున్నాడు. అయినా రావు సందేహం తీరలేదు. తాను జనరల్ ఎలక్షన్‌ల సందర్భంలో ఇదివరకు చూసిన రాతలన్నిట్లోనూ.... ఫలానా బొమ్మవున్న పెట్టెలోనే మీఓటు వేయండి.... ఫలానా పార్టీకే ఓటు ఇవ్వండి....అని మాత్రమే చదివాడు. ఇలాంటి అనేక ఉపసందేహాలు రావు బుర్ర నాక్రమించడంతో అసలు సమస్య

వాడ్ని మరింత తీవ్రంగా ఎదుర్కొన్నది. బహుశా కాలేజీ ఎన్నికల గొడవలేమో అనుకున్నాడు. కాని ఈ సమాధానం కూడా రావు సందేహం క్రింద రద్దుకావాల్సి వచ్చింది. తాను హైస్కూల్లో చదివేప్పుడు విద్యార్థి సంఘపు అధ్యక్ష, కార్యదర్శి మొదలగు పదవులకు ఎన్నికలు జరిగేవి. అక్కడ ఇలాంటి ప్రకటనా ప్రచారా లేవీ జరుగ లేదే! అసలు రావు గుర్తులో అక్కడ ఏ పదవికైనా "పోటీ" అంటూ పడ్డట్లు ఎరుగడు. ఒకవేళ అలాంటివి ఒకటి అర కేసులు జరిగినా పెద్ద పంతులుగారే విద్యార్థు లందర్నీ సమావేశపర్చి చేతులెత్తమని వారి అభిప్రాయాలను సేకరించే విధానాన్నే రావు ఎరుగును. కాని ఇలాంటి ఎన్నికలు వాడెన్నడూ చూడ లేదు. చివరిసారిగా రావు ఊహకు తట్టిన కాలేజీ ఎన్నికల తాలూకు ప్రచారాలే అన్న అభిప్రాయం వాడిలో దృఢరూపాన్ని దాల్చింది. ఆ అభి ప్రాయం పైనే వాడు నిలిచాడు. ఎన్నో ఏళ్ళు కష్టపడి హెచ్. ఎస్. సి. డిగ్రీ పుచ్చుకున్న రావు బుర్ర ఆ విషయాన్ని గూర్చి అంతరాత్మతో వితర్కించ సాగింది. ఈ కాలేజీ సన్యాసులకు ఇంతటి వోయేకాల మేమొచ్చింది? ఒక్కనాటి భాగోతానికి మూతి మీసాలు గొరుక్కున్నట్లుగా ఏదో పదినెల్ల పెత్తనాలకు ఇంత హంగామా ఎందుకూ! కలసిన స్నేహితులతో చెప్పేస్తే సరిపోదు! అయినా ఇంతడబ్బు ఈ వెధవ ప్రచారాలకు వినియోగిస్తే వాళ్ళకు ఒరిగేదేమిటి? దుబారా ఖర్చులూ.... వీళ్లున్నూ....! ఇంకా ఏమేమో తలపోతలలోనే రావు గడిపాడు.

తన సందేహానికి తుదినిర్ణయంగా ఏవిషయాన్నీ గ్రహించ జాలని కాశీపతి ఎవరైనా సీనియర్ స్టూడెంటు నడిగి సంగతులన్నీ సంగ్రహించా లనుకున్నాడు. మూడేళ్ళ క్రిందటే కాలేజీ చదువులకై అక్కడికి వచ్చిన తనవూరు మునసబు కొడుకు గోపాలం వాడికా విషయాలలో మంచి సలహాదారుగా అవుపడ్డాడు. ప్రస్తుతం కాశీపతిరావు కూడా అక్కడే మకాం వేశాడు.

ఎడ్మిషన్ వ్యవహారాలు పూర్తిచేసికొని కాశీపతి. రూమ్ చేరుకున్నాడు. ఎప్పుడు వచ్చాడో గోపాలం కూడా అక్కడే వున్నాడు. మరెవ్వరూలేరు. అర్థంలేని ప్రశ్నలువేసి అమాయకత్వాన్ని రుజువు చేసుకునేరకం కాశీపతిదికాదు. అందువల్ల ఒంటరి సమయంలోనే గోపాలాన్నడిగి తన సందేహాల తీర్చుకోవాలనుకున్నాడు. ఉన్నంతలోనే ఎంతో తెలిసిన వాడిలా బెట్టుసరిగా వుండటమే కాశీపతిరావు అలవాటు.

"ఏంరోయ్ గోపాలం, ఈ కాలేజీవాళ్లు వట్టి దుదారా వాళ్లు ఏమిటోయ్!" అన్నాడు వాళ్ళను అపహాస్యం చేస్తున్న ధోరణిలో.

"ఎందుకోయ్! ఏం జరిగిందేమిటి?" అన్నాడు గోపాలం సహజమైన మూడ్‌లోనే.

"మరేమీకాదు. ఒక్కరోజు భాగోతానికి ఏమో....గొరుక్కున్నట్లు పదినెల్ల పెత్తనానికి ఇంత హంగామా ఎందుకూ? దుబారా ఖర్చులు కాకుంటే మరేంటి?"

కాశీపతికి తట్టిన ధర్మ సందేహాన్ని గోపాలం ఇట్టే గ్రహించాడు.

"కాలేజీ ఎన్నికల్లో నెగ్గటమంటే ఒక మంత్రిగారవటంకంటే ఎక్కువంటే నమ్మ కాశీపతీ" అన్నాడు, ఈ మూడేళ్ళలోనూ ఎన్నో పదవులకు పోటీచేసి పట్టీలుకొట్టి మహా అనుభవాన్ని గడించుకున్న గోపాలం.

కాశీపతికి నవ్వొచ్చింది. ఆ మంత్రులకూ, ఈ సన్యాసులకూ ఎక్కడి పోలికరా! అనుకున్నాడు.

"అందుకోసమే కాలేజీల్లో పదవులకోసం పడిచస్తారు" మళ్ళీ అందుకున్నాడు గోపాలం.

"ఇంతా చేస్తే వీరికి ఒరిగేదేమిటో చెప్పావేగాదు. అంతగా పనిచేయాలనిఉంటే ఏపదవీ లేకుండా చేయలేరా?"

"ఎబ్బే! పనిచెయ్యడానికా వీళ్ల పాటుపడ్తున్నా రనుకుంటున్నావ్! అసలు వ్యవహారమంతా వేరులేవోయ్."

"అదేంటోయ్ అంతటిరహస్యం!" ఆత్రంతో అడిగాడు కాశీపతి.

"కాలేజీలో ఒక్క పెద్ద పదవేదైనా చిక్కిందంటే టీ పార్టీలకూ డబ్బుకు కొదవంటూ వుండదనుకో. పోగా పేరు కూడా నాల్గు పేపర్లలో బడి మంచి పబ్లిసిటీ కూడా వస్తుందిలే. కాలేజీ మ్యాగ్జిన్‌లలో వడే ఫోటోలక్కూడా కొరత వుండదు. ఇంకా నాలుగు ఇతర కాలేజీలనుండి ఆహ్వానాలు రావడం, పదిమందితో కలవడం ఇంకా అవీయివీ అన్నీ జరుగుతాయ్ అంటే నమ్ము. ఇంతకంటే ఇంకా ఏం కావాలీ. అందుకే ఆ గెలవడానికి ఇంత హంగామా ఇన్ని తిప్పళ్లున్నూ." ముగించాడు గోపాలం సుదీర్ఘమైన ప్రసంగానంతరం.

"ఇందుకే కాబోలు ఎలక్షన్లంటే ఇట్లా పడిచస్తారు, ఇంత డబ్బును కురిపిస్తారు" చిరకాలంనుండి కాశీపతికి పీడిస్తున్న సందేహం పటాపంచలైంది.

"ట్వీడ్ సూట్లకిక్కూడా కొరతంటూ వుండదు పదవుల్లోకి వచ్చిన పెద్దమనుష్యులకు." మరోపాయింటు నందించాడు గోపాలం అప్పుడు మర్చాదు కాబోలు.

"టీ పార్టీలు, ఫొటోలు, ఆహ్వానాలు, ట్వీడ్‌సూట్లు ఇంకా.... ఏమో....ఏమో....నిజంగా ఎలక్షన్లలో నెగ్గేవారు ఎంత అదృష్టవంతులు!" కాశీపతి లోలోనే ఉప్పొంగిపోయాడు. "ట్వీడ్‌సూట్" ఒకసారి స్మరించు కున్నాడు. "ట్వీడ్‌సూట్ వేసుకుంటే నేనెంత అందంగా, దర్జాగా వుంటానో!" ఊహా గానాల నారంభించినాడు కాశీపతి. ముఖ్యంగా ఈ విషయమే వాడ్ని బాగా ఆకర్షించింది.

"తానుమాత్రం ఇవన్నీ అనుభవించటానికి అర్హుడుకాడా? నాయకత్వం వహించగల శక్తి సామర్థ్యాలు తనలోనూ మూర్తీభవించి

వున్నవే! తానూ ఎన్నికల్లో పోటీచేసి తీరాలి. నెగ్గితీరాలి, అవన్నీ పొంది తీరాలి." తన అభ్యర్థిత్వ భవనానికి ప్లాన్ వేయసాగాడు.

"తాను కాలేజీలోనైనా సరిగా చేర్లేదే! తన్నెవరూ ఎరుగరే. ఎలాగు గెలవడం?" మరో అనుమానం వాడ్ని ఆవరించుకుంది.

"మరి చూడవోయ్! ఇంతమంది పోటీచేసే ఈ పదవులకు నెగ్గడానికి వీళ్ళు పాప్యులారిటీ ఎలాగు సంపాదించుకుంటారోయ్?" తన సమస్యలపాలిటి పరిష్కర్త గోపాలాన్ని, పేషంట్ డాక్టర్నడిగే సంహాధోరణిలో అడిగాడు కాశీపతి.

"అదెంతటి పనోయ్! ఓ పదిమందిని మిత్రుల చేసుకోవాలి. అదే లాగంటావేమో! తన డిగ్నిటీకేమైనా భంగం వస్తుందేమో అనుకోకుండా వారికి దండాలుపెడ్తూ, చేతులు కల్పుతూ మంచిచేసుకోవాలి. ఖర్చుకు భయపడకుండా అప్పుడప్పుడు వారికి విందులుకూడా అరేంజ్‌చేస్తూ వుండాలె. వచ్చిన రోజుల్లో నేనూ నీలాగే తికమకపడి, క్రమంగా సంగతంతా గ్రహించి అలాగా అనుసరించా. ఒకటీ అర పదవులుకూడా చిక్కాయిలే." సలహాయిస్తూ తన అనుభవాన్నికూడా జోడించాడు గోపాలం.

ఎలక్షన్‌లలో నెగ్గటానికి గోపాలం చెప్పిన చిట్కాలు అతి సామాన్యమైనవిగా అపుపడ్డాయి కాశీపతికి. పది మందినీ మాటల్తో మచ్చిక చేసుకునే ప్రతిభకు తనలో లోటేమిలేదు. హైస్కూల్లో చదివేప్పుడు తానెక్కడుంటే అక్కడే బెల్లంచుట్టూ ఈగెలు ముసిరినట్లుగా పదిమందీ చేరేవారు. తాను చెప్పే విషయాలను వినడానికి తన వాక్చాతుర్యాన్ని వారు ఎంతో పొగిడేవారు కూడా. ఒక్కసారి గత జీవితంలోని మాధుర్యాలను సింహావలోకనం చేసుకున్నాడు కాశీపతిరావు.

పదిమందిలో పలుకుబడి సంపాదించుకొని తనమాటపై నడిపింపగల శక్తిసామర్థ్యాలకు తనలో కొరతంటూ లేదు. మరి ఎన్నికల్లో నిల

బట్టానికి దేనికిభయం? పోటీచేసి తీరాలి. నెగ్గి తీరాలి....ఇకతని నిశ్చ యానికి తిరుగుడు లేదన్నట్లుగా పదేపదే అనుకోసాగాడు కాశీపతి.

"తాను ట్వీడ్‌సూట్ వేసుకొని ఫోటోదిగుతే ఎంత బేష్‌గా వుంటాడో" ఎప్పుడో నాలుగోక్లాస్ చదివేప్పుడు క్లాసుపిల్లలందరు కలిసి దిగిన ఫోటోలో తనబొమ్మ ఎంతో అందంగా వుందని పొగిడారుకూడా. ఇప్పుడు అచ్చంగా ట్వీడ్‌సూట్ వేసుకొని దిగుతే వేరేచెప్పాలా! తన ఫోటో అచ్చయిన పత్రిక తప్పకుండా తన హైస్కూలుకు పంపించితీరాలి. ఆ తెలుగు మేష్టారు రామారావు తాను వట్టి పనికిమాలినవాడనీ ఎప్పుడూ తెలుగులో జీరోమార్కులే వస్తుండేవనీ ఎగతాళి చేసేవాడు. ఇప్పుడు కాలేజీలో తనకు అఖండ సన్మానానికి తెల్లమొహం వేసుకోక పోరాడా! హెడ్మాష్టరుగారు, పంతుళ్లు, పిల్లలూ తమ హైస్కూల్ ఉత్పత్తిచేసిన ఒక విద్యార్థి ఇలాంటి సమర్థుడూ, ప్రయోజకుడయినందుకు ఎంతగా గర్వి స్తారో! ఎప్పుడన్నా సెలవుల్లో అక్కడికి వెళ్ళినప్పుడు తన్నెంతగా సన్మానిస్తారో? తాను ఎన్నికల్లో నెగ్గినట్టుగా పేరు నాల్గు పేపర్లలో అచ్చ యితే ఎంతమంది చదువుతారో. అమ్మ, నాన్న, మామయ్య, అక్కయ్య, బావయ్య, ముఖ్యంగా "మరదలుపిల్ల" ఇంకా అందరూ చదివి తమ వాడు కాలేజీల్లో ఇంతగా వెలుగుతున్నందుకు ఎంతో మురిసిపోక ఊర్కొంటారా?" ఇకముందు తానందుకోబోయే ఉజ్వలమైన భవిష్య త్తుని గూర్చి తను తీయని కలలుగన నారంభించినాడు. కాలేజీ జీవిత రంగంలో తాను వహించనున్న ముఖ్యాతిముఖ్యమైన పాత్రనుగూర్చి ఆశాసౌధాలు నిర్మించ నారంభించినాడు కాశీపతిరావు.

"పాప్యులారిటీ" కోసరం అప్పుడే ప్రాకులాట్టం ఆరంభించినాడు కాశీపతిరావు. గోపాలం చేసిన కొన్ని సూచనలకు తోడుగా తనకుతోచిన చిట్కాలనుకూడా కొన్నింటిని కలిపి ఒక్కటొక్కటే తన్ను వలుకుటకై దేవత వరించే నిమిత్తం ప్రయోగించసాగాడు. "నామోషీ" అన్న పదా

ర్థాన్నే తనలో నుండి నిర్మూలించి తన వందనాలకు అర్హుడు అనుకున్న ప్రతివానికీ నమస్కారాలు చేయడం, చేతులుకల్పడం మొదలు పెట్టినాడు.

"నెహ్రూ విదేశాంగ విధానంలో ప్రదర్శిస్తున్న తటస్థవైఖరి శుద్ధ అవివేకంగా వుంది. యు. యన్. ఓ. అమెరికా సొత్తుగా తయారైంది. స్టాలిన్ ఐసెన్‌హోవర్ల మాటలన్నీ 'చెప్పేవి శ్రీరంగనీతులు, దొచ్చేవి మాలగుడిసెలు' అన్నట్లు వుంటాయి. అసలు ఇవాళ రేపటి విద్యార్థులకు స్టాండర్డు అంటూ ఏడుస్తేగా. బి. ఏ. ఫస్టుక్లాస్ (First Class) లో ప్యాసైనా ఇంగ్లీష్ మాట్లాట్టానికి తటపటాయిస్తారు." పదిమందీ వున్న చోట తయారై తానూ మాట్లాట్టానికి ఎలాగో అవకాశం కల్పించుకొని ఆర్థిక, సాంఘిక, రాజకీయాది వివిధ సమస్యలను గూర్చి చర్చలు మొదలు పెట్టాడు: తాను ఎంతో తెలిసినవాడు, రాజకీయ ధురంధరుడని నిరూపించుకోడానికి, తనకున్న కాస్తంత పత్రికా జ్ఞానానికి రెండు మూడింతలు గాలికబుర్లను తోడుగా కలిపి.

"ఒక కప్పు కాఫీనీళ్లు పోయించరా మళ్లీ వున్నప్పుడు డబ్బులిస్తా గాని" అని నోరుతెరిచి ఆప్తమిత్రులు ప్రాధేయ పడ్తేనే "మళ్లీ ఇస్తారన్న నమ్మకం ఏమిటి" అని జంకేవాడు. అసలుడబ్బుకు విలువంటూ వుందా అన్న ధర్మ సందేహానికి లోనయ్యాడు.

"పబ్లిసిటీ" కి తగిన సమర్థుడు అని తనకు తోచినవాడినల్లా విడువకుండా 'ఓ కప్పు కాఫీ సేవించి వెళ్లండేం" అంటూ బలవంత సన్మానాలకు బూనుకున్నాడు.

ఒకసంగతి చెప్పడం మర్చా. కాశీపతి "రచయిత" కూడా అనిపించుకుంటున్నాడు. అసలు అతని పేరుతో పత్రికల్లో అచ్చయిన రచనంటూ ఏమీ లేకున్నా ఫిలిం, సెక్స్ పత్రికల్లో "ప్రశ్నలు - సమాధానాలు" అన్న శీర్షికక్రింద వాడి పేరులేందే ఏపత్రికా వెలువడదు. విడుదలైన

ప్రతిచిత్రమూ వాడిచే రెండుమూడు ముక్కల్లో కార్డుకథల్లా సమీక్షించబడి ప్రతిఫలిం "జనవాక్యం" అన్నశీర్షికక్రింద వుండి తీరాల్సిందే.

ఎంతోశ్రమపడి అచ్చుచేయించిన ఇంచు, రెండించుల (అంతకంటె పెద్దవి వుండేడిస్తేగా) పత్రికల కత్తిరింపులను పాపుస్టాంపుసైజు తెల్ల కాగితానికి మధ్యలో అంటించి పైన పత్రికపేరూ, తేదీ మొదలగు వివ రాలను టైపుచేయించడం వాడికో హాబీ.

కొమ్ములుతిరిగిన పత్రికా రచయితలకంటేనూ, వాడి ఈ ఇంచి రెండించిల కత్తిరింపు ముక్కలతో సిద్ధం చేయబడిన ఫైలు దిట్టంగా, మెరుగ్గా తయారయింది.

తన పాప్యులారటీ ప్రచారసాధనాల్లో ఒకటిగా ఆ అమూల్యమైన ఫైల్ను కూడా వినియోగించుకోవాలన్న సంగతికూడా వాడి ఊహకు అందక పోలేదు. "ఈ బోడిప్రశ్నలూ, అభిప్రాయాలూ రాయడంకూడా ఒక గొప్పేనా ? మూలన కూర్చునే ముసలవ్వైనాడా రాసేస్తుం"దని ఎక్కడ అపహాస్యం చేస్తారో అన్న అనుమానమే వాడ్ని బాధిస్తుంది. ఫైలు రంగంపైకి రావడాన్ని నిరోధిస్తున్నది.

అతిచురుగ్గా పనిచేసే కాశీపతిరావు బుద్ధి, శక్తి ఈపాటి అవరోధా లని నిర్మూలించలేకపోలేదు. పాత పత్రికలన్నీ వెతికి తనపేరుతో ప్రచు రితమైన రచనల్ని సంగ్రహించి పాపుస్టాంపుసైజు తెల్లకాగితాలపై అలంక రించి వాట్ని ఫైల్లో జమ కట్టాడు. తన అపూర్వరచనా సామర్థ్యాన్ని, ప్రతిభను పొట్టబెట్టుకున్న ఆ ఫైలు రాజం పాప్యులారిటీ ప్రచారంలో ముఖ్యపాత్ర తెస్తుందన్న ఆశ కల్గింది కాశీపతికి. పలుకుబడి సంపాదించి పెట్టగల అమూల్య పరికరమైన ఫైలును కాలేజీకి తెచ్చాడు. పదిమందీ పోగైనచోటజేరి ఏదో నోటుబుక్కులో ఉంచిన ఏదో కాగితంముక్కకై ప్రతి పుస్తకంలోని ఒక్కొక్క పేజీనీ తిరుగవేసే విద్యార్థివైఖర్ని అనుక రించాడు. తనకైతాను ఫైలు విప్పితే "స్వ ఆత్మస్తుతి పరాయణుడు" అన్న

బిరుదాన్ని ఎక్కడ అంటగట్టారో, అసలు పాప్యులారిటీకి ఎక్కడ భంగం వాటిల్లుతుందో అనుకొని.

వాడువేసిన పాచిక పారనేపారింది. "అవ్వేంటోయ్! ఆ కత్తిరింపులు. నీపేరుకూడా వుందే!.... నువ్వా ఒక రచయితవేనా?.... చెప్పావుగావే" అన్నాడొక మిత్రుడు. ఫైలు తిరుగవేసే సందర్భంలో కత్తిరింపులు పొడగట్టడంవల్ల.

సాహిత్యరంగంలో తనకుగల అపూర్వ అనుభవం, ఘనత చాట్టానికి అవకాశం చిక్కనే చిక్కింది గదా అని చాలా సంతోషించాడు కాశీపతి. ఒక్కొక్క కత్తిరింపునే చూపిస్తూ దానితాలూకు వివరాలను, అందుకై తాను పడాల్సివచ్చిన శ్రమలను వివరంగా విశదీకరించ నారంభించాడు, రణరంగంలో విజయాన్ని సాధించిన సిపాయి చెప్పే ధోరణిలో.

అందరి విద్యార్థుల్లో పాప్యులారిటీ రావడానికి తనొక్కడి శ్రమే సరిపోదని గ్రహించిన కాశీపతి వాడు చడబడా తినిపించే హోటలు టిఫిన్లకు మరిగి ప్రాణస్నేహితులుగా తయారైన ఓ నలుగురు మిత్రుల్ని తనపక్షంనుండి ఏజంట్లుగా నియమించాడు. వీళ్లైనంతగా కాశీపతిరావు పేరు పదిమందినోట పడేయటమే వారి డ్యూటీ.

మొత్తానికి కాశీపతిరావు పలుకుబడి సంపాయించే విషయంలో ఏ లోపమూ రానీయడం లేదు. అన్ని హంగులూ వాడి ప్రచార సాధనాల్లో కానవస్తాయి. అన్ని విధానాలనూ వాడనుసరిస్తున్నాడు. లేకుంటే తాను కన్న కలలన్నీ ఎక్కడ కల్లలై పోతాయో, నిర్మించిన సౌధాలన్నీ ఎక్కడ ఒక్కుమ్మడిగా కూలిపోతాయో అన్న భయం వుండటంవల్ల.

తన విజయంపై కాశీపతిరావు కిప్పుడు పూర్తి విశ్వాసము కల్గింది. విద్యార్థిసోదరులు వాడిపట్ల ప్రదర్శిస్తున్న గురుతరభావమే దీనికి ప్రత్యక్ష నిదర్శనం.

తన నమస్కారాలవల్ల మిత్రులైన కొందరు తనకంటె ముందుగానే వందనాలను సమర్పిస్తూ, చేతులుకల్పుతూ 'రెస్పెక్ట్'ను ప్రదర్శించడంకూడా కాశీపతికి కొంతగర్వకారణమైంది.

"పత్రికలకు ప్రశ్నలు ఏలాగు పంపాలోయ్? కథచెప్తాగా, వ్రాసిపెట్టూ వెధవది ఎంతప్రయత్నించినా రావడంలేదు. పత్రిక్కో ఆర్టికల్ పంపాలి. "బుక్‌పోస్టు" అంటే ఏలాగు పంపించాలోయ్? యు. యన్. ఓ సంగ్రహచరిత్ర వ్రాసిపెడ్దూ! గాంధీ, నెహ్రూగారలు పుట్టిన తేదీలేమిటో వుంటెనేమోయ్! ఎంత ప్రయత్నించినా గుర్తుకు రావడం లేదు." మొదలగు వివిధ ప్రశ్నలను మిత్రులు తెలిసో, తెలియకో లేక తెలుసుకునే నిమిత్తమో అడిగి వాడిపట్ల ఒక ప్రత్యేకతను ప్రదర్శించడంకూడా కాశీపతిరావు విశ్వాసానికి మరింత దోహదమిచ్చింది.

కాలేజీ వివిధ యూనియన్ల అధ్యక్ష కార్యదర్శి పదవులకై పోటీ చేయగోరేవారు తమతమ నామినేషన్ పత్రాలు అందజేయవలసిందిగా ఆనాటి నోటీసుబోర్డు ఒకశుభవార్తను అందించింది. అసలు కాశీపతిరావు కూడా ఎన్నాళ్ళనుండో ఆ ఒక్కముక్కకోసమే నిరీక్షిస్తున్నాడు, ఫరవాలేదన్నట్లుగా పాప్యులారిటీ వచ్చింది కాబట్టి.

ఏ యూనియన్‌కి పోటీచేయాలా? అన్న యోచనలో పడ్డాడు కాశీపతిరావు. "ఉట్టికెక్కలేనివాడు స్వర్గానికెలా పోతాడు" అన్నట్లు, మొదలు సబ్‌యూనియన్లకు గెలువందే 'ఏకదమ్'న పెద్ద యూనియన్‌కు గెలువడం అసాధ్యమేమో అనిపించింది. ఎట్లాగూ పాప్యులారిటీ వచ్చింది గదా అని హెచ్చులకుపోతే అసలుకే మోసం వస్తుందేమోనని జంకాడు.

"హైస్కూల్లో మాదిరిగాక ఇక్కడ మహారాష్ట్రులు, కన్నడులు, తమిళులు, సాయబులు కూడా వుంటారాయె. అసలిక్కడ "ఫీలింగులు" కూడా జాస్తేనాయె. ఎంతో స్నేహితుడుగానే మెలుగుతు తీరా ఓటింగప్పుడు వాడివాళ్ళకే ఇస్తారాయె ఓటు! ఎందుకైనా మంచిది మొదలు

తెలుగు యూనియన్‌కేనెగ్గి ఆ తర్వాతగాని తడాఖా చూపించాలి. "ఫైలు" పుణ్యాన రచయితగా తెలుగువాళ్ళలో చచ్చే పాప్యులారిటీకూడా వచ్చిందాయె." ఏమేమో తలపోయసాగాడు కాశీపతిరావు.

ఎందుకైనా మంచిది, ఈ విషయంలో మిత్రుల సలహాలనుకూడా స్వీకరించాలనుకున్నాడు. గాఢస్నేహితులనుపించిన కొందర్నడిగి చూశాడు. వాళ్లకూడా వాడి అభిప్రాయాన్నే ఏకగ్రీవంగా ఆమోదించారు. ఇక చిక్కేలేదనుకున్నాడు. వెంటనే మిత్రుల్లో ఇద్దరిచేత ఒకడు అధ్యక్ష పదవికి తన పేర్ను సూచిస్తున్నట్లుగా, మరొకడు బలపరుస్తున్నట్లుగా నామినేషన్ పత్రాన్ని ఫైలుచేయించాడు.

ఓటింగ్ తేదీ మరికొన్ని రోజుల్లోనే పడింది. తేదీ సమీపిస్తున్నకొద్దీ శుక్లపక్ష చంద్రునిలా తన ప్రచారాన్నికూడా అతితీవ్రంగా సాగించసాగాడు కాశీపతిరావు.

కాలేజీస్ట్రెంగ్థ్‌కంటే నాల్గురెట్లు జాస్తిగా పాంఫ్లెట్లు అచ్చువేయించాడు. "తెలుగుసంఘపు పోకడలు అభివృద్ధి మార్గాలనే అనుసరించాలంటే అధ్యక్షుడుగా కే. వి. కాశీపతిరావునే ఎన్నుకోండి" అన్న పెద్ద అక్షరాలతో అచ్చయిన రంగురంగు కాగితాలనుచూసి ఎంతో మురిసిపోయాడు. వారంరోజులముందునుండే తన ఏజంట్లలో పాంఫ్లెట్లను పంచి కాలేజీ ప్రతివిద్యార్థికీ అందించాడు. రెండుమూడుసార్లు మీటింగులుకూడా ఏర్పాటుచేసి తాను అధికారంలోకివస్తే తెలుగుసంఘం ఏలాగు తారాపథాన్నందుకునేది సంగ్రహంగా విశదీకరిస్తూ గంభీరమైనఉపన్యాసాలు దంచాడు.

పోలింగ్ ప్రశాంతంగానే ముగిసింది. సాయంత్రమే ఫలితాలు కూడా ప్రకటించబడనున్నట్లు తెల్పబడింది.

ఒక్కొక్క తరగతిపెట్టెనే సీలుతీస్తూ ఎన్నో మడతలు మడిచి వున్న చీటీలను విప్పుతూ పేర్లు చదువుతున్నారు. ప్రతిపెట్టెలోనుండీ

"కె. వి. కాశీపతిరావు" అన్న నాదమే పదేపదే వినుపించసాగింది. కాశీపతిరావు సంతోషానికి హద్దులు లేకుండా పోయాయి. అందరు పోటీదార్లలో "విజయలక్ష్మి" తన్నే వరించనున్నదిగదా అని విజయగర్వంతో ప్రత్యర్థుల్ని చూడసాగాడు.

ఫలితాలు ప్రకటించబడ్డాయి. విజయం కాశీపతికే దక్కింది. అదీ అఖండ మెజారిటీతో నెగ్గాడు. గదినుండి వెలువట్టమే తరువాయిగా మిత్రులంతా చుట్టుముట్టారు. ఎత్తుకున్నారు. జై....జై....నినాదాలుచేశారు. ఎంతో అభినందించారు. "మరి టీపార్టీ ఎప్పుడిస్తావురా ? నీ ప్రచారం చేయలేక నోరంతా బొంగురు పోయింది....కాళ్ళు నొప్పులు పుట్టాయి." అన్నారు కొందరు మిత్రులు. ఈసారి కాశీపతి అందర్నీ ఒక పేరుబడ్డ హోటలుకే తీసుకెళ్ళాడు.

తొలిప్రయత్నంలోనే అఖండ విజయాన్ని సాధించినందుకు ఎంతో మురిసిపోయాడు కాశీపతి. పూర్వపదవుల్లోకి వచ్చిన అందరు పెద్దమనుష్యుల జీవితాలను స్టెడీచేశాడు. కాని వాడిలా ఎవ్వరూ ప్రథమప్రయత్నంలోనే అంతటి గౌరవానికి పాత్రులైనట్లుగా కన్పించలేదు. కాలేజీ చరిత్రలో అంతటి ఉత్కృష్టమైన గౌరవం తొలుతగా తనకు, పైపెచ్చు ఒక ఆంధ్రునకు సంక్రమించినందుకు తనకుతానే ఒకసారి అభినందించుకున్నాడు.

కాశీపతిరావు ఇప్పుడొక సాధారణ కాలేజీ స్టూడెంటుకాడు. కళాశాల విద్యార్థిసంఘ కార్యాలయంలో వాడొక ఉన్నతాధికారి. ఇప్పుడు వాడిలో ఒక విశేషమైన మార్పు పనిజేస్తున్నది.

నమస్కారాలను అందించి తీసుకునే పద్ధతినే మర్చాడు. మొదలు స్వీకరించే తిరిగి ముట్టజెప్పే పంథానే ప్రస్తుతం అవలంబిస్తున్నాడు. రాజకీయాలనుండి నిష్క్రమించి నాయకునిలా పదిమందిలో పని కల్పించుకొని మాట్లాడే అలవాటుకూడా ఇప్పుడు వాడిలో కన్పించడంలేదు.

"దుబారాఖర్చు" దురభ్యాసంనుకూడా విస్మరించినట్లున్నాడు. మొత్తాని కిప్పుడు పూర్వపు కాశీపతిరావుకాడు.

ఆదివారంలోకి వచ్చినవెంటనే ఎన్నికల్లో నెగ్గిన పెద్దమనుష్యులు చేయాల్సిన ముఖ్యకర్తవ్యాలుగా గోపాలంచెప్పిన విషయాలు జ్ఞప్తికొచ్చాయి కాశీపతిరావుకు. "ట్వీడ్‌సూట్".... తన ఏకైక ఆదర్శం స్ఫురణకు వచ్చింది. అసలు ఆ ఆశయసాధనకే తానింతటివాడయాడనుకున్నాడు. కార్యరంగంలోకి కాలువేశాడు.

నశ్యపురంగు ట్వీడ్‌సూట్ వేసుకొని నీట్‌గా తయారై కాలేజీకి వేంచేశాడు కాశీపతిరావు. ఆనాడెంతో శుభదాయకమైన దినం వాడికి. ఎన్నాళ్ళనుండో తన్ను వ్యాకులపరుస్తున్న కోరిక ఆనాటితో అంతమొందింది. అలవాటులేని ప్రాణం కాబట్టి మొదట్లో బిత్తరబిత్తరగానే వుండింది. కాని క్రమేణా అదే అలవాటయింది. ముఖ్యంగా విద్యార్థినులను ఆనాటి వాడి వేషధారణ బాగా ఆకర్షించిందని చెప్పక తప్పదు.

ఆరోజు కాశీపతిని అభినందించిన మిత్రులకంటె పెదవి విరచిన సోదరులదే మెజారిటీ అయింది. "నిష్కారణంగా ఈ అవకాశాన్ని ఈ బడుద్ధాయిగాడు అనుభవిస్తున్నాడుగదా" అని విచారించసాగారు ఓడి పోయిన ప్రత్యర్థి మహాశయులు. "వీడుచేసిన హంగామాలన్నీ పట్టి ఎలక్షన్ స్టంట్స్‌రా" అని ప్రచారం చేయనే చేశాయి కొన్ని మిత్రమండలులు. ఇంకా ఏమేమో గుసగుసలు బయలుదేరాయి.

.... .... ....

కాలవాహినిలో ఇట్టే కొన్నాళ్ళు దొర్లుకుపోయాయి. మళ్ళీ జూన్ నెల వచ్చింది. మళ్ళీ కాలేజీలు తెరిచారు. మళ్ళీ ఎడ్మిషన్, ఎలక్షన్ గొడవలు ప్రారంభమయాయి. కాశీపతిరావు వారంరోజులముందే పట్టణం చేరుకున్నాడు. ఇప్పుడు వాడి ఆదర్శం మరొక గొప్ప ఆశయాన్ని సాధించడం.

మళ్ళీ పూర్వపు అలవాట్లకు స్వస్తిజెప్పి "మారిపోవురాకాలము" అన్న సూక్తిని ప్రత్యక్షంగా నిరూపించాడు కాశీపతిరావు. నమస్కారాలు చేయడం, చేతులుకల్పడం పునః ప్రారంభించాడు. లోకాన్నీ, దేశాన్నీ, విద్యార్థుల్నీ ఎదుర్కొంటున్న వివిధ సమస్యలనుగూర్చి పదిమందిలోనూ సమీక్షలు సాగించాడు. అల్పాహారాలు, ఉపహారాలు, ఫలహారాలు మొదలగు విందు వినోదాలవిషయంలో ఏలోటూ రానీయకుండా కనిపెడ్తున్నాడు. సరికొత్తగా సంగ్రహించిన రచనల్ని జమకట్టి ఫైలులావును మరింత అభివృద్ధిజేసి "రచయిత" అన్న బిరుదాన్ని మరింత సార్థకం చేసుకున్నాడు. "ఏ చిత్రమైనా 'బాక్సాఫీస్‌హిట్' కావాలంటే మంచిపబ్లిసిటే ఏకైకశరణ్యం" అన్న సూత్రప్రకారం తనకు పాప్యులారిటీ సంపాదించడానికి మరికొందరు ఏజంట్లను నెలకొల్పాడు. నాల్గుసార్లు స్టేజ్‌లెక్కి గంభీరమైన ఉపన్యాసాలు దంచడానికి మరింత అలవాటు పడ్డాడు.

ఇప్పుడు కాశీపతిరావుదొక గొప్ప సంకల్పం. కాలేజీ ప్రెసిడెంట్ పదవికే కంటెస్ట్ చేయాలని అతనికి పట్టుదల. అవిరామంగా అహో రాత్రాలు ఈ కార్యసాధనకై కృషిసల్పుతున్నాడు.

తాను పోటీచేస్తున్నది పెద్దపదవికే కాబట్టి ఈసారి ప్రచారాలుకూడా పెద్దపెట్టునే సాగించాలని నిశ్చయించుకున్నాడు కాశీపతిరావు. ముఖ్యంగా "డబ్బు" అన్న పదార్థానికి ఏమాత్రమూ జడువకూడదు. దేవుడిపుణ్యాన గెలిచిగట్టెక్కితే అంతకు రెండింతలు అదే వచ్చిపడ్తుందనుకున్నాడు కాస్తోకూస్తో అనుభవశాలికాబట్టి.

చేతిలో వున్నదంతా పాప్యులారిటీ ప్రచారార్థం అప్పుడే "స్వాహా" అయింది. కాబట్టి ముందు కార్యక్రమాన్ని కొనసాగించే నిమిత్తం ఇంటి వాళ్ళకు తెలియకుండా రహస్యంగా రెండువందలు అప్పుపుచ్చుకున్నాడు. నెగ్గిన మరుక్షణంలో అదేతీరుతుందన్న ధైర్యం వుంది కాబట్టి!

ప్రచారాలు మహాజోరుగా సాగిపోతున్నాయి. కాలేజీ గోడలన్నీ వాల్పోస్టర్లతో నిండిపోయాయి. కాశీపతిరావు తాలూకువే వానిలో జాస్తి. తన వాల్పోస్టర్లనే అందరికంటే ఆకర్షణీయంగా తయారుచేయించాడు. మధ్యలో తన ఫోటోనుకూడా ఇరికించాడు. ఈసారి మరోకొత్తపద్ధతిని కూడా ప్రచార సాధనాల్లో ఒకటిగా ప్రవేశపెట్టాడు. గతజీవితాన్ని సమీక్షిస్తూ తన లైవ్‌స్కెచ్‌ను ఫోటోయుక్తంగా పుస్తకరూపంలో ప్రకటించి అందరికీ పంచాడు. ఇక పాంప్లెట్ల విషయం వేరే చెప్పక్కర్లేదు. అప్పుడే రెండుమూడు ఎడీషన్లదాకా వేయించాడు. ఇంకా ఎన్ని ముద్రణలు కానున్నాయో వాడికే తెలియదు. మొత్తానికి అమెరికా ప్రసిడింట్‌గిరీ పోటీకంటేనూ ఎక్కువ హంగులు వాడిప్రచారాల్లో కన్పిస్తున్నాయి.

ఇప్పుడుతనగెలుపుపై కాశీపతికి గట్టినమ్మకం కుదిరింది. అపజయ సూచనలు ఏకోశానా కానరాలేదు. అంతకొద్దిపాటి ప్రచారాలకే అప్పుడు అంత మెజారిటీతో నెగ్గినప్పుడు ఎంతో గొప్పగా ప్రచారాలు సాగిస్తున్న ఇప్పుడు ఇంకా ఎంత ఘనంగా గెలవాలి— ఊహకు అందని విషయంగా పరిణమించింది వాడికి.

విద్యార్థులంతా ఇప్పుడు పూర్వపు గురుతర భావాన్నే ప్రదర్శిస్తున్నారు. ఆ విషయంలో లోటేమీ లేదనుపించింది. తన నాయకత్వంపై విద్యార్థిసోదరులకు సంపూర్ణవిశ్వాసం కలిగింది. తన విజయం లభ్యం. గెలుపు తనదే అనుకున్నాడు కాశీపతి.

ఓటింగ్‌ముగిసింది. విజయలక్ష్మి తనపొంతనే చేరనున్నట్లు గాలి కబుర్లుకూడా చేరాయి కాశీపతికి. వాడి హృదయవీణ సంతోషనాదాన్ని హెచ్చుస్థాయిలోనే ఆలాపించింది. అప్పుడే ప్రత్యర్థుల్ని హేళనభావంతో చూడసాగాడు. మరికాసేపట్లోనే ఫలితాలుకూడా వెలువడ్డాయి....పర్యవసానం....“కే. వి. కాశీపతిరావు....ఓటమి” అదీ ఎన్నో ఓట్ల తేడాతో.

కాశీపతి ముఖంలో కత్తివాటుకు నెత్తురుచుక్కలేకుండా పోయింది. ఈ మొహాన్ని మరేలాగు ప్రజలకు చూపించడం. ఎంతో వగచాడు. చివరివాడుగా మెల్లమెల్లగా విషాదపూరితమైన హృదయభారంతో ఫలితాలు ప్రసారమైన గదినుండి నడిచాడు.

ఈసారి వాడికి స్వాగత మీయడానికి ఎవ్వరూరాలేదు. కనీసం సానుభూతిని ప్రదర్శించడానికైనా ఎవ్వరూ సాహసించలేదు. మరెక్కడికి ఎగిరిపోయినదో ఆ కాకిబలగమంతాను. ఆ చింతమాత్రం వాడికాక్షణంలో కలుగలేదు.

ఒళ్ళంతా జెర్రులు ప్రాకుతున్న ట్లనుపించింది. మళ్ళీ చాలాకాలానికి వేసుకున్న "ట్వీడ్‌సూట్"పైకి దృష్టిపోయింది. అది వాణ్ణెక్కిరిస్తున్నట్లనుపించింది.

సాధారణ కాలేజీ స్టూడెంట్ స్టాండర్డుకుకూడా ఇప్పుడు దిగజారాడు కాశీపతిరావు. వాడి బ్రతుకు చందము ఎన్నో హంగులుచేసి తుది క్షణంలో ఓటమిశబ్దంవిన్న "ఎం. పి." లా పరిణమించింది. యదార్థంగా అంతేకూడా.

ఎన్నడూ ఒక్కపైసా అప్పుపెట్టి ఎరుగని కాశీపతిరావు ఈనాడు పెద్దమొత్తం 200 రూపాయల ఋణస్తుడు. నలుగుర్లో తలెత్తుకొని తిరిగే అర్హతకూడా ఈనాడు వాడు నోచుకోలేదు. ఒక్కమాటలో చెప్పాల్సివస్తే "బతికిచెడిన ఘటం" కాశీపతిరావుది.

"మళ్ళీ తనరోజులు రాకపోతాయా....ఎప్పటికీ అమావాస్యే వుంటుందా !" అన్న ధైర్యంమాత్రం వాడినింకా పట్టుకొనే వుంది.

ఇప్పుడు కాశీపతిరావుకు "ట్వీడ్‌సూట్"పై గల వ్యామోహం పూర్తిగా నశించింది. "ఆ రోజు" మినహా "ట్వీడ్‌సూట్"ను ధరించి కాలేజీకి వేంచేసిన పుణ్యానపోలేదు....మరెం....దు....కో....గాని....



52



# కష్టఫలితం

❖

శ్రీ ఇసుకపల్లి దక్షిణామూర్తి

---

జననం : 1934.

చిరునామా : 593, హిమాయత్‌నగర్, హైదరాబాదు-ద.

కార్యకలాపాలు : ఉద్యోగం.

అభిరుచి : చిత్రలేఖనం, సంగీతం, హాస్యరచనలు.

రచనలు : ముద్రితము : వివిధ పత్రికలలో కథానికలు, నాటికలు.

అముద్రితం : మనం - మన పరిసరాలు (సైన్సు వ్యాసాలు.)

అభిమాన రచయితలు : శరత్‌బాబు.

*

# కష్టఫలితం

ఫ్యాక్టరీ బయ్యమంటూ కూతకూసింది. గోపయ్య అమ్మయ్య అనుకుంటూ చేతిలోపిడి వదిలేసి వెనక స్తంభంమీదకు వాలాడు. ఉదయం నుంచి పడుతున్న శ్రమకి ఆ రోజుకి అంతిమగీతం పాడేసి ఆగిపోయిన ఫ్యాక్టరీ గొట్టంలోనుంచి మగతగా పొగ బయటకు వస్తోంది. గోపయ్య కళ్లముందర అతివేగంగా తిరుగుతున్న యినుపచక్రం బర్రుబర్రు మంటూ కొంచంగా మూలిగి మెల్లగా ఆగిపోయింది. నడుముకుచుట్టిన గోతాము విప్పి చక్రంమీద పడేసి వకసారి లేచి ఆవలించాడు. నడుమంతా పటపట మంటూ శబ్దంచేసింది. మేనుకి తగిలించిన తలపాగా చేతిలోకి తీసుకుని మీదపడ్డ తవుడూ చిట్టూ అంతా గట్టిగా దులిపేసి ముఖానికి అంటిపెట్టు కున్న శ్వేతబిందువుల్ని నిర్దాక్షిణ్యంగా నలిచేశాడు. గుడ్డకు వదలని తవుడు ముఖమంతా అంటుకుని వికారంగా కనపడుతోంది.

కాళ్ళు తడబడతుంటే తూలుపాటు వచ్చి కొంచెంలో పడిపోయే వాడేగాని ఎదురుగా ఆగిపోయిన యినపచక్రాన్ని బలంగా పట్టుకొని నిల బడగలిగాడు. అతని బలానికి ఆ చక్రం వక్కబెత్తెడైనా అటూ యిటూ కదలలేదు. తన ప్రయత్నం లేకుండా కళ్ళకు అందనివేగంలో తిరిగిన చక్రం తను ప్రయత్నంచేసినా కదలకపోయేటప్పటికి రోజు మాదిరి ఆశ్చర్యం కలిగింది. వకసారి ఎగాదిగా చూచాడు. ఎదురుగావున్న కిటికిలో నుంచి పొగగొట్టం పొగను వదలలేక వదలలేక బాధపడుతూ కనపడింది. ఫ్యాక్టరీ శ్రేయస్సుకోసం కష్టించే తనకీ ఆ గొట్టానికి ఏమంత వ్యత్యాసం లేదనుకున్నాడు గోపయ్య.

'కదలవేంరా !' అంటూ కిందనుంచి యజమానిపెట్టిన గావుకేక అతని కర్ణపుటాల్లోనుంచి దూసుకునిపోయి హృదయానికి సూటిగా తాకింది. అతని హృదయం ఎప్పుడూ తలలోనేవుంటుంది. వులిక్కిపడి తలపాగా మళ్ళీ దులిపి యినపచక్రాన్ని రెండుసార్లు తట్టి 'మళ్ళీవస్తాలే' అన్నట్టు చూస్తూ మెట్లవైపు తిరిగాడు. యినపమెట్లను చూస్తుంటే తను నిలువుటద్దంలో అస్థిపంజరం మాదిరిగా కనపడ్డట్టువుంది. పక్కకడ్డీలు రెండూ చేతుల్తోపట్టుకుని మెల్లగా అడుగులో అడుగేసుకుంటూ కిందకి దిగాడు.

మెట్లకిందుగా ఫ్యాక్టరీ ఆడినబియ్యం రాసి అయింది. మెట్లు ఎక్కేటప్పుడు వక్కగింజ ఉండదు ఆ స్థలంలో. తనూ, పొగగొట్టాం కలిసి శ్రమించిన ఫలితంగా పొద్దుకూకేటప్పటికి అంతరాసి తయారవుతుంది. తలపాగ మళ్ళీ ఒకసారి విప్పతీసి వళ్ళంతా తుడుచుకుని జుట్టును చేత్తోనే దులుపుకున్నాడు. కొంత తవుడు, బలవంతం చేసినా, ఒకనాటి స్నేహితాన్ని యింతలో మరువలేనన్నట్లు అతని జుట్టును అంటిపెట్టుకునేవుంది. బియ్యాన్ని కొంచెంగా చేతిలోకి తీసికుని ఎగరవేస్తూ 'యియ్యాల బియ్యం సాలాబాగున్నాయి దొరా' అన్నాడు. యజమాని చీదరించుకుని 'ఊ' అన్నాడు. గోపయ్య చేతిలో గింజలు యింకా ఎగురుతునే వున్నాయి. వకటిరెండు నోటిలోకిగూడా వాటంతట అవే ఎగిరినాయి. యజమాని వందరూపాయలనోట్లు మూడు మడిచి చొక్కా జేబులో దోపి అటూ యిటూ చూశాడు తను చేసేది దొంగపని అన్నట్లు. గోపయ్య చేతితో బియ్యపురాసిని యింకా కదిలిస్తూనే 'యియ్యాల్టికి బియ్యం కొలిపించండి దొరా....పైసలొద్దులేండి' అన్నాడు. అక్కడిచ్చే పైసలు పెటితే బయట వక్కపూటకి సరిపోయే బియ్యంగూడారావు. అందులో రాళ్ళూ, రప్పలు. యిక్కడే అయితే ఎక్కువయినా తక్కువయినా మంచిబియ్యం....గంజి కమ్మగా వుంటుంది. గోపయ్య కిందటివారం బియ్యం తీసికెళ్ళినరోజు

బాగా గుర్తుంది. అందుకనే అటువంటి గంజిమీద మళ్ళీ వ్యామోహం కలిగింది. యజమాని మాటలాడకపోవటంచూసి, ఏమయ్యా....నన్ను పంపించరూ....' అన్నాడు.

'పోరా....వెధవసోదా నువ్వూను....యివ్వాళ బియ్యంకొలవటానికి వీల్లేదు....' అన్నాడు యజమాని జేబులో చెయ్యిపెట్టి నోట్లకోసం తడిమి చూస్తూ.

'రోజూ అడుగుతున్నానా యాంటిదొరా....అట్లా అగ్గవుతారు' గోపయ్య మాట యజమాని వినిపించుకోలేదు.

'ఎదురుగ్గా డబ్బిచ్చిన పెద్దమనిషికి బియ్యం కొలవాలంటావా లేదా.... మొద్దు గాడిదకొడుకులికి బియ్యం కావాల్సివచ్చినాయి, బియ్యం....' యజమాని వచ్చినపెద్దమనిషివంకతిరిగి 'చూడండి....ఈలేబరు వెధవలతో.... బజారుకుపోయి నూకలేడవరాదూ ! వచ్చే మూడు పైసలికి.... వెధవదర్జా వీడూను ... చెపితే తెలుసుకోలేరండీ' అన్నాడు. ఆ పెద్దమనిషి కొద్దిగా యికిలించి గోపయ్యవంక చూచి నవ్వబోయి ఆగిపోయాడు. గోపయ్య కళ్లరెండూ అగ్నిజ్వాలల్లాగా మండిపోతున్నాయి. అది ఆగ్రహంవలన కాదు. కంటిపోషణకు తగిన ఆహారం అందులో జొరబడక ఉడికిపోతున్నాయి. యజమాని నవ్వుముఖం పెట్టి 'పోరా.... గోపయ్యా! పైసలెందుకు పాడుచేసుకుంటావుగాని....' అన్నాడు. వచ్చిన పెద్దమనిషి యజమానివంక సానుభూతిగా చూశాడు. గోపయ్య తపుడుతో తడి యిమికిపోయిన పెదిమలను బలవంతానా కలిపి 'యింతకష్టం చేస్తున్నాంగా.... బియ్యానికి సరిపోయే పైసలే యివ్వరాదూ' అంటూ గొణిగాడు. యజమానికి వినబడలేదు. పెద్దమనిషికి వినబడా మింగి వూరుకున్నాడు.

గోపయ్య గుప్పిటనిండా బియ్యం పోసుకుని అక్కడినుంచి వాకిట వంక చూస్తూ బయలుదేరాడు. యజమాని ఆ బియ్యాన్ని రాసిలో పొయ్యమని అందామని నోరు తెరవగానే గోపయ్య అది గమనించి వాటిని

నోటితో పోసుకుని నవ్వుకుంటూ గబగబా అడుగులు వేశాడు. యజమాని విరగబడినవ్వి 'ఈ అలగామూక యింతేనండి....కాస్త విషయాల్లో గూడా నీచానికి వడగడతారు....ఆ కాసిని బియ్యం పాపిష్టిసొమ్ము తింటేనే గాని వాడికి తృప్తితీరదు....' అన్నాడు. యిందాకటినుంచి నవ్వుదామనుకుని వూరుకున్న పెద్దమనిషి గోపయ్య నాలుగడుగుల దూరం పోగానే వక్కసారి నవ్వేశాడు. గోపయ్య వీధివాకిలి పట్టుకుని వీళ్ళవైపు తిరిగి గట్టిగా నవ్వాడు. వుక్కిట బియ్యం చిందరవందరగా పడిపోయాయి. ఇంకా బిగ్గరగా నవ్వుతూ బియ్యంవంక వేలుపెట్టి చూపించాడు, 'యివిగో నీ బియ్యం నువ్వే తీసుకోలే' అన్నట్టు. యజమాని వుక్రోషపడి లేవబోయి పొట్టబరువుకు నిలవలేక పెద్దమనిషిని పట్టుకుని మళ్ళీ కూర్చున్నాడు. గోపయ్య వెనకకు తిరిగిచూడకుండా రోడ్డుమీదదాకా పారిపోయి 'ఇహిహీ' అంటూ బిగ్గరగా నవ్వాడు.

అడుగులు తడబడుతున్నా యింటిదాకా పోక తప్పేటట్లు లేదు. ఎదురుగా అరుగుమీద కూర్చున్న గుమాస్తా యితని వక్కనికీ పైసలివ్వటం కోసమే ఆగినట్లున్నాడు. అప్పటికే మిగతా కూలీలంతా పక్కక్కరే జారుకుంటున్నారు డబ్బుల లెక్కసరిచూసుకుంటూ. లేని సత్తువ తెచ్చుకుని అరుగుదాకా పోయి గుమాస్తా పక్క కూలపడ్డాడు. పొద్దున తాగినగంజి కడుపులోనుంచి కిందకు పోతూ 'కడుపు పూర్తిగా కాళీ అయిందయ్యో' అన్నట్టు అరిచింది. గుమాస్తా చిల్లర డబ్బులు చేతిలో పెడుతూ 'త్రేణుస్తున్నాడు దొంగవెధవ....ఫ్యాక్టరీలో పడి తిన్న బియ్యం అన్నీ ఏమవుతాయి' అన్నాడు. గోపయ్య అతన్ని చాచి కొడదామనుకున్నాడు. ఆ సమయంలో కనక కలియపడితే తన వోటమి తప్పదని తెలియటంవలన మెదలకుండా డబ్బులు రొండిలో దోపుకుని వూరుకున్నాడు. గుమాస్తా అరుగుదిగి తను కూర్చున్న వుత్తరీయాన్ని దులిపి మీదవేసుకుని ఫ్యాక్టరీలోకి చొరబడ్డాడు. గోపయ్య యింటికి బయలు దేర

టానికి అరుగుమీదనుంచి నేలమీదకి జారి నిలబడేటప్పటికి వక్కసారి దీపాలు వెలిగాయి. 'శ్రీ అన్నపూర్ణాఫ్యాక్టరీ' అన్న అక్షరాలు సిగ్గుతో కుంచించుకుపోయి ఫ్యాక్టరీ ఎదుట బోర్డుమీదనుంచి వదిలిపోవటానికి ప్రయత్నం చేస్తున్నట్లు కనపడ్డాయి. అక్షరజ్ఞానం లేకపోయినా ఫ్యాక్టరీ పేరు అనేకసార్లు వినివుండటంవలన 'శ్రీ అన్నపూర్ణా' అంటూ అరుస్తూ గోపయ్య అడుగులు వేశాడు యింటివైపుకి.

తారురోడ్డుకి రెండు పక్కలా వెలుగుతున్న విద్యుద్దీపాలు రోడ్డు మీద మెరుస్తున్నాయి. గోపయ్య 'యివన్నీ తనకోసమే'నన్నట్లుగా వాటి వంకచూచి నిట్టూర్చాడు. అడుగులు చకచకా సాగుతున్నకొద్దీ 'తనవి' అనుకున్న దీపాలన్నీ వకొక్కటే తనని విడిచిపెట్టి వెనక్కుపోతున్నా ఆకాశంలో అర్ధచంద్రాకారంలో వెలుగుతున్న చందమామమటుకు అతన్ని అంటిపెట్టుకుని వస్తున్నది. తనకు శాశ్వతమైన స్నేహాన్ని చూపించేవి చందమామేగాని మానవులు వేసిన దీపపుస్తంభాలు కాదనుకున్నాడు. చంద మామను దృష్టిలో వుంచుకుని తారురోడ్డుమీద యింకా నాలుగడుగులు వేశేవాడేగాని తన గుడిసెవుండే సందురాగానే అలవాటు చొప్పున అతని కాళ్లు వాటంతట అవే మలుపుతిరిగినాయి. బుద్రకులేనిజ్ఞానం కాళ్ళకున్న ట్లనిపించింది. అందుకునే అయివుంటుంది తను వద్దనుకున్నా కాళ్లురోజూ బలవంతంగా యింటికి తీసుకుని పోతూనే వుంటాయి.

అంతదూరం నడిచినా ఒక్క గతుకయినా తగలని తారు రోడ్డు వదలగానే మురుగుకాలవ ఎదురయింది. పగటిపూట సరిగా కనపడ్డా రాత్రిపూట చందమామ గుడ్డివెలుగులో అంతంత మాత్రంగానే కనిపి స్తోంది. 'దాని దుంపతెగ చూకలేనా' అనుకుంటూ గోపయ్య దానిమీదగా వురికాడు. ఒక జానెడు దూరంలో తప్పిపోయింది. కుడికాలు బురద నీటిలోపడి మురుగు గబుక్కున పైకి చిందింది. తవుడుతో తెల్లబడిన పంచెమీద అద్దకం వేయించినట్లు అన్నీ నక్షత్రంగుర్తులు పడిపోయినాయి.

చేతితో తుడిచివేద్దామనుకున్నాడు గాని యింకా అసహ్యంగా తయారవు తుందని ఊరుకున్నాడు. వాటివంకనే వెనక్కి చూస్తూ ముందుకు అడుగులు సాగించాడు. రెండుమూడు దెబ్బలు తగిలిన తర్వాతగాని గుడిసె దర్శనం కాలేదు.

గుడిసె తన దృష్టిలోకి వచ్చిన తక్షణమే దానిలోనుండి వస్తున్న పిల్ల ఏడుపు చెవులకు గింగురుమంటూ వినిపించింది. 'కూడు పెట్టకుండా ఎన్ని బాధలేమటుకు అదేం వినిచస్తుంది' అనుకున్నాడు. అడుగు ఆగిపోయింది. యింటిలోకి పోవటానికి ఎందుకనో మనస్కరించలేదు. 'తన దూరసందులేదు మెడకో డోలు.... తిండికిచాలక ఒకమూల చస్తూ వీడు పెళ్ళిగూడా చేసుకున్నాడు' యజమాని కిందటివారం బియ్యం అడిగినప్పుడు అన్నమాటలు స్ఫురణకువచ్చినాయి. నిజమే ననిపించింది. ఎందుకీ తాపత్రయం? కూడు పెట్టలేనివాడు తాళిగట్టటం ఘోరమైన తప్పిదము అనిపించింది. గోపయ్య జుట్టును వేళ్ళమధ్యలోనుంచి పోనిచ్చి పైకి ఎగదువ్వుకున్నాడు. 'తాళిగట్టాడో అని ఏడవకదోతే తిండిగ్గూడా సరిపోయేట్లు కూలిగింజలియ్యరాదూ నా కొడుకులు' అనుకున్నాడు. వ్యూహో మాత్రంగా పిల్ల ఏడుపు నిశ్శబ్దమైన వాతావరణాన్ని చీల్చుకుంటూ వస్తోంది. అది అతని హృదయాన్ని చీల్చివేస్తోంది. చేతిలో డబ్బులు పెటితే ఈ పూటకి మరునాటికి సరిపోయే నూకలు వస్తాయని గోపయ్యకు తెలుసు. అతని మనస్సు ఎక్కడో విహరిస్తోంది. అతని ఆలోచనలు ఎక్కడో తేలిపోతున్నాయి. 'ఈ ఏడుపు ఎప్పుడూ ఉండేదేనెహో.... యియ్యాల్టికి ఒక్కముంత తాగివస్తే రేపటాలసంగతి మళ్ళీ చూద్దాం' అనుకున్నాడు. అతని ఆలోచన అతనికంటే అతని కాళ్ళకు ముందరగా తెలిసింది. అవి వెనక్కితిరిగి రోడ్డువైపుకు బయలుదేరినాయి. పిల్ల ఏడుపు యింకా బిగ్గరగా వినిపిస్తునేవుంది.

గోపయ్యకు ఆ వుత్సాహం ఎక్కడినుంచి వచ్చిందో అతనికే తెలియదు. యింకుమించు పరుగెత్తుతున్నాడు అతనివూహాలతోపాటు. పిల్ల ఏడుపు లీలగా వినపడుతూ ఆగిపోయింది. తుపాను ఆగిపోయినతర్వాత కలిగేభయంకరమైన నిశ్శబ్దం అతని హృదయంచుట్టూ పెనవేసుకుపోయింది. ఆబంధాలను విడమరిచి స్వేచ్ఛపొందుదామని వ్యర్థప్రయత్నం చేస్తూ యింకా పరుగెత్తుతునే వున్నాడు. గోపయ్య గమ్యస్థానం చేరగానే కాళ్లు వాటంతట అవే ఆగిపోయినాయి.

పులిసిపోయిన కల్లువాసన భరింపరానిదిగా ఆ ప్రదేశమంతా అలుముకుపోయింది. గోపయ్య దాటివచ్చిన గోడ కెదుటగా చిన్న పందిరిలాగా వేసివుంది. నాలుగు వాసాలమీద నిలబడ్డ మంచెకు పైన అచ్ఛాదనగా చిల్లుల తడికెవకటి మంచెవాసాల నాధారం చేసుకుని నిరామయంగా వూగుతోంది. నాలుగు బానల వెనకగా ఎర్రగుడ్డవ్యక్తి వకడు చిరిగిపోయిన తుండుగుడ్డను గాలిలోకి వూపుతూ వెకిలిగా అరుస్తున్నాడు. కుండలమీద వున్నముంతలు పక్కకు వరిగి మూకుడుకు కరుచుకుని వున్నాయి. మంచె కిందుగా అయిదారు బానలు చిందరవందరగా పడి వున్నాయి. ఖాళీ అయిపోయిన తర్వాత పట్టిన దుర్గతిలాగా కనపడుతు ంది. మంచెవాసాలకానుకుని చేరగిలబడ్డ వాళ్ళిద్దరు మగతగా వులిక్కిపడుతూ మెలకువవచ్చినప్పుడల్లా రెండు పిచ్చికేకలు వేసి వూరుకుంటున్నారు. వకతని చేతిలో ముంత నెత్తిమీద కెక్కి కూర్చుంది. ఆ ముంత పడిపోకుండా అతడు గంతులువేస్తూ లల్లాయి పదాలు పాడుతున్నాడు.

గోపయ్య ఆ వాతావరణంలో అడుగు పెడుతూనే స్వేచ్ఛా వాయువును మనసారా పీల్చాడు. ఆలాపనగా పిల్ల ఏడుపు హృదిలో కలకవేస్తోంది. అతని భార్యముఖం గూడా లీలగా గుర్తుకువచ్చి వెంటనే మాసిపో యిం ది దీని తర్వాతనే పెళ్లామయినా బిడ్డలయినా అనుకున్నాడు. భుజాన వున్న తలపాగాను నడుముకు చుట్టి రొండిలో వున్న మూటను వకసారి చేత్తో నే

నొక్కిచూచాడు. డబ్బులసప్ప భద్రంగా పెట్టినట్లే వుంది. బానల వెనక మనిషి కుండమీదపూది ముంతలోని కుండలోకి కల్లును కొద్దిగాపంచాడు.

'ఏటిరా గోపయ్య మామీద బొత్తిగా దయతప్పినట్టుంది.... ఈడకి రావటమే మానేశావే' అన్నాడు. అక్కడికిరాకపోవటం పెద్ద అన్యాయంగా కనపడ్డది. గోపయ్య సమాధానం చెప్పకుండానే రొండిలోనుంచి అణాబిళ్ల తీసి పైకి గిరగిరా తిరిగేటట్లు ఎగరవేసి ఆ చేత్తోనే కిందకు పడకుండా పట్టుకున్నాడు. గుప్పిటితెరిచిచూస్తే బొమ్మకనిపడింది. హాయిగా నవ్వుతూ 'నీ అదృష్టం పండింది లే కొండిగా' అంటూ ఆ అణా బిళ్ళను బానల వెనక మనిషి చేతిలో పడేశాడు.

ముంత చేతిలో పట్టుకుని దాటివచ్చిన గోడదాకా పోయి ఎత్తు కొండరాయి వకటి వుంటే దానిమీద కూర్చున్నాడు. కట్టిన పంచను మోకాళ్ళ పైకి ఎగతీసి గొంతిక కూర్చున్నాడు. రెండు చేతులతో ముంతను సరిగ్గా పట్టుకుని వరుసగా పేర్చబడ్డ బానలవంక చూచాడు. ముంత పెదిమలకు తగలగానే ఆ బానల్లో వున్న కల్లంతా తన కడుపులోకి పోయినట్లయింది. ముంత పైకెత్తి గడగడా తాగేసి వెర్రిగా ఆకాశం వంక చూచాడు. దూరాన నక్షత్రం వకటి రాలి దారిలోనే అతర్ధానమయింది. అదృశ్యమయిన నక్షత్రం వంక చూస్తూ వక్క ఎగురు ఎగిరాడు. కాళ్ళల్లోకి సత్తువ యిప్పుడిప్పుడే వస్తోంది. 'దాని దుంపతెగ ఎంతగంజితాగితే మటుకు ఈ మజా ఎక్కడొస్తుంది' అనుకున్నాడు. చేతిలోముంత అతని స్వాధీనం తప్పి గాలిలో నాట్యం చెయ్యటం ప్రారంభించింది. దాన్ని గట్టిగా నేలకేసి కొట్టేశాడు ఆఖరికి. గబగబా మంచె దగ్గరికి పోయి 'అరి కొండిగా యింకో ముంత యియ్యరా' అంటూ తూలిపడబోయి కల్లుదాన పట్టుకు నిలబడ్డాడు. రొండిలోనుంచి రెండణాలు తీసియిచ్చాడు. ముంత ఈసారి బాగా నిండింది. గోపయ్య గబగబా వక్క దమ్ములో ముంత ఖాళీచేసి గాలిలో కెగరేశాడు.

కళ్ల ఎరుపు యింకా ఎక్కువ అయే అవకాశం లేక జ్యోతిలాగా వెలిగిపోతోంది. వకసారి రొమ్ముమీదా, తొడలమీదా చెయ్యివేసి కొట్టుకుని మీసాలు మెలిపెట్టాడు. రొండిలోనుంచి చిల్లరంతా తీసి బానపక్కన పెట్టి ఆ డబ్బు కెంతవస్తుందో అంతా యిచ్చెయ్యమన్నాడు దుకాణంవాడివైపుకి తిరిగి. మూలనున్న పెద్ద ముంత వకటి బానపక్కకు వచ్చి నిలబడింది. పెద్దబాన పక్కకువరిగి దానిని నింపేసింది. గోపయ్య విరగబడి నవ్వుతూ దాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని గంతులేస్తూ నడవటం మొదలుపెట్టాడు.

అతని కళ్ళకు మనుష్యుల రూపం వివరం తెలియకపోయినా నీడల్లాగా కనపడుతున్నారు. మంచె తాడిచెట్టులాగా కనపడుతోంది. అందులో అతని పెళ్లాం పిల్లలు కూర్చున్నట్లు అనిపించింది. భయపడ్డ వాడిలాగా ముంతపట్టుకుని తను దాటివచ్చిన గోడవైపుకు వచ్చాడు పారిపోదామని. తన ఫ్యాక్టరీ యజమాని అక్కడ ఎదురుపడకపోతే పారిపోయేవాడే.

యజమాని సాక్షాత్కారం అతనికి ఈ లోకపు దృష్టిని ప్రసాదించింది. యజమానిపక్క పెద్దమనిషి గూడా వున్నాడు. అతని నోటిలోనుంచి గాలిలోకి చాలాదూరం వచ్చిన చుట్టచివర నిప్పు కణకణలాడుతున్నది. గుప్పుమంటూ వస్తున్న పొగను చూసేటప్పటికి తనకు ప్రాణస్నేహితమైన పొగగొట్టం జ్ఞప్తికివచ్చింది. గోపయ్య తడబడి వణుకుతూ కల్లుముంత వీపువెనక దాచుకొని వెనక్కు రెండడుగులు వేశాడు. యజమాని వికటంగానవ్వుతూ 'ఇంతేనండి తాగితందనాలాడతాడు.... యిక్కడ గూడా తాగగూడదని రూలు పెట్టిస్తేసరి.... అప్పటికిగాని బాగుపడరు' అన్నాడు. పెద్దమనిషి చీకటిలో నవ్వాడుగాని శబ్దం కలగకపోవటంవలన చుట్ట కదలికను తప్ప ఏమీ గమనించలేకపోయాడు గోపయ్య. గబగబా వెనక్కు మంచెదగ్గరకు వెళ్ళి ముంతఎత్తుకుని గబగబా తాగేశాడు. 'ఈ నా కొడుకులు నాకేసుఖం గూడా లేకుండా చేద్దామనుకుంటున్నారు.... రూలు పెడతారట రూలు' అంటూ తూగుతూ ఆనందంలోకి వరిగిపోయాడు. ★

52



# కొత్తనాగలి

❖

శ్రీ పి. వెంకటరామారావు

---

జననం: 22–12–1923.

చిరునామా: కొల్లాపురం తాలూకా; మహబూబ్‌నగర్ జిల్లా.

కార్యకలాపాలు: సాహిత్య సాంస్కృతిక కార్యకలాపాలు.

అభిరుచి: సాహిత్యం, కళలు, విమర్శన, రాజకీయశాస్త్రం.

రచనలు: ముద్రితము: సంచికలలో కథలు, స్కెచ్‌లు.

అముద్రితం: కథలు, స్కెచ్‌లు, నవలలు.

అభిమాన రచయితలు: అందరు.

*

53

# కొత్తనాగలి

"ఆఁ అగో ! కోళ్లు కూస్తున్నాయి. బాగా తెల్లారింది. ఎక్కడ్డీ చప్పుడు! మంది, జనం కిటకిటలాడ్తుంది" గొణుగుకొన్నాడు జంబులయ్య.

ఆఁ! మర్శిన ! దాటికాడ కావచ్చు. ఈ ఆయిటిపట్టున అసాంతం పుర్శతే లేకుండొచ్చింది, కాందార్లకు. అగో ! బలూటగ ఉరుముతుండదే ! ! మూడు దశాలసంది ఉరుముడ, మోడమేసుడే గాని, ఒక్క శిన్కన్న పడ్తేనా ! ! ! అరె ! అన్నాల మొచ్చె. మురుగసిర మొదలి పాదంల తప్పక ఆనపడ్తదని పంచాంగం జూసి రాంబొట్లయ్య సెప్పె. హెయ్, తిమ్ బాపనోల్ల ఉత్తమాటలు, ఆనలేదు, ఆగులేదు. మురగశిర మొదట్ల గుడ్క ఆనపడకపోతే ఎట్లర్రామరి. ఇంగ ఎగుసం ఎట్లకెల్లి ! ఎగుపం, ఏట్లపెట్టిన ఎగుసం. దీని పాడైపోను. పోయినానకాలం, మురగశిరలనే ఎగపెట్టె. దేవుడు గిట్టజేయబట్టె, ఆయన మా పైన్నె సూస్తడు తడాక, సావుకారి మా పైన్నె సూస్తడు, కాష్టోల్లయితే సరిసరి, అందరికంటె ముందుగల ఆయిటిసామాను సగసేసుకుందామని, ఎంత బిరాన కట్టె, కాడ, కట్టు అన్ని జారేసుకుంటి. ఈ వడ్లకమ్మర్లతోటి అదో సదమదం. అందరికంటె మొదాలెపోతినా, వడ్ల యల్లయ్య దగ్గరికి ! పోయి ఏంఫాయిదా అంట ! అందరు కాపుదనం సామాను ఆసాంతం చేసే, నాదే నానవెట్టబట్టె. దినాం యాదికంటా వీల్లను బతిమలాడాల్నాయె. ఏం పున్నానికి జేస్తరా ; పూసాటుకు జేస్తరా ! కల్లముప్పుడుపెట్టే తక్రారుకు తక్వేమిలేదు, గిన్ని పిడికెడు గింజలు తక్వపెడ్తె సరివస్తన, ఇల్లు ఆకిలి ఒకటిజేస్తరు. ఒకరా, ఇద్దరా గుంపుగుంపు వడ్లకమ్మరి మంది. అందరు కలిసి ఎగవడ్తరు" అని జంబులయ్య నెత్తికి రుమాలుచుట్టాడు.

పాతచుట్ట వెలిగించాడు. దూలంమీదినుంచి చెప్పులు కిందేసి చెప్పులను పరీక్షగా చూసాడు. "ఊఁ సెప్పులు సుందముసలివైనై" గొణుగుకుంటూ కాళ్ళకు తొడుగుకొని, చేతికర్రను చేతబట్టి వడ్లయల్లయ్య ఇంటికి బయలు దేర సన్నాహపడ్డాడు. "ఏయి! ఎక్కడ పోతివేయ్!! సుట్ట సంచి, పుగాకు ఇట్లతే, నేను వడ్లగేరికి పొయ్యొస్త. పనిపాటలోల్లు వస్తె. ఆయింత మానెడుబుడ్డ కొట్టియ్యి. కార్తెమె నెత్తిమీదికొచ్చె. ఇప్పుడో అప్పుడో శిన్కవత్తె తటామంటె యిత్తనం యెయ్యాల్సొస్తది.... ఊఁ ఇగో!! గుమ్మల్నుంచి జొన్నలుతీయించు జీతగాల్లొస్తునే!!" అని బయలుదేరాడు.

"ఏమన్నగాని అయనపంచాయతి ఆయె, యియ్యాల్ల పంచాయితన్న వెత్త. పనన్న పూర్తి చేయమంట. అరే అదేమంత పెద్దపని. కమ్మరా యన కర్లన్ని సిద్ధం చేసిచ్చె. నాగండ్లు చెక్కేసి కర్లు బలిచ్చేదానికి యింత ఆల్చం చేస్త్రాను వీల్లు. ఇట్లసేస్తరనే నేనే ఎప్పుడో ముందుగలనే, తుమ్మ మొద్దులు నాలుగు జేరగొట్టి వడ్లగేరికి" దోవనడుస్తూ కూడా జంబులయ్య మదన పడసాగాడు.

"మూలనపడి మూల్గుతుండై, వారెవా! కామ్దార్లుగిట ఎగనామం బెత్తె ఎగుసం సక్కగైనట్టె. యీల్లు నాదెగ్గర వర్తన తీసుకున్నట్టెయిగ. పీపనిని పారెయ్య ఈ నాగళ్ళపని పూర్తయింటే సగంపానం కుతార్త ముందు. ఊ! యేమనాలె. యీవడ్లోల్లతో పనంత కరాబయ్యె దినమొచ్చె నారి" జంబులయ్య యల్లయ్య ఇంటికి చేరుకున్నాడు. యల్లయ్య గ్రామ కరణం నాగండ్లను అమురుస్తున్నాడు. దోవనడుస్తూ పడ్డ తీవ్రత తగ్గింది. కరణం నాగండ్లపని జరుగుతుంటే ఏమీ అనలేక తనకుతాను గొణుక్కో-వడం కంటె గత్యంతరం లేకుండా పోయింది.

"అగ్గో! గెరిన పనేమో ఊటుగనే నడుస్తుండది, ఇదేమన్నాల మారి! అందరికంటె నాతాననె ముందుగల పూరాగా వర్తన గింజాతడు.

నాపనేమో యెన్కేస్తాడు. నాపనంటె ఈండ్లకు యాసారు కెందుకొస్త దోంట. ఆ కర్నమయ్య ఏమంత వర్తన యిాల్లకిస్తడయా, మాటగని. ఆయన కల్లంల, ఓ చారెడు గింజల మొకమన్న సూస్తరయిాల్లు! మల్ల కర్నమయ్య కాపుదనం సామాను జూడు! అందరకంటె ముందుగాల్నె తయ్యారైతయి. అందరికంటె ముందుగాల ఆయన శల్కాల్లనే గడాలు తోల్తరు. మొన్న జూడరాదు, నేను, ఆ నడింపంపు రైతులు, యింగెవల్లె వలొ ఆడ గూకునం. వడ్లగేరి మోటున తెల్లారి నప్పటినంది, కూలి పొద్దాయె. అంబలిసుద్ద తాగకపోతిమి. పాయె పటేలు తుమ్మమొద్దులు తేనేతెచ్చె. యెంబడిబడి కొత్తనాగళ్ళు అమరిచ్చుకపాయె. మాటలు పెడ్తు, పెడ్తు. మేమేమొ ఎడ్డిమొకాలోళ్ళం. అట్టనే కూసింటిమి. మాకంటె ఎన్కసిరికొచ్చిన పటేలువి, మేమంత మిటమిట సూస్తుండంగనే వడ్లా యన ఆదర బాదర పనిచేసి బయట బడేసె. యేందుండొచ్చు అంట పచ్చపాతం" ఓమూలకు కూచోని పరీక్షగా కరణం నాగళ్ళను చూస్తూనే ఆలోచించ సాగాడు. జంబులయ్య కరణం నాగళ్ళపని ముగింపు కొచ్చింది. మెల్లగా లేచాడు. లేచేటప్పుడు భూమి కానిచ్చినందువల్ల చేతి కంటిన మన్నును చప్పట్లుకొట్టి దులుపుకున్నాడు. ఆ చప్పట్ల చప్పుడుకు యల్లయ్య దృష్టి జంబులయ్యపై పడ్డది. యల్లయ్య తనలో తాను నవ్వు కొన్నాడు. జంబులయ్య రాకముందు కరణం నాగండ్లపని తీరగానే చెయ్యతలచుకున్నపని జ్ఞాపకమొచ్చి ఆ మొద్దుల వైపు చూచాడు.

జంబులయ్య చేతులు దులుపుకొని లేచాడు. చాలాసేపటినించి కూర్చోడంతో నరాలు పట్టినయేమొ! జంబులయ్య కుంటుకుంటూ రెండు మూడు అడుగులేశాడు.

"కూసోని కూసోని నరాలు పట్టెనేమె!" అనుకుంటూ మెల్లగా గేరివైపు నడిచాడు. "కాని. కాని బిడ్డ! యియ్యాలచెప్త నీపని. అయిన పనాయె వడ్లగేరంత ఒకటిచేస్త" మనసులో అనుకొని గేరిదగ్గరికిపొయ్యి

గొంతు సరాయించాడు, నెత్తిరుమాలునించి చుట్టతీసి యల్లయ్యకు కొంచెం దగ్గరనే కూర్చున్నాడు. చుట్టసంచితీసి జకముక కొట్టాడు. చుట్ట ముట్టిచ్చాడు. వింతగా యల్లయ్యను చూస్తూ "యేమయ్యో! యల్లయా." అన్నాడు. యల్లయ్యకు బాడిశెచెక్కుడు చప్పుడులో వినబడ్డదో లేదో? యల్లయ్య పలుకలేదు.

"అగో! పల్కుడేందిరో, మనిశేయి!! ఓ యల్లయా! ఓ వడ్లెల్లయ్యో!!" కొంచెం ధ్వనినిపెంచి మందలించాడు.

యల్లయ్య చెక్కుతూనే ముఖం తిప్పకుండా "ఊ" అన్నాడు.

"యేందయా? యియ్యాల్లనన్న నాపని చేస్తవా లేదా అంట. యెన్కటికెవడో తానెశెట్టి అంటె, ఏవోన్నట్టు చాస్తుండవేందయా! అయిన గాకున్న మీ కాష్టూర్లకు యింత గుడ్కములా జాలేదేందయా. మేము మీల్యాకనే యిట్లనే దేనికన్న తిప్పించుకున్నామా మిమ్ముల్ని. ఓరి నీయవారంబంగారంగాను, నాలుగు కట్టెలు చెక్కేసి పడేసేదానికి ఇంత రామాయణం చేస్తుండదు" అని యల్లయ్య ముఖంలో ముఖంపెట్టి అడిగాడు.

యల్లయ్య కరణం నాగండ్లపని ముగించి, యింకోరైతుకు సంబంధించిన పాతనాగలిని దగ్గరికి గుంజుకున్నాడు.

జంబులయ్యకు చికాకేసింది. "ఏందయా, ఈ అన్నాలం, కర్ణమోరివికాంగనే చేస్తవనుకొంటే ఇంకోరిది తీస్కోబడ్తివి?" ముఖమంతా ఓతీరున చేసుకొని గట్టిగా అడిగాడు. నోట్లోనుంచి చుట్టతీసి చేతిలో పట్టుకొన్నాడు.

"ఏమంతపనిలేవే పెద్దయ్య. రెండుపేళ్లు కొస్తె అయిపాయె. నీపనిసాగుతె అగుతాది?" పాతనాగలి యజమాని పాపయ్య అందుకున్నాడు.

"సూడబోతే నేనే పనికిరానోణ్ణా ?" అని జంబులయ్య, ఎడమ చెయ్యి నడుముకానిచ్చి అక్కడ ఉన్నవాండ్లందరిని ప్రశ్నించినట్టుచూచాడు.

'పురాతం పచ్చిగుండయి, జర ఓపికపట్టరాదు ? ఎందుకెగుర్తవు ?' యల్లయ్య తనపనిలో లీనమై తల ఎత్తకుండనే సమాధానమిచ్చాడు.

"నిన్న సావుకార్లుతెచ్చిన తుమ్మమొద్దులు కొత్తవానయ్య ? అయి ఆరినాయి ? పురాతం పచ్చిగలేకుండె ! ఆ కోమటాయన, నేను ఒక్కనాడే కొట్టి, బండ్లేసుకొస్తిమి. పచ్చిగాదు గిచ్చిగాదు. మీరిట్లనే చేస్తరయ్య కామ్దార్లు. మొకాలుసూచి బొట్టుపెడ్తరు. పిర్రలుసూచి పీటలేస్తరు. రెండ రక్కల్లేని నాల్క లేనోల్లమైతిం- మేము మీకాస్తాం. అయినా న్యాల మెత్త గున్నదని, పురాతం మోసెయ్యితోటె తోడ్తనంటవు నువ్వు. నా అనుం బోన్ని జర లెహాజ్ చెయ్యాలె. మాతో ఎప్పుడు పనిపడనట్టె జేయబడ్తివి" అని జంబులయ్య తిరిగి కూర్చున్నాడు, తలతిప్పి యల్లయ్యను చూస్తూ "యేంది యింటుండవా ? అయ్యో !: పల్కడేందిరో ! అప్పటిసుంది కాకి ల్యాక లట లట అరుస్తాంటె.... ఆఁ మన్నా, దయ్యమా ? యల్లయ్య ఇంటుండవా ?" అన్నాడు.

యల్లయ్య సరిచేస్తున్న నాగలిని పరిశీస్తు "ఆఁ ఊఁ ఇంటుండ. నాకు కెవుడుందను కున్నావా ?" అని తిరిగి తన పనిలో లీనమయ్యాడు.

"మరి యింటె సంగతేందో చెప్పవైతివి.... నాగళ్ళు తయారు చేస్తనంటావా ? చెయ్యనంటవా ? మిమ్ముల బతిమిలాడి, బతిమిలాడి, నాపానం యాసారుకొచ్చె. నీతో యేగేటాల్లకు పానం సల్లగైతది." అని యింకా యేమో అనబోతుండగానే పోలీసు పటేలు నాగండ్లు అమరిచ్చమని జీతగాండ్లతో పంపాడు.

జంబులయ్యకు చాలా కోపమొచ్చించి, "ధూ....ధూ.... కాపుదనం చేసేటోన్ని మొకం సూడరాదు" అని అక్కడ్నించి దూరంగా చెట్టు నీడకు చేరి ఆనుకొని పరీక్షగా యల్లయ్యను చూస్తూ కూర్చున్నాడు.

అక్కడి వాతావరణాన్ని పరికిస్తూ తిరిగి గొణగడం మొదలు పెట్టాడు జంబులయ్య. "అయిన వీటికి ఈయేడే రోగం తగులాల్నా ఈ నాగళ్ళకు ? అన్ని శెడిపోవాలె ! ల్యాకుంటె అందరికంటె ముందు గలనె పొలం పొతంచేస్కోని కూకుందు. ఎవర్ని బదులియ్యమని అడ్గబో యిన యెవల్లిస్తరు ? అందరికి కాపుదనమేనాయె. అందరు పనిపాటలోల్లె, మీదంగకా త్రిపవేశం. మంచి మొజ్కాపని, అగ్గ సూద్రాదు. యెంతమంది కూకున్నరు. ఈడ గడాలు, ఆడ నాగళ్లు, తీరు తీరు సామాను తెచ్చిన్రు వడ్లాయనతానికి. కొంతమంది పాతనాగళ్ళను, కొత్తగ చేసుకుంటున్నరు. పైన, పైన చెక్కిచ్చి, కొందరేమొ వులితొన బలిస్తున్నరు కర్రుకని, .... అబ్బబ్బ యెన్నడు తీర్పాటుచేస్తరు ఈ పనంత వడ్లోళ్ళు. ఉన్న ఊళ్ళోళ్ళకే సదమదమవుతుంటె, ఈ చుట్టు మూడూళ్ళకు వీళ్ళెనైరి కాష్టూర్లు.... మాటకేంగని, ఆళ్ళు మన్సులేనైరి. ఎంతకంట పనిచేస్తరు. అయినా పాపం చేస్తునేపోతాండు ఒకదానిమీద ఒకటి. కాపుజనంల మాత్రం న్యాలం ఉన్నాది. ఒకాయన "ఇట్ల సప్పరిచ్చే"యనె. "ఇగ్గో ! ఈకాని మాను తొలిగొట్టు యల్లయ్య" అనె. "మామ, మామ జర్రదీన్ని బర్మె ఆనిచ్చే" అనె. ఓడొచ్చి "ఇర్గిన నొగలు జోడిచ్చ"మనె, అందరికంటె తన పని శాన తూర్తు అన్నట్టు, ఒకనిమీదొకరు పడిసత్తాన్రు".... అని జంబులయ్య ఆలోచిస్తుండగానే కోమటిజోగయ్య బండిచక్రాలు పట్టించుకొని గేరివద్దకి చేరాడు. జంబులయ్య, గోడకు ఒరిగినోడల్ల చక్కగా కూర్చున్నాడు.

"యెగుసాయంపన్లు యెన్కపడ్తయని. కాపుజనం కంగారు పడ్తాంటే ఈ కోమటాయన బండిగిర్రలకు శకణంకావాలని ఒచ్చిండేమో? శకణం లేకపోతే గిర్రలు సాగవేమొ ! శిత్రం, ఈడికి యాడాది గావచ్చె నా సవార్బండితొల్లెసేయమని యల్లయ్యయెంబడిబడి. ఎందుకు జేస్తడు ? రూపాయలుసుంద అగావ మింగికూసున్నడు" అని జంబులయ్య నెత్తి రుమాలు తీసి. తిప్పి లోపలిభాగం పరీక్షగా చూచాడు. పేలేమైనా ఉన్న

యేమోనని వెదికాడు. చుట్టగా ఉన్న రుమాలు విప్పాడు. చుట్టసంచితీసి పొగాకు కాడలు తీస్తుండగా ఆవూరి పెద్దకాపుకొడుకు మట్టయ్య బిరాబిరా వస్తుంటే ఆతని కాళ్ళకున్న చెప్పులు చటా, చటా చప్పుడవుతున్నవి. జంబులయ్య వెనుకకు తిరిగి చూచాడు. "ఇగో! ఈనసుందా ఏందో పడిపోయినట్టు వస్తుండుగద! మావూళ్ళో సదువుకున్న మొగాడాయె. ఇంతసదివి ఇంటికాడ్నె కూకున్నడు మరి! కొలువు దొర్కలేదేమొ." అని పరీక్షగా అతని నడకనుచూస్తూ అనుకున్నాడు.

మట్టయ్య, కొత్తగా కట్టిచ్చివ ఆఫీసురూము కప్పు త్వరగా ముగించాలని, చెక్కి ఉంచిన కలప చెడిపోతున్నదని తనపనియొక్క ప్రాధాన్యతను నొక్కి చెప్పాడు

"అమ్మొ! అదాసంగతి? ఇంక బాగనే ఉంది. ఉన్నఇల్లు సాలదేమొ. ఈ రంగుల మొగోడికి. రెండేండ్లసంది పసులకొట్టం కూలిపాలాలు చీకిపోతాంటె, ఒకపాలి యల్లయ్యను సుందా తీస్కపోయి చూపిస్తె చేస్తననె. ఇంకా చేస్తనే ఉండు.... మరి ఇయ్యాల సుంద నాపని కానట్టుందిగద! పొద్దు నెత్తిమీద కొస్తాంది. పాపం ఆ యల్లయ్యకు నల్గురు నాల్గుతీర్ల నాల్గు దిక్కుల పీకేటాల్లకు ఆండ్లకు పానం యాసరు కొస్తది. ఆండ్లు, యిని, యిని మొద్దువారి పోయిన్రు. ఇంత జనం యిన్నితీర్ల మాటలినుపిస్తుంటె ఆండ్లు చేసేదేందో చేస్తనే ఉండరు. అందుకే అందరికి, "సరె, సరె, మంచిది," అని పంపుతూనే ఉండడు." అని జంబులయ్య అక్కడినించి లేచి తలపైకెత్తి పొద్దును చూశాడు. "పొద్దుగల యింత బువ్వన్న తిందాం?" అనుకుంటూ అక్కడ కూచ్చున్న వారందరిని చూసుకుంటూ యల్లయ్య దగ్గరికి చేరాడు—

"యేం, యల్లయ్య తయారయిత వంటవా?" ప్రశ్నించాడు. యల్లయ్య మాట్లాడలేదు. "ఇదెక్కడి బ్యారమారి యల్లయ్య! ఓ వల్లెల్లయ్య! ఆఖరు కేమంటవు చెప్పు? నాగళ్లు చెక్కుత నంటవా? ఏమం

టవు? బలోడివేనాయ్. ఇగసూడు చెప్తుంద. నన్నింత తిప్పలు పెస్తుం డవుగద! నేను సూపుతగానిలే నీపని. అ( మల్లేమనుకున్నవో. ఈసారి కాద్దూరి వర్తన సరిగ్గనే తీస్కుందువులే. కడుమంతి చెప్తాన్న. కల్లం కాడికి రామల్ల కాలిగ్గాలె!" అని జంబులయ్య గట్టిగా మాట్లాడాడు.

యల్లయ్యకు చాలా కోప మొచ్చింది. ముఖం చిట్లించుకొని జంబు లయ్యను బాగా చూచాడు. "ఆ( నీవిచ్చె వర్తన.... గుమ్ములు నిండు తాంది. శేరెడు గింజల వర్తన. ఎందుకు అరుస్తవుగని. తే, తే, ఆ మొద్దులు, తేమల్ల తెమ్మంటె? దోడినాగళ్ళు యిట్లచెక్కి అట్ల పారెస్త. అంటె కోపంగాని ఈయేడే కొత్త మొద్దులు తేవాల్నేం. కొత్త నాగళ్ళ కంటనని? యేందో కొత్తగ ఎగుశాయం చేసిటోనోలే మాట్లాడుతాం డవు...." "అప్పటాలనించి అరుస్తాండవు. మొద్దులు తెమ్మంటె ముఖం సూడబడితివి. మాటల కున్నావు?" అని యల్లయ్య జంబులయ్యను హేళనగా చూస్తు మొదులు దెగ్గరికి పొర్లించు కున్నడు. అప్పుడు జంబు లయ్య పట్టలేని ఉత్సాహముతో, యల్లయ్యకు సాయంగ మొద్దులను పొర్లించాడు. ముఖమంతా వికసించింది. ఇక తప్పకుండా రేపు జంబు లయ్య కొత్తనాగండ్లు సాగుతాయి.





# చీకటి గొడుగులు

❖

శ్రీ గూడూరి సీతారాం

---

జననం : 1935 ఫిబ్రవరి.

చిరునామా : సిరిసిల్ల, కరీంనగరం జిల్లా.

కార్యకలాపాలు : తెలంగాణా రచయితల సంఘం సిరిసిల్లశాఖ కార్యదర్శి; విద్యార్థి సంఘం సిరిసిల్ల అధ్యక్షుడు; 'తరంగిణి' పాఠశాల పత్రిక సంపా.

అభిరుచి : సాహితీసేవ, సంఘ సంస్కరణ.

రచనలు : ముద్రితం : 'కొత్త పాతలు' నవల, అనేక కథలు, వ్యాసాలు, నాటికలు.

అముద్రితం : కథానికలు.

అభిమాన రచయితలు : దాశరథి, నారాయణరెడ్డి,ముని మాణిక్యం, గోపీచంద్, శరత్‌బాబు.

*

# చీకటి గొడుగులు

పత్రిక పట్టుక్కూర్చున్నానప్పుడే. ఎట్లా చూచాయో ఏమో ? చీకట్లు బెల్లంమీద ఈగలు ముసురుకున్నట్లు చుట్టూ చుట్టుకున్నాయి. మెదడు మెదళ్లోనుండి పారిపోయింది. ఏవేవో ఆశలూ – ఆలోచనలూ వెలుగులా ముఖం మీదికి ప్రాకాయి.

'ఎందుకలా మనసు మారిపోయింది. కోమల కరాలు హృత్పుటాలను కదలిస్తుంటే ప్రాణం ఆమె ప్రాంగణంలోకి ప్రాకిపోయిందా ? అరుణాధరాలనుండి దొంతరలు దొంతరలుగా దొర్లిన జలపాతంలో కొట్టుకపోయిందా హృదయం ?'

'ఆపూట ఆనందం నిముషనిముషానికి పొంగులెత్తింది. ఊహాతీతమైన ఊహలు హృదయంలో మల్లెపువ్వుల్లా విచ్చుకొన్నాయి. వెన్నవంటి ఆమె హృదయంలో ఐక్యమై పోయానప్పుడే ! ఆమెలో ఎంతసేపు ఆడుకున్నా మనసుకు శాంతి కలగలేదు. ఆమె అమృతాన్ని లొణికించే అమృతమూర్తి. దరహాస తుషారాన్ని చిలికే ఆ సుందరాంగి పాదాలపై నా సర్వస్వాన్ని ఒలకబోసుకున్నాను. ముగ్ధ సౌందర్యమూర్తిని ఆరాధించే భాగ్యం నాకు కల్గింది. ఆమె కనువిప్పితే నవ్వులు తొణికి పోయాయి. ఏమానందం....ఆనందం వర్ణనాతీతం....అందమే ఆనందం....

రసమయ జగత్తు కళ్ళముందు కదలిపోయింది. ఊహాజనితమైన హృదయం ఊగుతూనే ఉంది.

'ఎందుకట్లా చీకట్లు ఆవరించాయి ? మెదడున్న ప్రదేశానికి అంతు చిక్కలేదు. చిరుచెమట చిమ్మింది. చీకట్లంటే ఎందుకంత భయం?' మరీ అంతుచిక్కలేదు.

అప్పుడప్పుడే చలి చల్లగా యింజెక్షన్‌లాగా శరీరంలోకి గుచ్చు కుంది. చీకటి వెలుతురికి వణికిపోయి దగ్గరికి ముడుచుకున్నట్లు శరీరం ముడుచుకుంది. ఇప్పుడు ఎందుకో అతీతమైన జవాబులు శరీరంలో జెర్రుల్లా ప్రాకిపోయాయి. స్రుక్కి ముడుతలుబడ్డ శరీరం అగ్గిమీద నీరు చల్లినట్లుగా సురసుర పొంగింది. నాలో ఘడియకొక ఉద్వేగం ఉడిగి పోతుందెందుకో? పత్రిక పుటలు శాంతి కపోతం రెక్కల్లా కదలి పోయాయి.

"ఆ జవ్వని ఒడిలో ఒదిగి పోయానెందుకు? హృదయం పార వశ్యంజెంది ఉరకలు వేస్తుంటే, ఆ పారవశ్యాన్ని గుప్పిటిలో దాచలేక పోయానెందుకు? ఎందుకు?"

"జీవితం బుద్బుదప్రాయం. ఒట్టి నీటిబుడగవంటిది" ఎన్ని గ్రంథాలు వల్లిస్తే ఏం? ఇంత మాత్రం తెలియలేదే!"

ఉర్రూత లూగుతున్న హృదయానికి ఇవన్నీ ఎందుకు? అప్పుడు కావలసింది ఆనందం! మహదానందం!! వెచ్చనిసుఖం అంతే! అంతే!!

కారు మబ్బులు కదలిపోతున్నాయి. వాటితో ఎండమావులు ఎగిరి పోతున్నాయి.

"ఎందుకంత తొందరపాటు. ఆవేశాన్ని అణచుకోలేక పోయా నెందుకు?" పొంగుమీద పొంగు పొర్లిపోతుంటే అలలు ఆగిపోతాయా మధ్య! అప్పుడు అపరానందంలో ముద్రించబడ్డాను. ఆమె వెచ్చని కౌగి లిలో తేలిపోయాను. జీవితాన్నంతా అమృతపు సోనలతో రాపిడిచేశాను.

"వాడెందుకలా వాడిపోయాడు? ఒక నిర్భాగ్యుడి జీవితం సంతోష తరంగాల్లో తేలిపోతుంటే చూడడానికి ఆస్కారం కలగలేదా? ఎన్నాళ్ళ నుండో తపస్సు చేసినగాని లభ్యంగాని వరం ప్రసాదించబడ్డది. దాన్ని మనసార అనుభవించాను. మరి వాడెందుకు సహించలేక పోయాడు? ఒక అనాథప్రవాహంలో పడితే రక్షించలేడా? మరివాడుచూస్తూ ఊరు

కొనక మధ్య పోనీ, చావనీ అని చప్పట్లు చరిస్తే మానవత్వం గలవాడు నోరు మూసుకుంటాడా ?

ఏవేవో హృదయంలో నాటుక పోతున్నాయి. పత్రిక తడసి పోయింది. నా నాడులనుండి ఘర్మజలం స్రవిస్తుంది. "ఎందుకు ? నేనేమి కాయంవంచి కష్టం చేయలేదే ?" కాదు అంతపనీ చేశాను. నిజం.... నిజం....పెదవులనుండి పాలిపోయిన నవ్వు పొరలు పొరలుగా పొర్లి పోయింది. అప్పుడే మెరసినదీపం పరిహాసం చేసింది. నాలో మళ్ళీ ఏవేవో తరంగాలు తరలిపోయాయి.

"ఆ అమ్మాయి తన్నెందుకు కోరింది ? అందాలల్లో ఆరితేరిన వాడినికాదు. ఈ కర్కశ హృదయాన్ని తన లేత పరిమళాల్లో ఎలా చిక్కించుకుంది ? నిజంగా ఆ అమ్మాయికి నేను తగినవాడిని కాదు.... కాదు....కాని....కాని....తన్నెందుకు కోరింది ? తరిమేయ లేదే ? తన్ను తనే వలచి వచ్చింది. వలచి వచ్చిన అందాల బరిణెను ఎవడు త్రోసి పుచ్చుతాడు. ఎంత రాతిగుండైనా ఆ అమ్మాయి కన్ను వేసిందంటే 'కాదు' అనడానికి నోరు ఎవరు విప్పడానికి సాహసిస్తారు ?

"స్త్రీలకు కొంతవరకైనా స్వేచ్ఛ యివ్వకూడదా ? ఆ పశువెందు కలా చేశాడు ? వాడిదేం పొరపాటు. చేసిందంతా నేను....ఈ మహా పాతకి....కాదు....కాదు...."

నాలో భయం చీకటి ఆవరిస్తుంది. శరీరమంతా కంపరమెక్కు తుంది." మిత్రద్రోహి ! మిత్రున్ని మోసం చేస్తావా ? నిజంగా నీవు మనిషి వేనా ? మనిషి మనిషిని నమ్మకపోతే మరెవరిని నమ్ముతాడు ? తిన్న యింటి వాసాలు లెక్కబెట్టడం మానవుని ధర్మమా ? ఛీ...." అంటూ నాలోని కల్మషరహితమైన హృదయం ఛీత్కారం చేసింది.

'మిత్రుడు, మిత్రు డెవ్వడు ? యువభావాలకు గిలిగింతలు బెట్టి సహజంగా నేను వాంఛించకుండానే ఆమె కోరినపుడు కాదనడం ఎంత

మహాపాపం ? మిత్రుడైతే మిత్రుని కేం లోటు కలిగింది.'

"వాడు అలా చేస్తాడని కలలోకూడా అనుకోలేదు. అంత అందమైనదాన్ని ఇంట్లోనుండి తరిమివేయడమా ? ఇది మానవులు తలపెట్టే కార్యమేనా ?" నాలోని కల్మషపూరితమైన ప్రత్యణువు ప్రశ్నించుకుంది.

"ఇవ్వాళ్ళ ఆ అందాలరాశినిచూచి సంఘం నవ్వుతుంది. ఆమె చేయరానితప్పు ఏం చేసింది ? చేసిందంతా నేను. నా మూలంగా ఆమె పరువు పాడైపోతుంటే కళ్ళారా చూడాల్సిందేనా ? వీల్లేదు. అలా కావడానికి అసలేవీల్లేదు. ఐతే ఏం చేయను?" తర్కించుకోవడమేకాని అంతు చిక్కడం లేదు.

"పోనీ ! ఆమె నిక్కడికి తెద్దునా !"

"మరి ! అతడు మిత్రుడేగదా ! ఏం చేయను. ఆమె నా అందాల ప్రోవు. వాడు నా మనసులోని మనసు. ఇంతకీ ఆమె నెందుకలా చేశాను."

"మిత్రుని భార్యని నీకు తెలియదుగా" అంది భారంతో గుండె :

"భోజనానికి లేవండి !" ఇంట్లోని పిలుపు చెవిలో పడగానే నిద్రనించి మేల్కొన్నట్లు తెప్పరిల్లాను.

ఇంకా ఏవేవో చీకటి గొడుగులు చాటుచేస్తున్నాయి. భావాలూ - ఆశలూ భయంగా మెదట్లో మెదలుతున్నాయి. "నీవు చేసిన తప్పులన్నీ నాలో వున్నాయి చూడు" అంటూ పత్రిక కిలకిల నవ్వింది.

"నిజం....నిజం...." అంటూ పెదవులనుండి పాలిపోయిన నవ్వు పొరలు పొరలుగా పొర్లిపోయింది.





# తిరిగిరాను

❖

శ్రీ పెండ్యాల చినరాఘవరావు

జననం : 31—12—1932.

చిరునామా : C/o శ్రీ పెండ్యాల శేషగిరిరావుగారు,
చినపెండ్యాల పోష్టు, ఘనపురం స్టేషను,
తా. జి. వరంగల్లు

కార్యకలాపాలు : 1. ఉపాధ్యాయుడుగా ఉద్యోగం
2. ఘనపురంలో 'స్నేహలత' సంఘం, గ్రంథాలయాల నిర్వహణ.

అభిరుచి : కవిత్వం, కథాసాహిత్యం, విషయసేకరణ.

రచనలు : ముద్రితము: వివిధ పత్రికల్లో కవితలూ, కథానికలూ, వ్యాసాలు.

అముద్రితం : 1. క్రీనీడలు (కవితా సంపుటి) 2. జీవన దృశ్యాలు (కథానికలు), 3. కన్నీటి కానుక (లేఖలు), 4. విద్యున్మాలిక.... ఇంకా ఇతర వ్యాసాలు, రచనలూ.

అభిమాన రచయితలు : కాళిదాసు, కీట్స్, శరత్, కృష్ణశాస్త్రి, చలం, పొట్లపల్లి రామారావు, డి. రామలింగం, సి. నారాయణరెడ్డి.

# తిరిగిరాను

"అబ్బా! నాలుగేండ్లా?...." "అంతవరకు?...." ఎవరో అవ్యక్త మధుర స్వరంతో అన్నట్టుగా. అదో ఆలాపనగా తోచింది రఘుకు. అంతవరకూ కుర్చీలో ఉదాసీనంగా కూచున్న వాడల్లా ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు. శరీరంలో గగుర్పాటు, హృదయంలో సంచలనం ... రెండూ ఒకేసారి కలిగినాయేమో! కాస్త గంభీరమైంది అతని కంఠ స్వరం. అనుకోకుండా రెండు కనులనిండా గిఱ్ఱున నీళ్ళు తిరిగినాయి. ఎవరిదో చిరపరిచిత కంఠమే అది.

క్రిందటి రాత్రి జరిగిన ఒక ఘటన తిరిగి కళ్లెదుట వచ్చి నిలిచినట్టు తోచిందతనికి. మొదటినుంచి చివరిదాకా మళ్ళీ ఆరాత్రి సంగతులన్నీ ఒకసారి నెమరు వేసుకున్నాడు. "ఇదంతా నిజంగా జరిగి వుంటుందా?" తన చెవులను హృదయం దగ్గరగా తెచ్చి మెల్లగా తెలుసుకో ప్రయత్నం చేశాడు. తనమీద, తన మనసుమీద తనకే నమ్మకం లేనంతగా ఐపోయా డిక. తనను తానే నమ్మలేక పోయాడు. బాధతో పాతాళానికి క్రుంగి పోయిన తనని తాను సంబాళించుకోలేక అలాగే కుర్చీలో చేరగిలబడి పోయాడు. గత చిత్రం కళ్ళెదుట ఆడసాగింది.

"అబ్బా! నాలుగేండ్లా!.... అంత వరకు....?" గోడనానుకొని ఆమె భారంతో అనిన యీ పూర్తికాని చివరి వాక్యం రఘు హృదయాన్ని యెంతగా గాయపరచిందో! ఇప్పుడది మాటల్లోచెప్ప ప్రయత్నం చేయటం వృధా ప్రయాసమే ఔతుందేమో! ఆమె ఈమాటల వెనక యెంత బాధ.... శోక విహ్వలత.... కరుణ, ప్రాధేయతా భావం.... ఇవన్నీ ఒక్కుమ్మడిగా సమ్మేళనమై దాగుడుమూత లాడుతున్నాయా?.... చెప్పడం కొంచెం కష్టమే.

అప్పుడామె ముఖం వివర్ణమై పోయింది. కళా విహీనంగా మారింది. నిరాశా, నిస్పృహలు అక్కడ తాండవం చేస్తూ వికటాట్టహాసం చేస్తున్నాయి, "మారె! నేనిక యీ బ్రతుకు నీడ్వలేను?" అనే భావం తాలూకు నిరుత్సాహ రేఖలు స్పష్టంగా ఆమె ఆ పేలిన, పాలిన మొగాన గోచరిస్తున్నాయి.

తనంటే ఆమెకు ప్రేమ లేదేమోననే భావం. కాదు అపోహ ఒకటి రఘు మనసులో బాగా నాటుకొని పోయింది. తనతో ఆమె కేర్పడిన ఈ స్వల్పకాల పరిచయంలోనే ఆమె తనని బాగా అర్థం చేసికో లేదే? అని వాపోవటం నిజానికి రఘుకు తగదు. ఆమెను గురించి, ఆమె మనస్తత్వాన్ని సరిగా అవగాహన చేసుకో వీలుపడని ఈకొద్ది వ్యవధిలోనే.... ఆమెను "హృదయంలేని ఒట్టి రాతిబొమ్మ" క్రింద కట్టిపెట్టడం కూడ ఏమంత తెలివైన పనికాదు మరి. పైగా ఆమెను తనవైపు ఆకర్షించుకోడానికి తంటాలుపడు తున్నాడు. తను చెప్పినట్లల్లా విని ఊఁ కొట్టే, "చిలుక"లా తయారు చేసికోడానికి తాపత్రయ పడు తున్నాడు. ఆదర్శాల, యేవో ఆశయాల పేకముక్కలతో ఊహా సౌధాలు నిర్మించుకోవాలని కలలు గంటున్నాడు. కాని అవంతా పొసగేదెట్లా? తాను వలపట లాగితే, ఆమె దాపల.... ఇక ఈ కొత్త బతుకు బండి నడచినట్లే!

ఆమె తను అనుకున్నంత అడివిమనిషి కాదని, మనసు, మమత, లేని మగువ కాదనీ.... ఇది యిన్నాళ్ళ రఘు స్వానుభవం మీదగాని తెలుసుకోలేక పోయాడు. అప్పైన కొంచెం చకితుడైనాడు కూడ.

ఇన్నాళ్ళు ఆమెకు దూరదూరంగానే వుంటూ వచ్చాడు. ఆమెమీద కారాలు మిరియాలు నూరటంలో తక్కువేమీ చేయలేదు. అందుకని ఆమెలోని అవగుణాలనూ బయటపెట్టి నలుగురి యెదుట ఆమెను రద్ది చేయ చూచేడు. అతని కదొక ఆలంబనంగా ఐపోయింది.

కాని ఆమెలోగల కొన్నయినా మంచి గుణాలను, గ్రహించే శక్తి గాని, ఓపికగాని రఘుకు లేకపోయింది. తన స్వభావాన్ని, ప్రవృత్తిని కనిపెట్టి తదనుగుణంగా, అనుకూలంగా వర్తించక పోవడమే ఆమె తన పట్ల చేస్తున్న అపచారమని రఘు అభిప్రాయం. రఘుకు పూర్తిగా లోబడి "చరణదాసి" అయ్యేటంత అమాయకురాలు కాదామె. రఘుకున్నట్లే ఆమెకూ.... కొన్ని స్వంత అభిప్రాయాలు, స్వతంత్రాలోచనలు, కొన్నయినా మంచి భావాలు లేకపోలేదు. స్వతహాగా అభిమానవతి, పట్టుదల గల మనిషి. అందులో కొంచెం మంకుతనం, పెంకెతనం కూడ వున్నాయంటే తప్పేమీకాదు.

ఈ కారణాలవల్ల రఘునోటినుంచి జారీఅవుతున్న ప్రతి హుకుంను హెచ్చరికను అట్టే ఆమోదించి అమలు పరిచే స్థితిలో ఆమెలేదు. కాని అతని స్వాభిమానం అతనిదీ.... ఆమె ఆలసత్వం ఆమెదీను. ఈ పరస్పర భిన్న భావాల ఘర్షణలో శాంతిగాని, సామరస్యంగాని ఎలా ఉంటాయి ? దానికి విరుగుడు ఒకటే. ఒకేచోట మనగలగాలంటే యిరువురిలో ఎవరో ఒకరు కాస్త స్వాభిమానాన్ని చంపుకోవాలి. కొంచెం ఒక మెట్టు క్రిందికి దిగి పరిసరాల పరిస్థితుల నర్థం చేసుకోవాలి. ఇది వినా విడిపోవడమే యిక యిరువురికీ గత్యంతరం.

ఈ అభిప్రాయ భేదాలు చివరికీ ఘటనక్కూడా దారితీసినాయి. ఆమె తనపట్ల ముభావంగా మెలగడాన్ని, మరో విధంగా అనుమానించాడు రఘు. ఆమె తన అస్వస్థత, నీరసమనోస్థితి కారణంగా అలా యెడం యెడంగా వుండటం అసహజమేమీ కాదు నిజానికి. ఆమె ఆస్థితికి సానుభూతి కనబరచటానికి బదులు, పైగా అతని సహృదయం కొరవడింది.

"ఛీ! నీముఖం చూడను" కోపం హద్దులు దాటింది రఘుకు. అయినా ఆమె ఓర్చుకుంది. ఏమీ మారుపలుక లేదు. "అందుకనే వేరే

మీతోవ మీరు చూసుకోండి. నేను అడ్డురాను. నిజం" అని నవ్వింది సబాయితంగా. ఆమె ఆనవ్వు రఘు మనస్సును మరింత కలచి మెలిపెట్టి నట్లయింది. మాటకు మాట బదులు చెప్పడం ఆమె స్వభావమై పోయింది. అది రఘుకు నచ్చదు,

కాని ఆమె వెంటనే యిటువైపు ముఖం త్రిప్పుకున్న రఘును తనవైపు లాగుకొని అతనిని అనునయించటానికి యెంతో ప్రయత్నం చేసింది. అతని తామసాన్ని చల్లార్చడానికి అంతకంటే మంచి వుపాయం ఆమె ఊహకు తట్టలేదు. "నేనన్న దాంట్లో ఏమన్నా తప్పుంటే క్షమించొచ్చు." అని మాత్రం అనగలిగింది. "ఇదంతా వగలు, వంచన" అనే ఒక "మాసిపోని భావం" అతని మేధోపీఠంలో తిష్ఠవేసుక్కూచున్నది యీ కొద్దిరోజుల్నుంచి. అంతకు కొన్ని క్షణాల క్రితమే ఆమె కురిపించిన స్నేహామృతభాషణం సైతం యిప్పుడు చప్పున మరచిపోయాడు. అనవసర క్రోధం పైకి రానిచ్చాడు. సరసం విరసంగా మారింది. ప్రణయ కలహం ప్రళయరూపం దాల్చి, చిలికి, చిలికి గాలివాన అయింది. ఆ కలహం అంతటితో అంతమైన 'అద్దంమీది నువ్వుగింజ'గా అయితే ఆనందించ వచ్చిందే. కాని అలా యెన్నటికీ జరుగలేదు.

ఆమె నేరమేమిటో నిర్ధారణచేయడం యిదమిద్ధమైపోయిందతనికి. అందుకే యిరుకున పడ్డాడు. అయితే మరి యీసడించుకోవడం మాత్రం తెలుసుగా! అతనితో తనకున్న పరిచయాన్ని, చనువును పురస్కరించుకొని ఆమె కొన్ని వినరాని, అనకూడని మాటలు అనడంలో కొంత పొరబాటు వుండొచ్చు. తెలిసి తెలిసి అలాంటి పొరపాట్లు ఇదివరకెన్నోసార్లు చేసిందికూడ. కాని ఇవాళ యీ అనడం, ఈ సరసం, తనపీకమీదికే వస్తుందని కలలోకూడ ఆమె భావించియుండదు. రఘు యింతటి అక్రమానికి, అఘాయిత్యానికి ఒడిగట్టుతాడని బహుశా ఆమె అనుకొని వుండదు. అందుకనే అతనిని బుజ్జగించటానికే యింకా ప్రయత్నించింది.

రఘు ఆమె చేయి విదలించి, 'వెళ్ళిపోతున్నా నేను' కర్కశంగా వున్న దాతని కంఠస్వరం. 'ఎక్కడికి ?' సహజ దీనస్వరంతో, ప్రార్థనా పూర్వకంగా పలికింది, విదలించివేసిన చేతిని తిరిగి అతని దాళ్ళవద్దకు రానిస్తూ. రఘు దూరంగా జరిగి, 'హుం జరుగు అటు' పోబోయాడు. 'నా తప్పేమైనా వుంటే క్షమించండి. కోప్పడకండి ! దండం పెడతాను. పోదురు గాని పూర్తిగా తెల్లవారందే ?'— ఆమె అభిమానం యెక్కడ మటుమాయమైందో. ఇంతలోనే వజ్రం మైనంగా మారిందే ! మళ్ళీ అడిగింది. 'ఎక్కడికి వెళ్ళిపోవటం చెప్పగూడదా ? తప్పా ?' బ్రతిమిలాడింది. కొంచెం రఘు తగ్గి 'తిరుపతికి'. ముక్తసరిగా చెప్పి ఊరుకున్నాడు.

'తిరుపతికి ? తిరుపతి కెందుకు ? తీర్థయాత్రకా ?'

'కాదు. చదువుకోటానికి'

'ఇక్కడలేదా చదువు ?'

'లేకేం ! వుంది కాని అది ఈ చదువు కాదు....'

'కాక. ఇంకే చదువోమరి ?'

'సంస్కృతం, తెలుగు - ఇంకా ఇలాంటివే. ఇంగ్లీషు యివీ వుండవు'

'అయితే బి. ఎ. ఎం. ఏ. కాదన్నమాట'—

'కాకున్నా అటువంటిదే'

'మరి దాన్నేమంటారు ?'

'భాషాప్రవీణ'

'మరి యీ యేడు 'ఇంటర్' కూర్చుండరా ?'

'ఉహుం అక్కర్లేదనుకుంటాను'

'అయితే ఎప్పుడు వెళుతున్నా రేంటి'

'వచ్చే నెల మొదటివారంలో వెళ్ళాల్సి వుంటుంది'

'పరీక్షయిచ్చి మళ్లీ తిరిగివస్తారుగా' ఆశ స్ఫురిస్తూ పలికింది.

'పరీక్షయిచ్చి రావడం యింతలోనే కాదు'

'కాక. అక్కడెన్నిరోజులుండాలి ?'

'నాలుగేండ్లు'

'అబ్బా! నాలుగేండ్లా?....అంతవరకు?' ఆర్థోక్తిలోనే ఆగిపోయింది. కాని కొంతసేపాగి మళ్ళీ 'అయితే మరి మీ ఉద్యోగం ఏం గావాలి ?' ప్రశ్నించింది.

'ఉద్యోగానికి రాజీనామా పెట్టి వెళుతున్నాను.'

'రాజీనామా ! బాగా ఆలోచించేనా ?'

'ఆ( ఔను ?' రఘు తొణకలేదు.

'అంతా అబద్ధం. నాకు తెలుసు. నన్ను తమాషా పట్టిద్దామని అంటున్నారేమో !'

'నీతో తమాషా దేనికి ?'

'అయితే మరి నిజంగానే వెడుతారా ?'

'నిజంగానే'— నిర్వికారంగా సమాధానమిచ్చి వూరుకున్నాడు.

అయినా ఆమెకింక నమ్మకం కలగలేనట్లుంది రఘుమాటల్లో. మరీ మరీ రెట్టించి 'నిజంగానే!' అని నిలదీసింది. ఒట్లల్లా వేయించుకుంది. ఆ ఒట్లన్నీ చాలనట్లు 'సరస్వతితోడు ?'....అదికూడ గట్టిగా ఒత్తించి పలికించింది. ఆమె ఈ పట్టుదలలో ముగ్ధత్వం మూర్తీభవించింది. 'ఊ( !' అని ఒక పెద్ద నిట్టూర్పు విడువగలిగింది. 'రేపయితే నేను ఊరికి వెడుతున్నానాయె. మీరక్కడిక వెళ్ళేటప్పటి కిక్కడ ఉండనేమో !'.... క్షణకాలం ఆగిపోయిందల్లా మళ్ళీ 'వెళ్ళేముందు ఒకసారి కలిసిపోరూ ?'.... ప్రాధేయత, ఆరాటం- పుట్టిపడుతున్న ఈ వాక్యం- ఆమె 'హృదయం లేని మనిషి' అనే రఘు తప్పుడు అభిప్రాయాన్ని చెరపివేసింది.

'ఎందుకు ? ఏమో చూస్తాను' నిర్లక్ష్యం, ఉపేక్షాభావం కన్పించినాయి రఘు మాటల్లో. అతని ముఖం గంభీరమైంది. ఉచ్ఛగరికి వచ్చింది.

'అబ్బా! నాలుగేండ్లు మీరు అక్కడేవుండి చదువకుంటే ఏం?'.... అదే మాటగా ఆలపించిందామె.

'మధ్యమధ్య ఉత్తరాలు వ్రాస్తుంటారా?' ఉబికివస్తున్న కుతూహలాన్ని పట్టలేక అడిగిందామె. కాని రఘు- 'ఉహుఁ వ్రాయను. వ్రాయాల్సిన అవసరం కనుపించటం లేదు' కట్టె విరుపుగా అన్నాడు. ఈ కట్టెవిరుపు జవాబు ఆమె కోమల హృదయసుమాన్ని తుంచిందని రఘుకు గుర్తు లేదుగా! 'పోనీ మధ్యన ఎప్పుడైనా వస్తారా?' ప్రశ్నార్థకంగా రఘు కళ్ళలోకి చూచింది. 'ఆఁ ఓ పదిరోజులువచ్చి ఉండిపోతాలే!' తేలికగా అనేశాడు. 'పదిరోజులేనా?'— ఆశ్చర్యం ప్రకటిస్తూ ఒకసారి అతనికేసి చూచి తిరిగి చూపులు నేలకేసి త్రిప్పుకున్నది. 'నాలుగేండ్ల దీర్ఘకాల వియోగమందు కేవలం ఈ పదిరోజుల స్వల్పకాలం- కలయిక యెంత?' అని కాబోలు ఆమె మనోభావం. 'ఔను! చాలవా పదిరోజులు'— తీసేసినట్లు వున్నాయి రఘు మాటలు. ఆమె యెంతో చిన్నబుచ్చుకున్నది. చిన్నబోయిన ఆమె ముఖం రఘుకు జాలిపుట్టించలేదు. మరోవైపు తిరిగి బిఱ్ఱబిగిసి పడుకున్నాడు.

చాలసేపటివరకు గది అంతటా స్తబ్ధత నిశ్శబ్దత దాగా అలముకుపోయింది. ఆమె గోడకానుకుని యేదో దీర్ఘాలోచనలో మునిగిపోయింది. ఒకగంట తర్వాతగాని రఘు పెదవులు కదలి మాటలు రాలేదు. 'నీతో ఒక ముచ్చట' పూర్తిగాకముందే ఆగిపోయినాడు. 'ఏమిటి?' ఉప్పొంగి వస్తున్న వుత్సుకతకు కళ్ళెం వేయలేకపోయింది. 'ఆఁ ఏమీ లేదులే!— మరోసారి యెప్పుడైనా చెబుతాను'- అప్పటికలా సర్దిదామనుకున్నాడు. 'నువ్వువెళ్ళిపడుకో!' అన్నాడు. ఆమె కురిదాపన మరీ హెచ్చింది. కుడితిలోపడ్డ ఎలుకమాదిరి కళవళ పడింది పాపం! 'ఉహుఁ ఏమిటో ఇప్పుడే చెప్పాలి' బలవంతంచేసినా రఘు వినిపించుకోక 'ఎందుకులే' అని నానబెట్టుతూపోయాడు.

'నోటితో చెప్పటాని కిష్టంలేకపోతే వ్రాయండి.'

'ఎందుకు వద్దులే ! నీకు కష్టం కలుగుతుందేమో !'

'అయితేమానె ! పరవాలేదు. ఇప్పుడున్న చింతలలో అదొకటీను. మనసు కష్టపెట్టుకొని ఇప్పుడు మాత్రం చిక్కిపోవటం లేదా ?'

రఘు గోడకేసి తిరిగి, గోడమీద గోటితో ఏదో వ్రాసినాడు. అస్పష్టంగానైనా కాస్తకాస్త ఆ అక్షరాలను గుర్తించ గలిగిందామె.

'తి—రి—గి—రా—ను' గోడమీది మూగజీవాలు ధ్వనిస్తున్నాయి. 'తిరిగిరాను ?' అంటే ఏమిటి ? 'తిరుపతినుంచి తిరిగిరాక అక్కడే వుంటారా ? మీ మాటలు నాకు ఏమిటో స్పష్టంగా చెప్పరేం ?'

'మాట యిచ్చాను వాళ్ళకు' మర్మ గర్భితంగా రఘు జవాబు.

'ఎవరికి ? దేని గురించి ?' ఆమె ఆందోళన హద్దులు దాటింది.

'చేయి దాటిపోయింది' ఒక వాక్యాని కింకోదానికి పోలికలు లేని రఘు మాటలు, ఆమె గాయానికితోడు మరింత కారం అద్దినట్లున్నాయి. 'ఏమిటో యిదంతా' అగమ్యగోచరంగా కనిపించింది. తనను తానే యేమేమో నిందించుకోసాగింది. నిర్జీవప్రతిమ యిప్పుడామె. ఐనా రఘుకు చీమకుట్టినట్లయినా కాలేదు. తెల్లవారవచ్చిందికూడ.

ప్రొద్దు బారెడెక్కింది. లేచి చూచాడు. ఆమె యింకా అక్కడే కూచునివుంది. లేవబోతోంటే 'సంగతేంటో సగంలోనే ఆపి యేడిపించకండి. స్పష్టంగా వివరంగా చెబుదురూ!' చాల చాల బ్రతిమిలాడి చూచింది. రఘు హృదయం కరగలేదు. వజ్రంకంటె కఠినమైపోయింది. 'ఎందుకులే ! ముందు ముందు అనుభవంమీద నీకే తెలుస్తుంది' అన్నాడు. 'అనుభవం మీద ?' వల్లిస్తూ స్తంభించిపోయింది. పిచ్చిదానివలె గుణిస్తూ కూచుంది. 'తి-రి-గి-రా-ను.'

ఇవాళ బడికి వచ్చేముందైనా తనసుకలిసి సంగతి విప్పి చెబుతాడే మోనని నమ్మింది: కాని రఘు ఇంట్లో యెవరికీ చెప్పిరాలేదసలు. 'నీమీద

కసితీర్చుకుంటాను' రఘు యెప్పుడో అనిన ఒకమాట చటుక్కున ఆమె జ్ఞప్తికి వచ్చి నిలువునా నీరై పోయింది. వణకిపోయింది. స్త్రీ యెంత అభిమానవతి ఐతేమాత్రం యేం చెల్లుతుంది గనక? ఆమె యెంత లొంగి వచ్చింది. ఐనా తాను తృణీకరించివచ్చాడు- ఆలోచనలో మునిగినాడతడు. 'తిరిగిరాను?' అనే శేషప్రశ్న యింకా వేధిస్తూనేవున్నది ఆమెను.





# నాగి

❖

శ్రీమతి పి. యశోదమ్మ

---

జననం : 8—8—1929

చిరునామా : కల్పనా ఇండస్ట్రీస్, నారాయణగూడ, హైదరాబాదు

కార్యకలాపాలు : లెక్చరర్, మహిళా కళాశాల.

అభిరుచి : సాహిత్యము.

రచనలు : ముద్రితం : రేడియో నాటికలు, కథలు ఏకాంకికలు.

అముద్రితం : కథలు, నాటికలు.

అభిమాన రచయితలు : ప్రతి ఉత్తమ రచయిత.

*

# నాగి

అప్పుడప్పుడే జీవితరేఖలను దిద్దుకుంటున్న రాంరెడ్డి పంజరము నుంచి బయటపడిన చిలుకవలె ఎండాకాలపు సెలవులలో పట్టణ వాతావరణమును వదలి గ్రామ జీవితములో అడుగుపెట్టినాడు. పట్టణవాసపు కార్మిక వాతావరణం కృత్రిమ సౌందర్యమునకు భిన్నముగ తనదొక ప్రత్యేక వ్యక్తిత్వమని చూపుటకు నిలుచుండిన తన గ్రామంలోని మామిడి గున్నలు, తాటితోపులు, చెరువులు, పశుసంపద యువక హృదయానికెంతో హాయినిస్తున్నాయి. గ్రామంలోవున్న ప్రకృతి సౌందర్యమంతా తన కొరకే అన్నట్టు, గ్రామీణ జనమంతా ఆసౌందర్యరక్తిమను తన స్వాగతానికొరకే దాచినట్టుగ భావించేవాడు రాం. వైశాఖ ఎండలకు శోషించిన తన సర్వాంగములకు హాయినిగొలిపే చెరువునీటిలో, ప్రతినిత్యం కొంతసేపు మునకలువేస్తేతప్ప రాములకు తృప్తిలేదు. మామూలుప్రకారంగ, రాం రోజు చెరువుగట్టుకు వెళ్ళి తన ధోవతి, గడియారం చెరువు గట్టుపై నుంచి తాను ఈతకు దిగుతాడు. అది సంధ్యాసమయం, అప్పుడప్పుడే గోపాలకులు తమ ధనసర్వస్వమైన పశుసంపదను ఇంటికి తరలించుకొని పోతున్నారు, దూడలు 'అంబా' అంటూ మాతృహృదయంలో ఒక్కసారి విద్యుత్ప్రసారాన్ని చేస్తున్నాయి. అప్పుడప్పుడే భర్తలను కన్నెత్తి చూడగలుగుతున్న కాపుకోడండ్రు లేగదూడలను తోలుదామన్న నెపంతో అప్పుడేవచ్చిన భర్తలపై ఒకసారి వాలుచూపులు ప్రసరించి సిగ్గరితనంతో చాలాసేపు నిలువలేక లోపలికివెళ్ళి కొంతలో అనుభవింపబోయే మధుర జీవితరంగానికి నాందినిచేస్తున్నారు. ఇంతలో ఈతను ముగించుకొని గట్టుపైకి వచ్చిన రాములకు తన ధోవతి కనబడలేదు. ఏమి తోచక నాల్గు

వైపులా చూసాడు. ఒక మూల తన తెల్లటి ధోవతి ధరించిన వ్యక్తి ఎవరో కనబడుతుంది. ఆ వైపు చకా, చకా నడచి, "ఆగు, ఎవరు నీవు ?" అని ప్రశ్నిస్తాడు. ఆమాటలువిన్న నాగి కిలా కిలా, నవ్వుతూ తిరిగిచూస్తుంది. ఆవిధంగ తిరిగిననాగిని "ఛీ దొంగముఖం. దొంగబుద్ధికి తోడు సిగ్గు మాలిన బ్రతుకు" అంటూ రామ్ చెంపదెబ్బ కొడుతాడు. ఆదెబ్బకు నాగి ఏడ్వలేదు సరికదా, కంటతడియైన పెట్టలేదు. తనకు ఏమిసంబంధము లేనట్టుగానే, తన మొలనున్న తెల్లటిధోవతి విప్పిపారవేసి, తిరిగి తన చిరిగిన గుడ్డపేలిక కట్టుకొని పోతుంది. ఆ దృశ్యంచూసిన రామ్ నిర్ఘాంత పోతాడు. "ఎవరా పిల్ల ? దెబ్బతినికూడ కంటనీరు పెట్టలేదు. క్షమాపణ కోరలేదు. భయపడి పారిపోలేదు. ఛీ, అదినన్ను నిలువునా అవమాన పరచింది. నా ఉనికి వ్యక్తిత్వం దానిముందు ఒక లెక్కలోకి రాలేదు" అని ఆలోచించుకుంటూ ఇంటిముఖం పడుతాడు.

నాగి అంటే చేతకలంబట్టి గ్రామపెత్తనం సరిదిద్దే కరణందగ్గరి నుండి కఱ్ఱచేతబట్టి గ్రామానికి గస్తీనిచ్చే కావలి మస్కూరువరకు అదొక విచిత్రమైనభయం. భయం అని సరిగ్గా నిర్వచింపలేక పోయినా అసహ్యం అని అనుకోవచ్చు. అయితే ఈనాగి అనేపదం ఆఊరి మొత్తానికే ఇంత అసహ్యం కలిగిస్తుందే ఆపదం ఏదైనా భయంకరమైన ఆకారహీనమైన Rhinoceros లాంటి జంతు సంబంధియా అంటె కాదు. మరి ఇది ఈ ఊరిలోనే ఒక మూలగ ఉండి సంఘపు ఒత్తిడికి తట్టుకోలేక ఉక్కిరి బిక్కిరై నలిగిపోతున్న గొల్లమల్లి చిన్నబిడ్డ నాగి. పాపం ఏ వన్నెచిన్నె లెరుగని అమాయిక కుటుంబం మల్లిది. మల్లి భర్తయిన సాయి గాని మరణం మల్లి కుటుంబాన్ని బజారులో పెట్టింది. "తలపై నీడపోగానే వడదెబ్బలకు కరువా" అన్నట్టు మల్లినెత్తినీడైన సాయిగాడు పోగానే మల్లి దిక్కులేని దైంది. పాపం మల్లికి కడుపుకు గంజి లేకపోయినా కడుపునిండా పుట్టెడు సంతానం. ఈ సంతానాన్ని సాదుటే ఒక భారమై

ఉండ మల్లి పెద్దబిడ్డ రామికి పదేళ్లొచ్చినా పెళ్ళి చేయలేదని ఈడొచ్చిన పిల్ల పెండ్లిలేక ఇంట్లో ఉంటే కులంతప్పని కులంపెద్ద తాకీదు పంపాడు- దిక్కులేనిమల్లి చేసేదేమిలేక తనకున్న నాలుగుజీవాలు (గొఱ్ఱెల) నమ్మి రామితలపై నాల్గక్షతలేసి తన భారం తీరినట్లు నిట్టూర్చింది. మల్లిగృహాన్ని సరిదిద్దుకొనడంలో తన మిగతపిల్లలకు సరియైన శిక్షణ ఇవ్వలేకపోయింది. కడుపుకు సరిగ్గా తిండిపెట్టలేకపోయింది. తల్లి నిర్లక్ష్యం నాగికి మగపిల్లల సహవాసం కూర్చింది. ఇది మల్లితప్పుకూడ కాదేమొ. ఎందుకంటారా మల్లికి ఒకవైపు పొట్టబోసుకోవటమే కష్టంగా ఉండె. ఇంకొకవైపు ఈడొచ్చిన రామి మల్లి గుండెలపై నల్లరాయివలె పెద్దభారమై యుండే పాపం మల్లి చేసేది రామి పెండ్లిప్రయత్నమా లేక నాగమ్మగారి క్రమ శిక్షణమా ?

ఈ విధమైన తల్లినిర్లక్ష్యం నాగిని బజారులవెంట పంపింది. ఆ పల్లెటూరి పిల్లలతోసహా తానుగూడ ఆంజనేయస్వామి గుడికి వెళ్ళడం, గుడిలో వష్ఠిమి వెంకయ్య ఆరగింపుచేసి పోపుచేతరువాయి నైవేద్యంగా పెట్టిన కొబ్బరిముక్కలు దక్షణగా పెట్టిన పైస దొంగిలించి కోమటి సీత రాముల దగ్గర బెల్లంగొని ఈకాస్త నైవేద్యపుముక్కలు బెల్లంతోకలిపి ఆరగించి, చింతచెట్టుకు వేళ్లాడి చింతపువ్వుతెంపి తినటం పని. ఈవిధంగ నాగి తోకలేని కోతిలా తయారయింది.

పాపం మల్లి కడుపుకోసం, తన పిల్లలవెంబడించుకుని పటేలు పట్వారి ఇండ్లల్లో వడ్లు దంచబోయేది. ఆకలికి అల్లల్లాడే మల్లిసంతానం, దంచేటప్పుడు అవి వడ్లుకావు సరికదా, అర్కలైనా సరే అర్థశేరు గింజలు రెండు దౌడలా పోసి పరా, పరా నమిలేది. వేరుశెనగకాయ యేరబోతే అర్ధమణుంకాయ అమాంతం నాగి మాయం జేసేది. నాగి దొంగని ఆ పల్లెలో ఎవ్వరు కూలీ ఇవ్వరు. లోకంలో నాగికై అన్ని తలుపులూ బంధింపబడ్డాయి. పాపం తల్లి కూలిదెస్తేగాని కడుపుకు గంజిపోయదు.

అయితే నాగికడుపు ఊరుకుంటుందా? ఆకలికి, అజ్ఞానానికి విచక్షణాజ్ఞానం ఎక్కడిదని? కాబట్టి ఏవిధంగానైన పొట్ట నింపుకోవాలి. సంఘబహిష్కారాన్ని పొందిన నాగి కడుపునింపుటకు సాధనమైన కూలి కొరకై ప్రయత్నం చేసేందుకుబదులు, సూటిగ తన ఆకలిని తీర్చి కడుపునింపే సాధనమైన దొంగతనం చేయసాగింది.

ఈ విధంగ ఆ పల్లెటూరి పెద్దాచిన్నా అంతా నాగిని పచ్చి పగటి దొంగలా తయారుచేసింది. దొంగతనంలో నాగిది అందెవేసిన చేయి. పగలైనాసరే దారిలో పాలూ, పెరుగు, అమ్ముకునేవారు ఎదురయ్యారంటే నాగి అమాంతం పెద్ద గద్దలావాలి పిరికెడుదుమ్ము అమ్ముకునేవారికండ్లలో కొట్టి ఆకాస్తపాలు, పెరుగు తాగేది. నాగి నీడనే అపవిత్రమైందని అదొక అశుభసూచకంగా చూసేవారు. కాని ఏది ఎట్లున్నా నాగిమాత్రం "మరునాగి" అని ఆ పల్లెంతా ప్రసిద్ధి.

రోజూ అలవాటుప్రకారంగానే ఆదినం సాయంకాలం, తాటిముంజల దొంగతనానికని తాటిచెట్టెక్కిన నాగమ్మగారికి, రెడ్డికొడుకుయొక్క తెల్లని ధోవతి, గడియారం చెఋవుగట్టుపై కనపడతాయి. కనబడుటే తరువాయి ఆ ధోవతి సింగారించుకుంటుంది. గడియారం ఏం చేయాలో తెలియక అక్కడే పారవేస్తుంది. ఇదీ అసలుసంగతి. ఆనాటి సంఘటన నాగిలో ఏమార్పుకాని, మానసికపరివర్తనగాని కలిగించలేదు. తిరిగి మామూలు ధోరణిలో ఈ రోజుఉదయమే పటేలుగారింటి తోటలోదూరింది. ప్రొద్దుటే ఏదో పుస్తకం చదువుకుంటున్న రామ్ ఆ శబ్దంవిని ఏదోగొడ్డు దూరవచ్చు అనుకున్నాడు. కాని కొంతసేపట్లోనే వారిగుమాస్తా "అమ్మా! నాకండ్లోనే కారంకొడుతావ్. ఈ రోజుతో ఊరిపీడ నీపీడ వదలిపోవాలి. చీల్చేస్తాను" అంటూ గొరా గొరా ఈడ్చుకొచ్చాడు.

మొదట్లో నాగిని చూడగానె, రాంకు ఎక్కడలేని అసహ్యం కోపం పుట్టింది. నాగిలాంటి జీవితానికి లోకంలో బ్రతకడాని కేవిధమైన హక్కు

కాని, అర్హతకాని లేవనుకున్నాడు. తాను సృష్టించుకున్న ఊహాస్వర్గంలో ఈ వ్యక్తి ఒక వికారస్వరూపంగా కనబడింది. తన స్వరాన్ని గుమాస్తా కంఠంతో మేళవిస్తు "ఏం రోగం నీకు. నిండా తిని ఈ దొంగతనం. పైగా ఆడపిల్లవి కదా! సిగ్గులేదు నీకు?" అన్నాడు. "ఆడపిల్లవి", "నిండాతిని" అనే రెండుపదాలు నాగి రెండుచెవులా గింగురుమన్నాయి. నాగికి ఇంత వరకు తాను ఆడపిల్లా, మగపిల్లా అనేజ్ఞానం ఏమిలేదు. నిండాతిన్నాను, నాకు కడుపునిండా తిండి ఎక్కడిది అని తిరిగి తనధోరణిలో తాను మునిగి ఒకక్షణంపాటు తన చంచలదృష్టిని రాం ముఖంపై కేంద్రీకరించి "ఆకలికి రెండు కాయలు కోసుకున్నాను. ఈసారికి నన్ను వదిలేయండి" అని అడిగింది. రాం కొంచెం ఆలోచించి "అయ్యో స్వర్గంగా భావించే పల్లెటూరిలో చాలాభాగం అజ్ఞానం, దారిద్ర్యం నాట్యం చేస్తుం"దనుకుని మళ్ళీ "ఏం కూలీచేస్తే?" దానికి నాగి "బాబూ, పొట్టలో పేగులు మాడుతూ ఉంటే కూలి ఎలాచేయను? గంజికిలేక ఏమన్నతింటే దొంగనాగని నన్ను చేలోకి రానివ్వరు, కూలీ లేనిది మా అవ్వ గంజిపోయదు, మరి నేనేడిస్తే బిచ్చమడుక్కోమంది. బిచ్చం అడుక్కుంటే నాకు పెట్టేదెవరు? అందుకని భీమడు నేను కలిసి ఈ పని నేర్చుకున్నాం" అంది. ఈ మాటలు విన్న రాంకు తానేదో గొప్పభారాన్ని వహించినట్టుగ, తానేదో గొప్ప ప్రాజెక్టుకు ప్లానుఇచ్చినట్టుగ ఆలోచించి చుట్టున్నవారు ఎంతవద్దని వారించినా వినకుండా "నాగీ, నీకు అన్నం గుడ్డలిస్తాం. మరి దొంగతనం మాని పనిచేస్తావ్ కదూ" అంటూ గ్రామ బందిపోటుగా పేరుపడ్డ మరునాగికి తన ఇంట్లో ఆశ్రయమిచ్చాడు.

నాగిని తన సంరక్షణలోకి తీసుకున్న మరుక్షణంనుండి దానిలో కలిగే మార్పును, పరిణామాన్ని బాగా గమనించేవాడు. తాను పిగ్మేలియన్ మొదలగు కథలు చదువుతూ నాగిని ఉత్తమ స్త్రీగా తీర్చిదిద్ది ఆ ఘనత తనకు దక్కించుకుందాం అనుకున్నాడు. తాను చదువుకున్న మానవతా

వాదాన్ని రుజువుచేసే దృష్టాంతపూర్వక నిదర్శనంగా నాగిని చూపుదాం. ఈ పనిలో తాను కృతార్థుడుకావచ్చు, కాకపోవచ్చు అని భావించేవాడు. అతని పవిత్రభావాల కనుగుణంగానే నాగి జీవితంలో క్రమపరిణామం గోచరించింది. నాగి ఏపనిలోనైనా అందెవేసినచేయి. ప్రొద్దుట నడుం కట్టి వడ్లు దంచిందంటే దాంతో సరితూగేవారే లేరు. ఇంతవరకు నాగి అసలు మనుష్యుల్లో లెక్కేకాదు. ఇప్పుడది కొంచెం చామనఛాయతో ఉంగరాలు తిరిగిన వెంట్రుకలు ముఖంపై వాలుతూవుంటే, కోసుగ కాటుక కళ్లు వసార రెండుదిక్కులు వ్యాపింప, చెవులకు పూసలపోగులు ఊగుతు వుండ మధ్యమధ్యన వడ్లుదంచిన అలసటవల్ల కలిగే చెమటను తుడ్చు కుంటూ ఉంటే ఆ వూరి విలాసపురుషుల దృష్టి పడుతూనేవుంది, నాగిలో మాత్రం, ఏభావంకాని శృంగారప్రకోపంకాని లేదు. దాని జీవితంలో పత్యణువులో కృతజ్ఞతారసం వెల్లిగా ప్రవహిస్తుంది. తన జీవితం రాములకు ఒత్తుకట్టు. గ్రామంలో మానవాకారాన్ని దాల్చి తిరుగుతూవున్న ఆంజనే యుడు, వెంకటేశ్వర్లు, రాంరెడ్డి. దానిలో కేవలం దొంగబుద్ధి మానటమే కాకుండ, పరిశుభ్రత, విచక్షణాజ్ఞానం కూడ ఏర్పడ్డాయి. అయా క్రియలకు ఆ పేరని పాపం దానికే తెలియదు. దానికి తెలిసిందల్లా ఒక్కటే. లోకంలో అంచరు దయ్యాలు. రాం దేవత. కాబట్టే ఊరిలో ఎవరైనా, ఎవరైనా ఏమిటి? పట్వారీగారే పూటకు రెండుశేర్ల గింజలిస్తాం, వడ్లు దంపకానికి రమ్మంటే "బాబూ దొంగనాగి వడ్లు అమాంతం బుక్కుతుంది కాని సీస్లు ఎలా దంచుతుంది? పోపో, నేను రాను, అంతగా కూడులేక చస్తే మా చిన్న బాబుగారి పాదాలదగ్గరే చస్తాను" అని జవాబు చెప్పేది. దానికి పళ్లు చేయటం, వడ్లు దంచటం, చల్లచేయడం మున్నగు పనులనుండి విరామం దొరికినప్పుడల్లా చిన్నబాబు గది శుభ్రంచేయడం పని. ఒకరోజు రాం కొన్ని పువ్వులను తనగదిలో గ్లాసులో అమర్చుతున్నాడు. అది చూసిన నాగి ప్రతిరోజు సూర్యోదయం కాకముందే అడవికి వెళ్ళి నానారకాల

అడవి పుష్పాలు అన్నీతెచ్చి ఆ గ్లాసులో అమర్చేది. అదిచూసిన రాం. ఎలక్షన్‌లో గెలిచిన ఎం. ఎల్. ఎ. వలె మురిసిపోయేవాడు. గర్వించే వాడు. రాంకే కాదు పెద్ద పటేలుగారికి కూడ నాగి ప్రేమపాత్రగా మారింది. యాభై సంవత్సరాల అనుభవం తన కంఠంలో ప్రేమనాదాన్ని పలికింప "అమ్మా నాగూ, అన్నం తిన్నావే" అంటూ పలుకరించేవాడు. ఆ మాట విన్న రాం తన జీవిత సర్వస్వం ధన్యత పొందినట్టు, తాను తన ఇంట్లో ఉన్న వ్యక్తుల హృదయాలను తరచి తరచి మానవత్వాన్ని పైకి తెచ్చి నట్టు భావించేవాడు.

అప్పుడప్పుడే చీకటి పడుతుంది. పటేలుగారింట్లో అంత కల్లం నుండి గింజలుతెచ్చి గరిసెలో పోసే సందడిలో ఉన్నారు. రాం ఇంటి ముందు కూర్చొని లెక్క వ్రాస్తున్నాడు. కరణంగారి మనిషి దొడ్డి వెనుక వైపు, దేనికో అటూ ఇటూ తిరుగుతున్నాడు. నాగి మామూలుప్రకారం ఆముదము ప్రమిదల్లో పోసి కచేరీగదిలోపెట్టి, దూడలను తల్లిఆవులదగ్గ రికి వదలి అప్పుడే ఇంటికి వచ్చిన జోడెద్దులకు దాణాపెట్టి, పాలదాయిలో పిడకలు వేస్తుంది. కాని ఏదో కొద్దికొద్దిగా గుసగుసలు వినపడ్డ నాగి చివా లున లేచి దొడ్డివెనుక సందులోకి పారచూసింది. వెయ్యి కళ్ళతో తన ప్రాణాన్ని తెగించి పటేలుగారిల్లు కాపలాచూస్తున్న నాగి ఆ దృశ్యంచూచి ఓర్చుకోలేక "ఆ గంపలు ఇక్కడినుండి కదిలినావంటే ఊర్కోను. రంగయ్యా ! నేను ఆకలికి అల్లాడి కడుపుకోసం బాబుగారి తోటలో రెండు కాయలు కోసుకుంటె 'నాగి రెండుకాయలేమిటి రెండు ఇళ్ళు మింగు తుందని' నాకు కూలీ పుట్టకండచేసి నానాబాధలు పెడితివే. ఇప్పుడు నీవు బాబుగారి అన్నంతిని, వారిగుమాస్తాగా పనిచేస్తూ వారి గింజలు కల్లంలో నుండి తప్పించి ఆ పాపిష్టి కరణంగారింటికి పంపజూస్తున్నావ్. నీవింకా పెద్ద మనిషివేన ?" అంటూ ఆవేశంకొద్దీ దొంగతనంగా గింజలు తప్పిం చిన గుమాస్తాతో మాట్లాడుతూ ఉంది. దీపం ముట్టించడానికి అగ్గిపెట్టె

కావలసి లోపలికివచ్చి ఈమాటలు విన్న రామ్ శరీరమంతా ఒక్కసారి విద్యుచ్ఛక్తి ప్రవహించింది. నాగి దేవతామూర్తిగా గోచరించింది. ఆనందం పట్టలేక చకాచకా నడిచి నాగీ అంటూ మొదటసారిగ నాగిని రెండుచేతులా స్పృశిస్తాడు. తన సర్వాంగాలు కంపింప నాగిని భయభక్తులు రామ్ కాళ్ళపై వాలుస్తాయి. 'పిచ్చిపిల్లా, లే' అంటూ లేపుతాడు.





85

# నౌకరి

❖

శ్రీ పైడిమఱ్ఱి వెంకటసుబ్బారావు

జననం : నళ సంవత్సర వైశాఖ శుద్ధ విదియ

చిరునామా : అక్కౌంటెంటు - డిస్ట్రిక్టు ట్రెజరీఆఫీసు, ఖమ్మంమెట్టు.

కార్యాకలాపాలు : —

అభిరుచి : సాహిత్యము, వైద్యము (హోమ్యో - ప్రకృతి), వేదాంతము.

రచనలు : ముద్రితం : గీతా మీమాంస, దైవభక్తి, మీమాంస త్రయము, కథానికలు, నాటికలు, ఆంధ్ర వారపత్రిక, భారతి, నవజీవన్, ఆనందవాణి, గోలకొండ, సుజాత పత్రికలలో ప్రకటితములు.

అముద్రితం : బ్రహ్మచర్యము, గృహస్థ జీవితము, స్త్రీ ధర్మము, పిరదోసి (నాటిక), తార (నాటకము), ప్రతికృతి (పద్యకావ్యము), దేవదత్తుడు (పద్యకావ్యము) ప్రాక్పశ్చిమ జల చికిత్స, తులసీదాసు, త్యాగరాజు.

అభిమాన రచయితలు : వాల్మీకి, కాళిదాసు, పోతన, తిక్కన, రవీంద్రనాథ టాగోర్.

26

# నౌకరి

నీవిచ్చిన దరఖాస్తు యేమయిందిరా ?

'బుట్టదాఖల్'

'పెట్టు మరో దరఖాస్తు ...చేతిలో లేదాక చిల్లి దమ్మిడీ. గుజరాన్ జరిగే జరియా నువ్వు నౌకరీ సంపాయిస్తేనేకాని కాదు, కొండ కెదిరి చూస్తున్నట్లు చూస్తున్నా....'

మా నాయనమాటలు వినేసరికి చురచురా మంటలెత్తినయి. అయితే మళ్ళీ నెమరుకు వచ్చింది. మొదట్నించి ఆయన సంపాయించుకున్న మంచి పేరు ఇమానంతోనే. ఆయన యిప్పుడూ, పనిచేతకాకున్నా, ధర్మాత్ముడైన ఆ దొరగారిదగ్గర మునుపటి తరహానే ఏదో నాల్గు పైసాలు సంపాయించి మమ్మల్నందర్నీ కూచోపెట్టి తినిపిస్తున్నాడు. అతికష్టంతో నన్ను చదివించాడు ఆయనే ఉప్పిడి ఉపవాసాలుచేస్తూ ఎట్లానో. బస్తీలో మజాగా సినిమాలూ చూసుకుంటూ, హోటళ్ళలో తింటూ, పాన్‌బీడా సిగిరేటు ఉడాయిస్తూ ఉండడం కాకుండా మధమధ్య లేచే పిల్లతహరీకుల సందట్లో, ప్రతి అయిందానికీ కానిదానికీ చేసే హర్‌తాల్‌తో చదువంతా నాశనమై రెండేండ్లు యింతెహాన్‌లో తప్పి ముప్పుతిప్పలమీద ఈ మార్చి నెల ఇంతెహాన్‌లో దర్జెసువ్వంలో కామ్యాబ్ అని పించుకున్నా. నా కామ్యాబ్ అనేమాట వినాలనీ, ఆ తరవాత ఏదైనా నౌకరీ చేస్తుంటే చూడాలనీ మా నాయన తడపాయిస్తూ ఉండేవాడు. ఏ రకంగానో ఓరకంగా మెట్రిక్ కామ్యాబ్ పని ముగిసింది. అబ్‌రహా-నౌకరీ మిగిలింది. మాటల రవానగిలో నౌకరీ అనేదా—దీన్నే తెలంగీలో ఉద్యోగం అంటారుగదూ ! మాటల్లో ఫరఖ్ యెంత ఉన్నా కావలసింది

సరిజా. అసలు రోజురోజుకు బధాఫధాయించిపోతున్న కరువు. దాంట్లో బేరోజ్‌గారీ. చాలా కష్టకరమైపోతున్న బేరోజ్‌గారీనిచూచి బేజార్ అయ్యి ఆఖరుకు మాలో పెద్దలు కొందరు సర్కార్ ములాజిమత్‌లో నాన్ ముల్కీలు ఉండడంవల్ల అని కొలంబస్ అమెరికాను కనిపెట్టినట్లు కని పెట్టారు. నేను హష్తుం చదివేరోజుల్లో ఒక తహరీక్....దీన్ని తెలంగీలో ఏమంటారోకాని తెలిసినవాళ్ళు మత్లబ్‌మీద దయచేసి తెలుసుకోవాలి. ఏమైతేనేం, ముల్కీలగురించి తీశాం. అంతా మేమే. ఎవరు గైర్ ముల్కీలు? అందే అక్కడక్కడ కనపడే స్నేహితులు చాలామంది నాన్‌ముల్కీలు - బి. యేలు, గిన్యేలు చదివి, ఖామఖా మాకువచ్చే ములాజి మత్‌లు అన్నీ గ్రద్దలు కోడిపిల్లలను తన్నుకపోయినట్లు యెత్తుక పోతు న్నారు. బిల్‌ఫయిల్ వాళ్ళను నిజంగా వెళ్ళగొడితే మా యస్టేట్‌లో కనబడే బేరోజ్‌గారీ అంతా పోతుంది. హల్‌చల్ చేసినాం. హత్తారే జబర్‌దస్తీనా కొట్టి వెళ్ళగొట్టాలనీ యిండ్లమీద పడ్డాం — 'బోరియా బిస్తర్ చంకబెట్టుకొని చలో మహారాజ్ రాజమండ్రీకి' — గో బ్యాక్.... గో బ్యాక్' అని గల్లంతు లేపాం, నా చేతులతోనే–పాపం ఆయనపేరేమో గుర్తులేదు ...చాలా రోజులు గుజరాయించటంవల్ల యాదిలేదు, పోనీలేండి, నెత్తిమీద కొట్టబోతే కన్ను చితికింది ఆయనకి. ఇంట్లో పిల్లలు గేబీ అని ఏడ్చారు. ఆయన భార్య, ఆయనా కాళ్ళవేళ్ళా పడ్డారు. ఆ నజ్జారా నా దృష్టిలో తాజాగా ఉంది.

'మేము మీసాటి తెలుగువాళ్ళం. ఎం. ఏ. దాకా చదివాను. లా గ్రాడ్యుయేటునుకూడా. ఏదో బ్రతుకు తెరువుకోసం వచ్చాం. మనం అంతా భాషలో, సంస్కృతిలో ఒకటి. చంపెయ్యండి ఈ నా భార్యను, నా పిల్లల్ని. నా ఆత్మకు శాంతి ఒక తెలుగు సోదరుడు చంపాడంటే. నేను మాత్రం హృదయపూర్వకంగా మీకు కృతజ్ఞుణ్ణి చంపారంటే....బ్రతుకు తెరువులేని బ్రతుకుకంటే చావే మేలు. నీవు వ్యక్తిగా పగబూని రాలేదు

గదా! నువ్వేం చేస్తావు? నీమీద నాకేం ద్వేషం లేదు....' అంటూ ఎంతో గొప్పగా చెప్పాడు.

ఆయన్ను, ఆయన పిల్లల్నీ, ఆయన కుటుంబాన్నీ ఢీల్ వదలకుండా బేమురవ్వత్‌గా దండా సాపు చేశాం. చదువుకునే బళ్ళల్లోఉన్న బల్లలు కుర్చీలు, రోడ్డుమీది లాంతర్లు పుర్జాపుర్జా అయ్యేట్లు పగుల గొట్టాం. ఇదంతా విద్యార్థిబలం. ఏమన్నా అంటే రెచ్చిపోతుందని కొందరు— ఈ గొడవలు జరిగితే తమకు లాభసాటీగా ఉంటుందని మాటల్తో ప్రోత్సహిస్తూ కొందరు - అందరు తమతమ తావుల్లో గమ్మునా కూర్చున్నారు. ఫైరింగ్‌లు జరిగితే, లాటీఛార్జీలు జరిగితే అనుభవించింది మేము.

మా కంటికి హుకూమత్ అన్నా, గైర్‌ముల్కీ మనిషి అన్నా శత్రువులుగా కనబడేవారు: అనుకునేసరికే వాటంతటవే నోట్లో పండ్లన్నీ యిసుకలాగా పరపరా కొరికేది. ఇదే తరహా నాదోస్తులంతా. మమ్ముల దూరంనుంచి చూచినారంటే సరి 'యమదూతలురా! వీళ్ళ కళ్ళల్లో పడ గూడ' దని పాపం గైర్ ముల్కీలు దూరం దూరంనుండే - 'సటక్ సీతారాం' అయ్యేవాళ్ళు. బహర్‌హాల్ అదీ ఒకరోజు మేమంతా ప్రభు ష లం - మా దెబ్బచెప్పితే కిందినుంచి పైదాకా హడలెత్తి పోయిందిలే అని గర్వంగా పోజుపెట్టి తిరిగేవాళ్ళం.

ఆ గర్మీ పోయింది. సాటి ఆంధ్రదేశంలో ఆంధ్ర జిల్లాలవాళ్ళే ముఖ్యంగా యింత బేరహిమీ హింసలకు తెగబడ్డారని మోగిపోయింది. మానాభిమానాలు రత్తీ బరాబరుగా మరచి పోయినాం.

ఇప్పుడు నౌకరీకి సర్కార్ దఫ్తర్‌లకు పోతే, బి. ఏ. కామ్యాబ్ అయినావా? అంటారు. జాయదాదులు లేవంటారు - లేదయ్యా! నేను ముల్కీ తహరీకులో ప్రముఖపాత్ర వహించి కొందరు నాన్ ముల్కీలను వెళ్ళగొట్టానని చెప్పబోయాను, పూర్వం కాంగ్రెసులో పనిచేసి, జెయిళ్ళలో పడ్డామంటే నౌకరీలు, భూములు యిచ్చినట్లు యిస్తారని. కాని అది భార

తీయచట్టంకు విరుద్ధమయిందట - బుద్ది బుద్ది! అఫ్‌సోస్! తెలిసిందికాదు మొదట - మాదేశం అంటే భారతదేశం- హిమాల్యానుండి రాస్‌కుమారీ వరకు ఉన్న హిందూదేశమట. అరే భాయీ! ముల్కీ సదాఖతునామా కవచాలు ధరించి చేరోజుగారీమీద హమ్లా చేద్దామనుకుంటే అదీ బేకార్ అయిపోయింది.

జరిగిన గాథ అంతా చాలాపెద్దది- ముక్తసిర్ యేమంటే యిప్పుడేం చేయాలా? అని. పోరపాటైంది. ఆ తహారీకు రోజుల్లోనే మాకోసం కొన్ని జాయదాదులు ముక్తస్ చేయించుకోవలసింది. అట్లా చేయించు కుంటే యిప్పుడు ఝుక్ మరాయించుకుంటూ నౌకరీలు యిచ్చేవాళ్లు- కాని యిప్పుడుపోయి మాకు ములాజిమత్‌లు యివ్వకుంటే మేమేం చెయ్యాలని అడిగితే. యేమన్నా చేసుకోండి- చేతిపనులు నేర్చుకోండి - కూలీచెయ్యండి- ఎంతమందికని నౌకరీలు యివ్వగలం? ప్రతి సంవత్సరం యిన్నివేలమంది చదివినవాళ్లు వస్తున్నారు. ఇన్ని వందలుమట్టుకే కాళీలు వెళ్తున్నాయి. కాళీలు మించి నౌకరీలు యెట్లా యిస్తాము? అంటూ యేవేవో బేజరూరత్ లెక్కలన్నీ చూపిస్తారు. కచేరీలల్లో దరఖాస్తు పెట్టి పెట్టి, తిరిగి తిరిగీ బేజార్ అయిపోయి, నా కాళ్ళ చెప్పులు అరిగిపోతున్నాయి. ప్రతిసిరస్తా జంగలాత్, తాలీమాత్, మాల్, జిరాయత్, అదాలత్, అరరే! ఒకటనీ ఒకటి కాదనా! తోబాతోబా! అన్ని సిరస్తాలల్లో 'జాయదాద్ నహీఁ' అనేమాటే- ఎంత కాళ్లుచేతులు కొట్టినా అదృష్టమెంతో అంతే!.... 'పఢే ఫార్సీ బేచే తేల్' అన్న సామెతగా ఉన్నది నా బ్రతుకు.

మళ్లీ మానాయనకు చెప్పి ఆయన మనస్సుకు తక్లీఫు యివ్వటం యెందుకు? మాట్లాడకుండా ఏ వర్క్‌షాప్‌లోనో ప్రవేశించి, మోటార్లు సైకిళ్ళు వగైరా రిపేరింగు పనులు నేర్చుకొని దుకాణం పెట్టుకోవడం మంచిదని సూటుకేసు తీసుకొని బొంబాయికి బయలుదేరా- అక్కడ "ముల్కీ తహారీకులో పనిచేశావా' అంటే 'నాకేం తెలియదు బాబూ- అల్లా

ఖసం- ఆ దేవునితోడు.... నేనూ మీతోపాటు ఒక భారతీయుణ్ణే అని ప్లేటు బదలాయించి సమాధానం చెప్పుతా' అనుకుంటూ, నేను చేసిన పాపం తహరీకు బే మత్లబ్ అయిపోయిందని అఫ్సోస్ చేస్తూ.

గర్ర్ గుర్ర్ అంటు నా చెవులకు కఠోరంగా వినబడుతున్నది. ఇది వర్క్-షాప్‌లో మిషన్‌ల చప్పుడు అయ్యి ఉండొచ్చుననుకున్నా. కండ్లు నులుముకొని చూచా- బాగా కండ్లువిప్పి, నిద్రమబ్బు విడిచి, తెలివి తెచ్చుకొని చూచా. ఎట్లాచూచినా అంతే- రెండు పిల్లులు ఒకదానిమీద యింకోటి పడి కరుచుకుంటున్నాయి.





# పునర్జన్మ

❖

శ్రీ పన్యాల రంగనాథరావు

జననం : 1–6–1919

చిరునామా : సబ్ ఎడిటర్ : తెలుగు యూనిట్; న్యూస్ సర్వీసెస్ డివిజన్; ఆలిండియా రేడియో; పార్లమెంట్ స్ట్రీట్; న్యూఢిల్లీ.

కార్యకలాపాలు : భుక్తికి : ఆంధ్రలోకానికి తెలుగులో రేడియో వార్తలు చెప్పడం!

రక్తికి : సంగీతం విని ఆనందించడం....

ముక్తికి : తెలుగు సాహిత్యంలో రచనలు సాగించడం!

అభిరుచి : ఇంగ్లీషులో, దేశభాషలలో, తెలుగులో గల సాహిత్యంలో, ఇతర లలిత కళలలో.

రచనలు : ముద్రితం : (1) 'నీకోసం' 'అనూరాధ' (నవలికలు) (2) 'ఆద్యంతం' 'పన్యాల కథలు' (వివిధ కథల సంపుటాలు) (3) 'ప్రేమలత' 'అశ్రుగీతి' (ఖండకావ్యాలు)

అముద్రితం : (1) కొన్నికథల సంపుటాలు. (2) ఏకాంక నాటికలు (3) ఒక పూర్తినాటకం (4) ఒక పెద్ద నవల.

అభిమాన రచయితలు : అందరూ!

92

# పునర్జన్మ

అల్లంతదూరాన నా కళ్ళముం దొకచిత్రం జరిగింది....

నిత్యసత్యవ్రతుడూ, ధర్మనిష్ఠాపరుడూ అయిన హరిశ్చంద్రుడు ఇహలోకయాత్ర చాలించి, తన సత్యసంధతవల్లా, ధర్మచింతవల్లా మోయలేనంత పుణ్యం మూటకట్టుకొని 'భార్యాసమేతంగా స్వర్గలోకానికి పోయి, తన పుణ్యఫలాన్ని అనుభవించసాగాడు. ఇహలోకంలో రాజాధి రాజై వుండి పరిపాలనాబాధ్యతలు ఎక్కువగా నిర్వహించి ఉండటంవల్ల, బాగా అలసి వున్నాడేమో, ఆ స్వర్గలోకంలో, నిద్రకు ముఖంవాచినవాడల్లే హరిశ్చంద్రుడు, వొళ్ళూపై తెలీక నిద్రపోవటం ప్రారంభించాడు.

కాని, ఎన్నాళ్లని ఇట్లా ఏక నిద్ర పడుతుందిగనకా ? తను నిద్ర నిద్ర లేచేసరికి, చంద్రమతీ, లోహితాస్యుడూ లోకాభిరామాయణంలో మునిగి వున్నారు. తను భార్యాసమేతంగా వచ్చినప్పుడు ఈ ఏకైకపుత్రుడు తమ వెంట రాలేదు. అప్పటి కతగాడు, తను విడిచిపెట్టిన సింహాసన మెక్కి కూర్చున్నాడు - ఇహలోకంలో. ఇది చప్పున జ్ఞాపకమొచ్చి,

"నాయనా! నువుకూడా వొచ్చావూ ?" అంటూ పలకరించాడు హరిశ్చంద్రుడు.

"వొచ్చాను నాన్నా ! మీరులేని ఆలోకంలో నాకు అట్టే ఉండబుద్ధి వేయలేదు. వచ్చి ఎంతోసేపు కాలేదులెండి. మీరు నిద్రపోతూవుంటే లేపడమెందుకని, అమ్మతో మాట్లాడుతున్నాను" అన్నాడు లోహితాస్యుడు.

"ఏమండీ ? అబ్బాయి ఈలోకం చూడాలంటున్నాడు. మనంకూడా ఇంకా తిరగనేలేదు. ఓసారి తిరిగొద్దామా ?" అన్నది చంద్రమతి భర్తను సమీపించి.

"పదండి. ఇక్కడ చేసేదేముంది? అయినా, నేనింత నిద్ర పోయినానేం చెప్మా!" అంటూనే హరిశ్చంద్రుడు లేచాడు.

ముగ్గురూ ఎంతకాలం స్వర్గలోకమంతా చుట్టపెట్టారో వారికే తెలీదు. చూడవలసిన వింతలన్నీ చూశారు. అయితే ఈ సైట్‌సీయింగు హరిశ్చంద్రుడికి త్వరలోనే ముఖం మొత్తింది. స్వర్గంలో ఎక్కడ చూసినా వైభవోపేతంగానే వున్నది. ఎటుచూసినా అందమే కనిపిస్తున్నది. వెనక, తన రాజ్యంలో తను సత్యవ్రతాన్ని ఆచరిస్తూవుండినా, కావలసినంత అబద్ధం ఇతరత్రా వుంటూనే వుంచేది. ఆ అబద్ధంలో తన ఏకైక సత్య వ్రతమే ఎంతేనా రాణించిందికూడానూ! ఇక్కడ ఎవరూ అబద్ధమాడి నట్టే యెరగడు. పైగా ఈ స్వర్గంలో ఉన్నవారు నిజమే చెప్పుతున్నారో, అబద్ధమే చెపుతారో, హరిశ్చంద్రుడికి ఓ పట్టాన తేలడంకూడాలేదు. సత్యానికీ, అసత్యానికీ భూలోకంలో వుండిన తేడాలో ఆవగింజంతయినా ఇక్కడ కనిపించటంలేదు. ప్రతీవ్యక్తీ ఇక్కడ సత్యసంధుడుగా ఉన్నట్టే కనిపించసాగాడు. తప్పిదారి యెవరన్నా అబద్ధం చెప్పారనుకోవలసివస్తే, అది చూస్తూవుండగానే నిజమై ఊరుకొంటున్నది.

ఒకసారి తిరగ్గా తిరగ్గా ముగ్గురికీ విపరీతమైన దాహం వేసినట్టయింది. ఆ దారివెంట యెవరో కనిపిస్తే,

"దాహం వేస్తున్నది. ఎక్కడన్నా గుక్కెడు మంచినీళ్లు దొరుకుతయ్యా?" అన్నాడు హరిశ్చంద్రుడు.

ఆ వ్యక్తి ఆశ్చర్యపడుతూ.

"అదేమిటి? మీ పక్కనే అంత చెరువు పెట్టుకొని——" అనబోయినాడు.

హరిశ్చంద్రుడు తిరిగిచూసేసరికి అక్కడ నిజంగానే పెద్దకొలను ప్రత్యక్షం! తనకు బాగానే జ్ఞాపకముంది. క్షణం కిందట అక్కడేదీలేదు! ముగ్గురూ ఆశ్చర్యపడ్డారు.

ఇదేదో ఇంద్రజాలం అనికూడా అతనికి ఆక్షణంలో లీలగా తోచక పోలేదు. స్వర్గలోకం ఇంతేకాబో లనుకున్నాడు. అనుకొన్నదల్లా అయి పోతూ వుండటం, సత్యం రాణించటానికి అసత్యమంటూ లేకపోవటం సత్యహరిశ్చంద్రుడికి అంతగా రుచించలేదు.

భూలోకంలో తన సత్యసంధత నిరూపించుకోవడానికి తను కోర కుండానే విశ్వామిత్రుడనే గడ్డపాడు తటస్థపడ్డాడు నక్షత్రకుడితో సహా! తన సత్యసంధత గురించి ఇక్కడ యెవరికీ పట్టినట్టే లేదు. ఇది హరి శ్చంద్రుడికి కొద్దిగా అవమాన కారణంగానే వుందని చెప్పాలి. ఇట్లా ఆలోచిస్తూన్నకొద్దీ, తన సత్యశీలం మళ్లీ పరీక్షకు వస్తేనేతప్ప మన శ్శాంతి వుండదనిపించింది. తను లోలోన పడుతున్న మథనమాత్రం చంద్రమతికిగానీ, లోహితుడికి గానీ చెప్పదలచ లేదు.

అయితే, తన సత్యశీలానికి కావలసిన పరీక్ష ఈ స్వర్గలోకంలో యెక్కడా లభించే సూచన లేదు. విశ్వామిత్రుడల్లే మరోగడ్డపాడు యెవ డన్నా యెదురు సన్నాహం రాకూడదా? వచ్చినా, ఇప్పుడు తనకు రాజ్య మంటూ లేదు కోరితే యివ్వటానికి. మళ్లా మరోసారి భార్యనీ కొడుకునీ దానం చేయవచ్చును!

హఠాత్తుగా హరిశ్చంద్రుడికి ఒక గొప్ప ఆలోచన తట్టింది. హరి శ్చంద్రుడంతవాడికే తట్టవలసిన ఆలోచన అది!

మనం మళ్లీ భూలోకంలో యెందుకు అవతరించరాదు?

ఏకాకిగా కాదు! కుటుంబసమేతంగానే! వాళ్లు లేకుంటే తన సత్యవ్రతాచరణలో సగం మజా లేదు మరి! తీరా వాళ్లు మేము రామంటే చేసేదేమిటి? ఒక్కడే అవతరించాలి భూలోకంలో. ఒచ్చారే అనుకుందాం! మళ్లీ తను రాజ్యం ఓడిపోవడం, గడ్డపాడికిచ్చిన మాట నిలబెట్టు కోడానికి, పెళ్లాన్నీ పిల్లవాడినీ అమ్ముకోవలసి రావడం- ఇవన్నీ జరిగితే, వీళ్లు కాస్తా మమ్మల్ని అమ్మేయటానికి నువ్వెవడవంటే?

అయినా చంద్రమతి పతివ్రత ! కదిపిచూస్తే పోయిందేముందీ ?

చంద్రమతితో కదిపికూడా చూశాడు హరిశ్చంద్రుడు.

"ఇదిగో ! చంద్రం ! ఏమంటావు ? నీకు మొహం మొత్తలేదూ ? నాకేమో బుట్టెడు జిలేబీలతో ముఖం మొత్తినట్టుంది సుమా ఇక్కడ. చెప్పవేం ? ఓసారి మన రాజ్యానికి వెళివద్దామా ?" అన్నాడు.

చంద్రమతికి మొదట్లో, భర్త చెప్తున్న దేమిటో పిసరైనా అర్థం కాలేదు.

"ఏ రాజ్యం ?" అన్నదా యిల్లాలు.

లోహితాస్యుడు తండ్రిని ఎగాదిగా చూడటం ప్రారంభించాడు.

"అలా తెల్లబోతారేమిట్రా ! మనకు రాజ్యంలేదంటారా ఏమిటి, కొంపతీసి! మనరాజ్యం భూలోకంలో ఉండనేవుంది. ఎన్నో ఏళ్ళయినట్టుంది అందర్నీ చూసి. ఏమంటారు ?" అన్నాడు హరిశ్చంద్రుడు మొదట్లో కొద్దిగా నిరుత్సాహపడి.

చంద్రమతి పాతివ్రత్యంలో అతనికి ఎటువంటి సందేహమూలేదు

"పదండి. మీతోపాటే నేనూనూ !" అన్నదామె ఎటువంటి అభ్యంతరమూ చెప్పకుండా.

"నేనూ వస్తాను నాన్నా ! కాని ఎట్లావెడతాం ?" అన్నాడు లోహితుడు.

అవును. ఎట్లా వెడతాం ? ఈ మాత్రం తనకెందుకు తట్టలేదో ! తీరా వెడతామని చెప్పి ఇప్పుడు జారుకుంటే వ్రతభంగం కూడానూ ! అయినా, భగవంతుడంటూ ఒకడున్నాడు మన పాలిటికి.... వాడే తలుచుకుంటేనా........

"నేను తపస్సు ప్రారంభిస్తాను. ఎన్నాళ్ళో పట్టదులెండి, భగవంతుణ్ణి ప్రార్థించి వరం సంపాదిస్తాను" అన్నాడు హరిశ్చంద్రుడు.

అతనా మాటలు అంటూండగానే ఎదురుగా భగవంతుడు, కళ్లు జిగ్గుమన్నట్టు ప్రత్యక్షమవనే అయినాడు.

"ఇదేమిటి ? నేనింకా తపస్సంటూ మొదలెట్టకుండానే ఇట్లా ఊడి పడ్డాడు ? భగవద్దర్శనం ఇంత చవకా ఇక్కడ ?" అని ఓతన్న ఆశ్చర్య పోతూనే, హరిశ్చంద్రుడు తనకు కంఠతా వచ్చిన సహస్రనామ సంకీర్తన లంకించుకున్నాడు.

చంద్రమతీ, లోహితాస్యుడూ నోరు తెరుచుకు నిలబడ్డారు ఈ వింత చూస్తూ.

ఎక్కడో నూతిలోంచి వస్తున్నట్టు మాటలు వినిపించసాగినై.

"ఈ మాత్రానికి నాకు సంకీర్తనా తపస్సూ దేనికోయ్ ! స్వర్గలోక వాసం చేస్తున్నవాళ్ళు తలుచుకుంటేనే చాల్ను నేను ప్రత్యక్షమవుతాను. నీ కోరికేమిటో తెలిసిందిలే" అన్నాడు శంఖ చక్ర గదాపాణి.

"దేవా ! ఈ నీ భక్తపరమాణువుని మన్నించ వేడుకొనుచున్నాడను" అన్నాడు హరిశ్చంద్రుడు చేతులుజోడించి.

ఆ హడావిడిలో పాపం, అతని నోటంట గ్రాంథికం కూడా వచ్చేసింది.

"రోజుకి లక్షమందిని మన్నించేవాడిని నిన్నూ మన్నించలేనూ ? పిచ్చివాడా !" అన్నాడు భగవంతుడు.

ధగధగ మెరిసిపోతున్న భగవంతుడు నోరువిప్పి మాట్లాడటం లేదు. అతని మాటలు తనకొక్కడికే వినబడుతున్నై.

"ఆయన మాట్లాడకుండ మీరేమిటి చెప్పుకుపోతున్నారు ?" అన్నాడు లోహితుడు ఆశ్చర్యపోతూ.

"వారి దివ్యదర్శనమాత్రానికి సంతోషించకుండా మాటలు వినపడ వంటా వేమిటి ? నాకుతప్ప మీకు వినపడవులే. నువ్వూరుకో. మేమేదో రాచకార్యం మాట్లాడుకుంటాం—" అంటూ కొడుకుని ఊరుకోపెట్టి,

"మరి నాకోరికమాట?" అంటూ, యెందుకేనా మంచిదని, హరిశ్చంద్రుడు భగవంతుడికి జ్ఞాపకంచేశాడు.

భగవంతుడు చిరునవ్వు నవ్వాడు. హరిశ్చంద్రుడికి సూటిలోంచి మాటలు వినిపించసాగినై.

"వత్సా! నే చెపుతా విను. నేనిక్కడ ఎవరికోరికలూ మన్నించక పోవడమంటూ ఇంతవరకూ జరగలేదు. అయితే నీవంటి అసందర్భపు కోరిక ఇంతవరకూ ఎవరూ కోరివుండలేదు. భూలోకంలో అష్టకష్టాలూ పడి, ఏదో ఇంత పుణ్యం ఉండిపోవడంవల్ల ఇక్కడికి చేరుకునేవాళ్ళెవరూ, మళ్ళా ఆ లోకంలో అడుగుపెడతామని కోరరు. నరకం చూడాలని ఇప్పుడే కొందరడిగారు. వాళ్ళని నరకానికి పంపించివస్తున్నాను. పోతే, ఈనాటికి మళ్ళీ భూలోకం చూస్తానంటూ నువు కనిపించావు. నీ మనసులో నువుపడుతున్న బాధకూడా నాకు తెలుసులే మరి! అందుకని నీకోరిక మన్నించకుండా వుండలేనాను. అయితే ఒక సలహామటుకు ఇస్తున్నా. నువు భూలోకం విడిచిపెట్టి చాలా యేళ్ళయింది. ఇటీవల అది ఎన్నిచుట్లు తిరిగి యెన్ని పరిణామాలు చెందిందీ, ప్రస్తుతం ఎట్లావుందీ నువ్వెరగవు. నీకాలంలో ధర్మం నాలుగుకాళ్ళమీద నడవడం నే నెరుగుదును. కాని ఇప్పుడు ధర్మానికి జెర్రిపోతల్లే అనేకకాళ్ళు బయలుదేరినై! అది ఏ దిక్కుపోతున్నదీ నేనే కనుక్కోలేకుండా ఉన్నాను. ఇక, నీ సత్యసంధత అంటావా? సత్యపరిపాలనకోసం అంతా తలలు బద్దలుకొట్టుకు చస్తున్నారు. ఆచరించే ముండాకొడుకు ఒక్కడూలేడు. ఇంతకీ, ఇప్పుడు నువు భూలోకం వెళ్ళావంటే నీ సత్యవ్రతం ఎందుకూ కొరగాదనే నీకు చెప్పాలనుకుంటున్నాను. అంతేకాదు. నీ సత్యసంధత మెచ్చుకొనేవాడూ ఉండడు. నవ్వులపాలవుతావు. ఈనాటి అల్లకల్లోలం చూసి సత్యమూ ధర్మమూ యేనాడో తోకతెంచుకు పారిపోయినై. ఇక ఇవేళ నువు పోయిచూస్తే నాస్తికప్రభావం చాలా జాస్తిగ కనిపిస్తుంది. నీలాంటివాడికి వాంతి అవు

తుందికూడానూ. వాళ్ళకు నా ప్రసక్తిలేదు. అబద్ధాలాడేవాళ్ళనీ అధర్మ ప్రవర్తకులనీ పీపులు బద్దలుకొడుతున్నార్లే. నేనుమాత్రం చేస్తున్న గొప్పేమిటి అంతకన్నా! సత్యతత్పరతకు వాళ్ళు దాస్యంచేయరు. దానిచేత వాళ్ళే దాస్యం చేయించుకుంటున్నారు. అందుకే వాళ్ళు నా ప్రసక్తి చేయకున్నా నాకు చింతలేదు. ఇటువంటిస్థితిలో నువు ఒక్కరోజు కూడా అక్కడ ఉండలేవు. ఎందుకు చెప్పు లేనిపోని కోరికలూ? పుణ్యమా పురుషార్థమా?" అంటూ ఆ లీలామానుష చక్రవర్తి పెద్ద ఉపన్యాసం దంచాడు.

ఈ ఉపన్యాసంలో, భగవంతుడు తన్ను కొంత చులకనచేయటమూ దెప్పి పొడవటమూ గమనించాడు హరిశ్చంద్రుడు. ఇది తను సహించలేడు. సత్యసంధతకు దాస్యం చేయడం, దానిచేత దాస్యం చేయించుకోవడం — మొదటిది గుర్తించడమూ, రెండోది ఆచరణలో పెట్టడమూనూ. ఈమాత్రం భగవంతుడంతవానికి తట్టనేలేదా?

హరిశ్చంద్రుడికి వెంటనే సమాధానం వచ్చింది. కొంత సిగ్గుపడ్డాడు కూడాను. తప్పదియ్యా! ఏదన్నా మనసులో తలచుకోవడంకూడా ముప్పుగానే వుంది ఈలోకంలో!

"గుర్తించానయ్యాయ్! నువు సత్యవ్రతాన్ని ఆచరణలో పెట్టినవాడివేనూ! స్వార్థంతో కూడుకున్న సత్యవ్రతం ఎన్నడూ సత్యవ్రతం కాదు. స్వార్థరహితుడైనవాడు అబద్ధమాడినా దానికి విలవుంది. వెయ్యిమంది ప్రాణాలు రక్షించా లనుకొనే వాడిలో స్వార్థ మేముంటుంది? వాడిలో పరార్థచింతే ఎక్కువగా వుంది. అందుకు వాడు అబద్ధమాడవలసివచ్చినా, జంకులేకుండా ఆడేసి, ఆ వెయ్యిమంది ప్రాణాలూ రక్షించగలగాలి. అప్పుడే వాడిలో నిజాయితీ బయటపడుతుంది. నువు ఆచరిస్తున్న సత్యవ్రతం నీతోపాటు అనేకమందిని కష్టాలపాలు చేసింది మరి!"

భగవంతుడి వాదన హరిశ్చంద్రుడికి కోపకారణమయింది. కాని, ఆ కోపం దాగా దిగమింగేశాడు. భగవంతుడికి తాత్కాలికంగా మతి

చలించివుండాలి అనుకున్నాడు. ఈ మతిచలనానికూ్కడా ఈనాటి భూలోక పరిస్థితులే కారణమై ఉండాలని తట్టడంతో అతని కోరిక మరింత బల పడింది. "తెలుసుకున్నాన్లే వత్సా! నామతేం చలించలేదు. సరే. అంతగా నువు వాచిపోతూవుంటే నిన్నడ్డి ఏంలాభం? వెళ్ళిరా!" అన్నాడు భగ వంతుడు నవ్వుతూ.

"మరి నాభార్యా, కొడుకూ?"

"ఇంతలో పోయిందేముందీ? అంతా వెళ్ళిరండి. ఆ ముచ్చటేదో చూసేపొద్దురుగాని. అయితే, నీ సత్యవ్రతానికీ, నీభార్య పాతివ్రత్యానికీ భంగం గలిగితే మాత్రం నన్ను నిందించి లాభంలేదు. నీరాత ఎట్లావుందో అట్లా అవుతుంది. నన్నింకా ఎవరో పిలుస్తున్నారు, వెళ్ళొస్తాను."

అంటూనే భగవంతుడు అంతర్ధాన మైనాడు.

హరిశ్చంద్రుడు గట్టి సమాధానం ఇవ్వాలనుకొంటుండగానే అంతా అయిపోయింది. చూస్తూవుండగానే తనూ, చంద్రమతీ, లోహితాస్యుడూ, గాలిలో హరించుక పోయినారు. ముగ్గురూ కలిసి ఎక్కడికి పోతున్నదీ ఏమవుతున్నదీ హరిశ్చంద్రుడికి అంతుపట్టలేదు....

అసలు నాకే అంతుపట్టలేదు!!

ఈ గందరగోళంలో, నేనుకూడా హరించుకు పోతున్నాననే అను మానమూ భయమూవేసి, పరుగు లంకించుకున్నాను. ఏదో అడ్డొచ్చి పెద్ద పాటుపడ్డాను.

ఆ దెబ్బతో నారోగం కుదిరిందనుకోండి!

* * *

ఎందుకు చెప్పొచ్చానంటే, ఒకసారి నాకు పిచ్చి పిచ్చి ఆలోచనలు అనేకం బయల్దేరినై!

అటునుంచి వెతుక్కురావడంకన్నా ఇటునుంచే వెతుక్కుపోతే ఇందులోనూ ఒక సొగసుంది.

ఓం ప్రథమంగా స్వర్గమంటూ ఉందా? అనే ఆలోచన వచ్చింది. దాని వెనకనే అనేక ప్రశ్నలు బయల్దేరినై. ఉంటే ఎక్కడుంది? ఎట్లా ఉంటుంది?

కేవలం అది పుణ్యాత్ములన్నవారికోసమే రిజర్వుకాబడ్డదా?

ఇహలోకయాత్ర చాలించిన పుణ్యాత్ముడు సరాసరి ఒకే అంగలో స్వర్గం చేరుకోడానికి ఫ్రీ టికట్టు దొరుకుతుందా?

భగవంతుడనేవాడొక డున్నాడా? ఉంటే వాడి కర్తవ్య మేమిటి?

మనం ఎట్లాగూ పాపిష్టివాళ్ళమే అనుకుందాం. కానీ స్వర్గానికి పోయేవారికేనా తలుచుకుంటే అగుపిస్తాడా?

స్వర్గలోకంలో ఆకలిదప్పుల ప్రసక్తే లేదా?

ఎవడికేనా అక్కడ నిద్ర అంటూ పడుతుందా, లేక ఎల్లకాలం దిక్కులు చూస్తూనే కూర్చుంటాడా?

ధర్మారావువంటివాళ్లు పుణ్యాత్ములా, పాపాత్ములా?

పూర్వజన్మ, పునర్జన్మ అంటూ వున్నాయా?

ఉంటే, ఈ ధర్మారావు పూర్వజన్మలో ఎవడై ఉంటాడు?

అస లింతకీ, నేనెవణ్ణి?

ఇవన్నీ పచ్చి అబద్ధాలేనా?

ఇటువంటి పిచ్చిపిచ్చి ఆలోచనలతో నిద్రపోయినపాపాన, నాకీ పీడకలొచ్చింది. చిత్రమైనదే కాదు. ఇంత అసందర్భపు కల మరోటి ఉండదుకూడానూ! స్వర్గంలో ఉండవలసినవీ, ఉండకూడనివీ అన్నీ కలిపి కలగా పులగమైనై నా పాడుకలలో. కేవలం పీడకలగనక సరిపోయింది.

ఇంకో చిత్రమేమిటంటే, ఆ కలలో 'నేను' గాణ్ణి, అల్లంతదూరాన నిలబడి జరుగుతున్న తంతంతా చూస్తున్నానన్నమాట! అట్లా నిలబడి చూస్తున్న 'నేను' గాణ్ణికూడా—అంటే నన్ను నేనే—చూసుకొంటున్నాను.

మనలో మనమాట. పనిలో పనిగా నాకూడా భగవంతుడు కలలో దర్శనం ఇప్పించినందుకు నన్ను నేను కాసింత పుణ్యాత్ముడిగానే లెక్కవేసుకుంటున్నాను :

మనస్తత్వశాస్త్రప్రకారం కలలకు బోలెడన్ని కారణాలు చెపుతారు. ఈ కారణాలన్నీ శాస్త్రంలో ఉండవలసిందేతప్ప. వీటివల్ల ప్రయోజనం అట్టే లేదని నాకు తెలుసు. అయితే చిత్రవిచిత్రంగా మనం ఊహించే ఊహలకు, నిద్రలో ఇటువంటి రూపాలు రావటం మరీ చిత్రం. కొన్ని వివరాలు అసలు జ్ఞాపకముండవు! అయితే, మన కలలకీ యథార్థజీవితానికీ ఏ విధమైన సంబంధమూ లేదని రుజువైన పక్షంలోమాత్రం కలల గురించి పరిశోధనలుచేసే మనస్తత్వ శాస్త్రజ్ఞులంతా పిచ్చాసుపత్రిలో ఉండవలసిన సరుకని అనుకోవలసివస్తుంది.

క్షమించండి. నేను చెప్పొచ్చేదేమిటో ఇంకా అట్లానే ఉండిపోయింది. ధర్మారావనేవాడు ఎవడైతేనేం? నేను చెప్పబోతున్న కథలో వాణ్ణి ఒక పాత్రగా స్వీకరిద్దాం - నా కలకి వాడే కారణమై ఉండాలి గనక.

ధర్మారావంటె నాకు మళ్ళీ వెనకటి సత్యహరిశ్చంద్రుడే జ్ఞాపకమొస్తాడు. సత్యవాక్పరిపాలనలో ధర్మారావు హరిశ్చంద్రుడి కేమాత్రమూ తీసిపోడు. ఇందుకు తగినట్టు, వాడి భార్యకూడా మూడుమూర్తులా మళ్ళా ఆ చంద్రమతే - పేరుతో సహాసూ! పోతే హరిశ్చంద్రుడు మహారాజు. అబద్ధం ఆడనిపాపాన రాజ్యం తాత్కాలికంగా పోగొట్టుకొని భార్యనీ కొడుకునీ అమ్ముకున్నా, తన సత్యసంధతవల్ల ప్రపంచాన్నే హడలు గొట్టించేసి, విశ్వామిత్రుడంతటివాడినికూడా గడగడలాడించేసి, పోయినవన్నీ మళ్ళీ సంపాదించుకో గలిగాడు. ఇక, ధర్మారావు గర్భదరిద్రుడు. ఇవేళ వాడి సిద్ధాంతం ఎవరిక్కావాలి? వాడికన్న ప్రపంచం మరో ఆకు ఎక్కువ చదవడంవల్ల వాడి సిద్ధాంతానికి హడలిపోయి దాసోహమవదు. విశ్వామిత్రుడంతటివాళ్లు ఈనాడు ఉన్నారు. ఈ ఇరవయ్యోశతాబ్దపు విశ్వా

మిత్రులకి గడ్డాలుండవు. అబద్ధాలకే పరీక్షలు పెడ్తారు. నిజంచెప్పి ఎరగని ధీరుడికే పట్టం కడతారు. నాకు కనపడ్డ తేడా ఇదొక్కటే.

అబద్ధమే ఆడాలని నేను ప్రచారం చేయటం లేదు. కాని, అబద్ధాన్ని అంతచులకనగా కొట్టిపారవెయ్యలేమనే అన్నాను ధర్మారావుతో. ఈ విష యంలో, వాడూ నేనూ వాదించుకున్నాం కూడానూ.

"అబద్ధం చెప్పకూడదన్నది చాలా గొప్ప నీతేనూ. కానీ, వెధ వది - అది ఒక్క హరిశ్చంద్రుడికే చెల్లింది. ఆ మహారాజు ఏమాత్రమో మానవాతీతుడు కూడాను. నువ్వూ నేనూ ఏపాటి ? కేవలం పదహారణాల మానవమాత్రులం. తెల్లారిలేస్తే వందబద్ధాలతో బతకాలి. పోనీ - కేవలం సత్యాన్నే పట్టుకువేళ్ళాడదామా అంటే, నువ్వూ నేనూ, ఇద్దరం గర్భదరిద్రు లమే. రేప్రొద్దున్న కూరసంగతేమిటి ? రేషనుకు డబ్బెక్కడ ముష్టెత్తాలి? పెళ్ళానికి కడుపో కాలో నొస్తే మందెలాగా ? ఇంటివాడికి రెండునెలలై బకాయిపడ్డ అద్దెమాటేమిటి ?" అన్నాను ఒకసారి.

ధర్మారావుకి నావాదన నచ్చలేదు.

"అయితే, ఈమాత్రానికి అబద్ధమాడి కక్కుర్తిపడాలనా నీ తాత్పర్యం ? నేను హరిశ్చంద్రుణ్ణి ఉదాహరణగా పెట్టుకోమని చెప్పలేదు. అసలు అటువంటివాడు ఉండేవాడో లేదో, ఆ కథని మొదట్లో రాసినవాడు. తప్ప నువ్వూ నేనూ ఎరగం. సత్యవాక్పరిపాలనలో వుండే నీతికోసం కవిగాడెవడో కల్పనచేసి వుండొచ్చు. వాడివిషయం ప్రస్తావించావు గనక చెపుతున్నాననుకో. నన్ను హరిశ్చంద్రుడితో నువు పోల్చనవసరంలేదు. ఆక్షణంలో హరిశ్చంద్రుడు ఒక అబద్ధం ఆడేసివుంటే, వాడి కష్టాలు గట్టెక్కేవేమోగాని, నేనివాళ అటువంటిపనిచేసినా ఈ గర్భదరిద్రం తీరేది కాదు. సత్యాన్ని నేను ఆరాధిస్తున్నాననుకోకు. నిజం చెప్పవలసిన అవ సర మున్నప్పుడు, అబద్ధం ఎందుకు చెప్పాలో నాకు అర్థం కాలేదు.

దరిద్రాన్ని. కష్టాలను తీర్చగలిగే శక్తిసామర్థ్యాలు ఒక్క అబద్ధానికే అంట గట్టేటంత మూర్ఖం మరొకటిలేదు" అన్నాడు ధర్మారావు.

సత్యహరిశ్చంద్రుడి చేత దాదాపు ఈ మాటలే కవిగారు, కాస్త కవిత్వధోరణిలో అనిపించారు. ఒకటి రెండు పద్యాలుకూడా కలిపి. ధర్మారావు కుండపగలేసేటట్లు అనేశాడు.

ధర్మారావు గర్భదరిద్రం ఒకడు తీర్చేదికాదు. వాడిమట్టుకు వాడే అదితీర్చుకోటానికి చేసిన ప్రయత్నాలు నాకు నచ్చలేదు. చెప్పొద్దూ! నాకు వాడాప్తమిత్రుడేనూ. మేమిద్దరమూ కలిసి స్కూలుఫైనలుదాకా చదివాం. ఆపైన మాఇద్దరిచదువూ సాగలేదు. వాడినీ, వాడి భార్యనీమట్టుకు దక్కించి, చేసిన పాపాలన్నీ వాడికే ముట్టచెప్పి, వాడికి అయిన వాళ్ళంతా ఏట్లో కలిశారు. ఇక నామాట? ఇది నాకథ కాదు మరి!

వాడిజీవితంలో వాడుపడ్డ కష్టసుఖాలు [సుఖాలంటూ ఉంటేమాట!] నేను పంచుకోలేక పోయినాను. అందుకు అవకాశం కలిసిరాలేదు. చెప్ప రాని కష్టాలు పడ్డప్పుడూ, వాడిభార్య పురిటిరోజులలోనూ, వాడికి తోడు నీడగా వుంటే, నా స్నేహితుడి కష్టాలు ఆదుకున్నాననే తృప్తి అయినా వుండేది. నేనేదో ఊడబొడిచేస్తాననికాదు! కనీసంవాడిభుజంమీద చేయేసి, 'అధైర్యపడమాకు!' అనైనా ఓమాట అనేవాణ్ణి కదా? ఆ మాట అనే వాళ్లుకూడా వాడికి కరువైనారుకద!

నా స్నేహితుణ్ణి ఇటువంటి కష్టాలన్నింటికీ విడిచిపెట్టేసి, నే నెక్కడికో పోయి, కాసింత రాతగాణ్ణి అయినానని, ఏ పత్రికలోనో, అప్ప టికి దొరికిన ప్రూఫురీడర్లు పనిలో ప్రవేశించకుంటే ఏంపోయింది? ఉన్న వూళ్ళోనే పడివుంటే వాడూ నేనూ కలిసి, కనీసం కాగితప్పువ్వులైనా చేసి అమ్ముకొని, కరోగంజో తాగివుండేవారంకద!

మధ్యలో నా పశ్చాత్తాపం దేనికీ?

*　　*　　*

దరిద్రుడైన ధర్మారావు, వాడిభార్య చంద్రమతీ - ఆ పిల్లకి పద మూడోయేటు నిండలేదుకూడానూ - ఒక ఇంట్లో పెరటిభాగంలో చిన్న గది అద్దెకు తీసుకున్నారు. నెలకు అయిదురూపాయలు అద్దె. ఆ యింట్లో పన్నెండు కుటుంబాలుంటాయి. తతిమ్మా వారంతా డబ్బు వెనకెయ్యడం కోసం ఆ యింట్లో చేరితే, ధర్మారావు కేవలం రెండు పొట్టలు పట్టుకు చేరాడు. ఆ యింట్లో తిండికోసం ఎవరూ కక్కుర్తి పడనవసరం లేదు. రోజూ వంటలూ వార్పులూ జరుగుతూనేవుంటాయి. అంతా తింటారు. అంతా దరిద్రపుబతుకులు బతుకుతున్నట్టుమాత్రం నటిస్తారు. ఆడా మగా భేదం పాటించక వొంటిమీద బట్టలన్నీ తీసేసి, కేవలం నగ్నంగానే నూతిదగ్గర స్నానాలుచేస్తారు. ఆడవాళ్ళు వుంటుండగానే, ఎదురుగా మగ రాయుళ్లు అసభ్యమైన పోజుల్లో కూర్చొని విచ్చలవిడిగా అవీ యివీ నోటి కొచ్చిన బూతుమాటల్లా పైకంటారు. ఆ యింట్లో సిగ్గు అనేమాటకు ఎక్కడా యెటువంటి స్థానమూ లేదు.

నిజానికి అక్కడి మిగతా పదకొండు కుటుంబాలలోనూ ప్రతీ కుటుంబమూ కూడా సుఖంగా, ఏ సముద్రపుటొడ్డునో మంచి బంగాళా తీసుకొని, బతికినన్నాళ్లు హాయిగా బతగ్గలిగే స్తోమత ఉన్నవాళ్ళే. కాని, రేషనులోవచ్చే బియ్యంకూడా ఒక పూటేతిని, రెండోపూట రొట్టెలు తింటూ, మిలిగిన బియ్యాన్ని వారికి అనుకూలించే ధరకు, చాటుగా అడిగి, డబ్బిచ్చుకోగలిగే వాళ్ళకు అమ్ముకొని, డబ్బు మిగుల్చుకుంటున్నారు. అందులో ఆరితేరిన ఘటాలు యాజులూ, వాడిభార్య— వెంకమ్మ.

“యాజులు బతకనేర్చినవాడు ఈ కాలంలో” అన్నాను నోరుజారి.

“దొంగముండాకొడుకు! చెప్పిచెప్పి వాడిగురించే చెప్పాలిట్రా! కొయ్యగూరకీ సిగ్గులేదు. కొడవలికీ సిగ్గులేదు. నేను దానికి ఎన్నోసార్లు చెప్పాను వాళ్ళజోలికి పోవద్దని. మళ్ళా నిన్నరాత్రి అది వెళ్ళి ‘ఈ పూటకి బియ్యం కాస్త ఇప్పించండి. రేపు రేషనురాగానే ఇచ్చేస్తాను’ అందిట.

కళ్ళముందే యెవరికో కొలిచియిస్తున్న ఆ వెంకమ్మా— వాడిపెళ్లాం— 'ఇవేవున్నాయి. ముందన్నా అడిగావుకావు' అన్నది. ముందే అడిగివుంటే మహాయిచ్చేటట్టు! "వాడిగదిలో బస్తాడున్నై. నా కళ్ళతో చూశాను!" అన్నాడు ధర్మారావు.

"ఆ బస్తాడూ నీకోసమూ నాకోసమూ దాచాడంటావా అడగ్గానే ఇవ్వటానికి? అందుకే వాడు బతకనేర్చిన—"

"ఆ వెధవని పూసుకురాకు. ఈ భాగ్యానికి అబద్ధమెందుకంటాను? 'అబ్బీ! నాకింత డబ్బుపడెయ్యి' అని స్పష్టంగా ఎందుకేడవరాదూ?"

"అడిగితేమాత్రం నువు ఇచ్చేస్థితిలో వున్నావా? అంతా నీలాంటి సత్యహరి—"

"నేను సత్యహరిశ్చంద్రుణ్ణనడం లేదు. మర్నాడు రేషను తెస్తే అప్పుతీర్చం? మనిషికి నిజాయితీలేని బతుకేంబతుకని?" అన్నాడు ధర్మారావు.

"వాడిక్కావలసింది బార్టరు ఏర్పాటుకాదు, బియ్యానికి బదులు పప్పునా తీర్చటానికి, అది వ్యాపారం." అన్నాను.

* * *

ధర్మారావు అదృష్టమో దురదృష్టమో చెప్పలేనుగాని, వాడిభార్య రంభనీ ఊర్వశినీ చులాగ్గా కాలితో తన్నెయ్యగలదు. ఒక్కొక్కప్పుడు అందాన్ని భరించడం చాలా కష్టంతో కూడుకొన్నపని! దాన్ని కాపాడుకోవటం మరీకష్టం. ధర్మారావు పాలిటికి— ముఖ్యంగా చంద్రమతి ప్రాణానికి, ఆ యింటోనే ఇంటరు వెలిగిస్తున్న ఒక పడ్డ జతపడింది. ఈ పడ్డ ఇంకెవరూ కాదు. ఇంటి యజమానురాలైన బోడెమ్మకొడుకు. ఆ యింటి పన్నెండు కాపరాలలోనూ ఇదొకటి. ఈ పడ్డకు చంద్రమతిని చూడగానే మతిపోయిందని వేరే చెప్పక్కర్లేదు.

ఆయింట్లో చేరినప్పటికి చంద్రమతికి నాలుగోనెల కడుపు. తనూ దారిద్ర్యంలోనే ఈదుకొచ్చి, దారిద్ర్యాన్నే చేపట్టడం మూలాన, చంద్రమతి, తన తల్లి రహస్యంగా చేస్తూవచ్చిన పనే తనూ ప్రారంభించింది. నలుగు రైదుగురి కుటుంబాలలో ఆడవాళ్ళతో మాట్లాడుకొని, ఒకపూట సాధా రణంగా ధర్మారావు ఇంటోలేనిపూట, వాళ్ళందరి అంట్లు తోమిపెట్టేది. రాత్రి ధర్మారావు ఇంటికొచ్చేసరికి బాగా అలసివుండేది.

"అట్లావున్నావేం ?" అనేవాడు ధర్మారావు.

"ఎట్లావున్నాను ? ఏంలేదు." అనేది చంద్రమతి. రహస్యంగా చేస్తున్న ఈ పనివల్ల ఆమె భర్తకు ఒకపూట నిర్విచారంగా తిండిపెట్ట గలిగేది. రెండోపూట భారంకూడా తనపైనే వేసుకునే అవకాశం ఉండి వుంటే, ఆ పిల్ల అందుకు వెనకతీసేదిగాదు కూడానూ. ఈ విధంగా చంద్రమతిచేత అంట్లు తోమించుకునే వాళ్ళలో, పద్ద తల్లికూడా వుంది.

ఒకసారి పెరట్లో. మధ్యాహ్నం ఏ వొంటిగంటప్పుడో, చంద్ర మతి, చుట్టూరా అంట్లుపేర్చుకొని, ఆ యెండలో, వాటిని తోముతున్నది. మగాళ్ళంతా ధనార్జనకు పోతే, ఆడంగులలో కొందరు నిద్రపోతున్నారు. ఇద్దరు ముగ్గురు వయసుమళ్లినవారు పద్ద తల్లితోసహా వీధి అరుగుమీద కూర్చొని వాళ్లవయసులో జరిగిన ముచ్చట్లు చెప్పుకుంటున్నారు.

కాలేజీ విడిచిపెట్టాక మధ్యాహ్నం తిండికొచ్చిన పద్దగాడు సరాసరి పెరట్లోకి కాళ్లు కడుక్కొంటానంటూ వెళ్ళాడు. చంద్రమతికోసం, అంతకు ముందే లొట్టలువేసి, ఆనాడు తెగింపు మరికాస్త ఎక్కువ చేశాడు.

చంద్రమతి తోడిపెట్టుకొన్న చాదలో నీళ్లు పురిషెడుతో ముఖాన కొట్టుకొని,

"ఇన్నోటి అంట్లూ నువు తోమగలవూ ?" అన్నది పద్ద. చంద్ర మతి సమాధానమివ్వలేదు. తలొంచుకునే అంట్లు తోముతున్నది. ఏడోనెల కూడా దాటింది. చెమటకారిపోతూ ఆయాసంతో ఊగుతున్నది.

"ఇదిగో! నిన్నే! కాస్త మాట్లాడితే అరిగిపోవులెద్దూ!" అన్నది పద్ద మళ్లీ నీళ్ళు ముఖాన కొట్టుకొని. చంద్రమతి వినపడనట్టే తన పని చేసుకుపోతున్నది.

"అంత స్త్రయికు చేయకూడదుసుమా! అట్లా తోమేస్తున్నా అంట్లే అరిగిపోనిది, కాస్త నోటువిప్పితే అరిగిపోతావేం?" అన్నది పద్ద.

తనలో అనవసరంగా కోపాన్ని రగిల్చిన పద్దని, చంద్రమతి ఈసారి తలెత్తిచూసింది. ఆమె జుత్తంతా చెదిరివుంది. చెమటకు బొట్టు కరిగి కారిపోతున్నది, అంట్లచేయి ముడుచుకొని, మడమతో నుదిటిమీది వెంట్రుకలు పైకి సవరించుకున్నది.

"ఏంకావాలి నీకు? నాతో నీకేంపనీ?" అన్నది ముందూ వెనకా ఆలోచనలేక.

పద్ద పక్కున నవ్వింది.

"అబ్బ! ఎన్ని ముత్యాలు రాలినయ్యో! నువేదిస్తే వద్దంటానూ? నీతో ఏపనీ లేకుండా, ఈ యెండలో, ఇట్లామాడుతూ నీతో మాట్లాడతానా మరీ?" అంటూ పద్ద, మునివేళ్ళతో ఆమె ముఖంమీద నీళ్ళు జల్లింది.

"ఛీ ఛా వెధవశనా అని! పాడురాత!...." అంటూ చంద్రమతి భారంగా లేచి నిలబడింది.

"ఇంత చిన్నతనంలోనే- బంగారుబొమ్మలా ఉన్నావు- ముద్దెట్టుకోవాలనిపిస్తుంది. నీకింత పొట్టేమిటి అప్పుడే!" అన్నది పద్ద నవ్వుతూనే!

చంద్రమతి దేహంమీద తేళ్ళూ జెర్రులు పాకుతున్నై.

"ఛీ.... సిగ్గులేని.... నీకేం పోయేకాలం...." అంటూ చంద్రమతి చేతులు కడుక్కొని లోనికి వెళ్ళబోయింది.

పద్ద మధ్యలోనే అడ్డొచ్చింది.

"ఇప్పుడొద్దులే పోనీ. పిల్లాణ్ణి కను. అంత కోపమెందుకూ?"

చంద్రమతి తనగదిలోకి పోయి తలుపులు గడియవేసుకుంటేనే గాని, గుండెవడ ఆగలేదు. ఆ పిల్లకు ఉన్నట్టుండి వుప్పెనగా దుఃఖం ముంచుకొచ్చింది. ఆమె ఎంతసేపు ఏడ్చిందో తెలీదు. ఎవరో తలుపు తట్టినట్టయింది. తీసిచూడగా పద్దతల్లి! ముసుగులేని గుండునుచూసి చంద్రమతి జడుసుకుంది.

"ఏపిల్లా! తిరుపతిమంగలి క్షవరం చేశావు! నాకు వెంటనే తప్పేళాలు కావాలి!" అన్నది ఆ బోడెమ్మ!

ఆ రాత్రి ధర్మారావు ఇల్లుచేరుకున్నాక చంద్రమతి వాడితో ఒక్క ముక్కకూడా చెప్పలేదు. కాని ఆమెఘోరణిబట్టి, ఇటువంటిదేదో జరిగి వుంటుందనే అనుమానం మాత్రం వాడికి అప్పుడే కలగసాగింది.

"మనం వేరే ఎక్కడకేనా పోతే బాగుంటుందండీ!" అన్నది చంద్రమతి.

"ఏం? ఇక్కడేమయిందీ? మనకి ఇంతకన్నా వేరేభవంతి రాసి పెట్టివున్నట్టు కలగన్నావా ఏమిటి?" అన్నాడు ధర్మారావు తిండితింటూ.

"పురుడొస్తే, పురిటికేనా స్థలంలేదు. ఎట్లామరి?" అన్నది చంద్రమతి. ఈ ముక్కన్నప్పుడు ఆమెకళ్లు చెమ్మగిల్లటం, వాడా గుడ్డిదీపం వెలుగులో గుర్తించలేదు.

ఇంతకన్నా వేరేగతి లేదనీ, వున్నా ఇచ్చుకోలేమనీ చంద్రమతికి తెలీకకాదు. అందుకే చంద్రమతి అట్లా అనగానే వాడికా అనుమానం కలగసాగింది. వాడెంత తరిచి అడిగినా ఆమె చెప్పలేదు.

* * *

ధర్మారావు, రోజులుగడవటానికి చేస్తూన్న పనులు చాలావున్నై. ఒక దుకాణంలో ఉత్తరాలు చదివిపెట్టి, సమాధానాలు రాసియిస్తాడు. ఆ యజమాని పదిరూపాయలు ముట్టచెపుతాడు. మరోచోట, తనకున్న విద్యలోనే, చిన్నతరగతుల కుర్రాళ్ళిద్దరికి పాఠాలు చెపుతాడు. అక్కడో

పడి వస్తయి. ఈ రెండూ కొద్దిలో గౌరవమయినవని చెప్పుకొనేవి. గౌరవాన్ని మూటకట్టి దాచేసి, చేయవలసిన పనులు కూడా ధర్మారావు కొన్నాళ్లు చేశాడు. వాడికవి అంతగా కిట్టుబాటుకాలేదు. వాడి తత్వానికి సరిపడలేదు.

కొద్దిరోజులలో వాడిరేఖ ఏమాత్రమో బయటపడిందనే చెప్పాలి.

తను ఎవడికైతే ఉత్తరాలు రాసిపెడతాడో ఆ యజమాని, దుకాణం పెద్దచేశాడు. వాడికేం బుద్ధికలిగిందో చెప్పలేంగాని, ధర్మారావుని తన దుకాణంలో పెట్టుకుంటానన్నాడు. నెలకు మొదట్లో ముప్ఫయికన్నా ఎక్కువ ఇవ్వలేనన్నాడు. క్రమేపీ రాబడిచూచుకొని, జీతం పావలో అర్థో ఎక్కువ చేస్తానన్నాడు. ధర్మారావు సంతోషంతోనే వాడి దుకాణంలో ప్రవేశించాడు.

ధర్మారావు ఆర్థికస్థితి చూసి మనం అట్టే జాలిపడవలసిం దేదీలేదు. వాడికన్నా హీనంగా బతుకుతున్నవాళ్లు సస్యశ్యామలమైన ఈ దేశంలో లక్షలున్నారు. కాని, ధర్మారావు ఎటువంటి సాంఘిక వ్యవస్థలో బతుక్కు-రావలసివుందో, ఆ వ్యవస్థమాత్రం ధర్మారావువంటివాళ్లమీద పడి రక్త మాంసాలు పిండేస్తూన్నది.

అయిమువాపాయలు ఇంటద్దెపోగా, మిగతా పాతికరూయలూ వాడికి సరిపోతాయనుకోలేం. కాని, నెలనెలా నికరంగా వచ్చే ఆదాయం ఇది. రాత్రి దుకాణంకట్టాక ట్యూషన్లు చెప్పుకోవాలంటే,

'మా పిల్లలు నిద్రపోయేవేళ ట్యూషన్లేమిటి ? వేళాపాళా అక్కర్లా?' అని, పాతవాళ్లే ఖసురుకున్నారు.

దుకాణం పెద్దదయిన మొదటి నెలరోజులూ పనికూడా కాస్త ఎక్కువయింది. దుకాణంలో ఈపనీ ఆపనీ అనిలేదు. సామాన్లు అందివ్వటానికీ, మోయటానికీ వేరే కుర్రాడున్నాడు. వాడు చేస్తూన్నంతపనీ, ధర్మారావూ చేయవలసివచ్చింది. 'ఈ పనిచేయటానికి నేను రాలేదు' అంటే, యజమాని, 'మరేంపని చేయాలని వొప్పుకున్నావు ?' అని విందించ

వచ్చు. ఈ వున్నదికాస్తా పోవచ్చు. ధర్మారావు తలవంచి, చేయవలసిందల్లా చేయడం ప్రారంభించాడు.

ధర్మారావు అంత శ్రద్ధగా నోరు కట్టేసుకొన్నప్పటికీ రెండోనెల తిరక్కుండానే, వాడిచేతిలో రేఖ కాస్తా మాయంకావటం మొదలుపెట్టింది.

"అయిదురూపాయలు లెక్క తక్కువపడ్డదేం ?" అన్నాడు యజమాని గల్లాపెట్టిముందు కూర్చొని.

"తప్పెందుకొస్తుందీ ? మరోసారి చూడండి" అన్నాడు ధర్మారావు.

"రాత్రంతా నాకిదే పనా ? అప్పుడే మూడుసార్లు చూశాను. ఎంత చూసినా అంతే. ఏంచేశావు ?"

ఈ చివరిముక్క ధర్మారావుకి గట్టిగా తగిలింది.

"ఏంచేశా వంటారేమిటి ? నేనేదో లాగుతున్నట్టు! ఉదయం మీరు పది ఒకసారీ, అయిదొకసారీ ఖర్చురాయమన్నారు. అవి కట్టుకున్నారా?" అన్నాడు ధర్మారావు.

"నేను రెండుసార్లు యెక్క డడిగానయ్యా ? మరీ చోద్యం చెపుతావూ ! ఇంట్లో ఆడవాళ్లు కబురెడితే, పదిరూపాయలు ఇమ్మన్నానా ? మరో అయిదురూపాయలు ఏమయ్యాయి ?" అన్నాడు యజమాని.

"ఎవరో అద్దొయిస్తే, ఆ అయిదూ మీరే అడిగారు, దేనికో మరి. నాచేత్తో తీసి నేనే మీకిచ్చాను. జ్ఞాపకం లేదూ ?"

"ఏమయ్యోయ్, నామీదే చెపుతావు ? దుకాణంలో యే మూల ఏ సరుకుంది. నిద్రలోకూడా లేపి అడిగితే చెప్పగల్నే, ఈపాటి జ్ఞాపకం వుండదూ ? పైగా నేనే అడిగానంటావేమిటి ? ఖర్చుకూడా రాసేశావూ?"

"అయితే నేను తీసుకున్నానంటారా ?" అన్నాడు ధర్మారావు కాస్త కోపంగా. సరిగ్గా ఇంటికిపోయేవేళ, యజమాని ఇటువంటి పేచీపెట్టాడు, పైగా మధ్యాహ్నంనుంచీ చంద్రమతి కడుపులో కాస్త నొప్పిగా ఉంటున్నదన్నా, లక్ష్యంచేయక దుకాణాని కొచ్చాడు.

"నువు తీసుకున్నావన్నానా? పొరపాటున జేబులో వేశావేమో!"

"ఎవరి జేబు?"

"నీదేనయ్యా! నా చొక్కాకి జేబెక్క డేడిసిందీ?"

"నేను దొంగననా మీ అభిప్రాయం?".

"మాట లెందుకయ్యా?"

ధర్మారావు ఓపిక కట్టలు తెగింది.

"నేను దొంగనని మీ అభిప్రాయం, అంతేకదూ? అబద్ధమాడానని మీ నమ్మకం. ఆ అయిదూ నేనే తినేశానని మీ విశ్వాసం. నా జన్మమెత్తి, ఇంతవరకూ నేను ఎవరినీ మోసంచేసి ఎరగను. ఒక్క అబద్ధమాడి ఎరుగను. నాకల్లారాచూస్తూ ఉండగా అయిదురూపాయలు అడిగి పుచ్చుకొని, లేవంటారే, మీరు మరిచిపోయి నన్ననుమానించటం ఏం న్యాయం?"

తనమాట నిర్లక్ష్యం చేస్తున్నందుకు యజమానికి కోపమొచ్చింది.

"హరిశ్చంద్రుడల్లే మాట్టాడతావే! అబ్బో! గట్టిముఖమే! నీలాగ నాకేం ఖర్చుంటుందనుకున్నావు? మధ్యాహ్నం తిండికెళ్లినప్పుడు ఇంట్లో పడేసి రాకూడదూ? ఎవరికేనా వస్తాయిలే పొరపాట్లు. తీస్తే, తీశాననాలి. నీ జీతంలో తగ్గిస్తే పామె. అంతేగాని. నేనే అబద్ధం ఆడానంటావేమిటి? ఇవంతా నీ సొమ్మా నా సొమ్మా? నా సొమ్ములో నాకు దాపరిక మేమిటీ?"

"కాని, మీరు నాకిచ్చే జీతంరాళ్లు మీకివికావుగా! అందులో అయిదు తగ్గించుకోవాలనా? తగ్గించండి. కాని నేను అబద్ధం ఆడాననకండి. మర్యాదగా ఉండదు."

"మర్యాదసంగతి ఎత్తుతావేం? ఒహ్హో! అట్లాఅవుతే నువ్వు పనిలోకే రానక్కర్లేదు. నీ బాబుల్లాంటివాళ్లు, తెల్లారేటప్పటికి రాకపోరు...."

"మరి నా జీతం?"

"అయిదు రూపాయలతో కొట్టేసి, అబద్ధాలు పేలి, ఏముఖంతో జీతం అడుగుతున్నావు? మరీపాటికి కదులు" అన్నాడు యజమాని.

ధర్మారావు కదలక తప్పలేదు....అయిదు రూపాయలకు యజమాని గడ్డితిన్నందుకు తను చింతించలేదు. దానికోసం యజమాని తనమీద నీలాపనిందవేసి మరీ పొమ్మనటం ధర్మారావు భరించలేక పోయినాడు.

మధ్యాహ్నం యజమాని తరఫువారు ఎవరో వస్తే యజమాని అడగ్గా తనుఅయిదు రూపాయలూ యిచ్చినమాట నిజమే. కానియజమాని ఆ కుర్రవాడిని దుకాణంలో వేసుకోవాలనే ఉద్దేశంతో తన్ను పనిలోంచి తీసెయ్యాలనే ఈపన్నాగం పన్నాడనిమాత్రం ధర్మారావుకి కొన్నాళ్లకిగాని తెలీలేదు.

* * *

తన ఉద్యోగంకాస్తా వూడినబాధతో ధర్మారావు ఇల్లు చేరుకునేసరికి, చంద్రమతి, గదిలో కటికనేలమీద పరుపుపరచి పడుకొని, మూలుగుతున్నది.

"చంద్రం! ఏం? ఏమయింది?" అన్నాడు ధర్మారావు ఆదుర్దాగా.

"నెప్పిగా వుంది" అన్నది చంద్రమతి.

ధర్మారావుకి మతిపోయినట్టయింది. చప్పున చేయవలసిందేమిటో తోచలేదు తనకి. ధర్మాసుపత్రి ఉన్నమాటేగాని, అక్కడకూడా డబ్బు కక్కాలి. తన దగ్గర రాగిదమ్మిడీకూడా లేదు.

ఆ యింట్లో యెవరంటే తనకు అసహ్యం యెక్కువో, ధర్మారావు ఆ యాజులుదగ్గరికే పోయి ఉపాయం చెప్పమన్నాడు. గోచీతోవున్న యాజులు మంచం వేసుకుంటున్నాడు. "ఆస్పత్రికి తీసుకెళ్లండి. ఇక్కడెట్లా?" అన్నాడు యాజులు.

ఈ మాటవిని, వాడిభార్య వెంకమ్మా వచ్చింది—రవికన్నా లేకుండా.

"ఆస్పత్రిలో అంతాకలిపి యాభైకన్నా ఎక్కువవదు బావగారూ! తీసుకెళ్లండి" అన్నదావిడ.

అక్కడేవుండి వింటున్న పద్దతల్లి ముసుగుసవరించుకొని వచ్చింది.

"తీసుకుపో నాయనా! ఆస్పత్రే మంచిది!" అన్న దావిడ తల ఆడిస్తూ.

పద్దమట్టుకు ఆ చుట్టుపట్ల ఎక్కడా లేదు. రాత్రి ఏవేళప్పుడో వచ్చి తిండి తింటూ,

"ఎవరే అట్లా మూలుగుతున్నారు ?" అన్నది పద్ద.

"అదిగో! ఆవిడ కంటున్నదిలే!" అన్నది పద్దతల్లి. ఈ మాటలు ధర్మారావుకి వినపడినై. గదిలో భార్యను విడిచిపెట్టి, బయట చతికిలపడి వొడిలో తలపెట్టి, భార్యమూలుగులు వింటున్నాడు తను.

ఉండివుండి చంద్రమతి అరుపులు యెక్కువైనై. అస్పత్రికి తీసుకు పోరాదా అని అంతా అన్నారు, కాని ఒకరూ తన సహాయానికి ముందుకు రాలేదు. కనీసం ఒక్క ఆడమనిషికూడా ఆ గదిలోకి తొంగన్నాచూడ లేదు. వాళ్ళెవరేనా తనకు సహాయం చేయవలసివుందని ధర్మారావు భావించ లేదు. అది ఇతరుల కర్తవ్యమనీ కాదు. ధర్మారావు మానవత్వాన్ని నమ్మాడు. మానవత్వం అతన్ని నమ్మలేదు.

చంద్రమతి కేకలు, మిగతా పదకొండు కుటుంబాలలోనూ ఒక్క పిసరూ చలనం కలిగించలేదు. ఎవరిమట్టుకు వారు చీమకుట్టినట్టన్నాలేక నిద్రపోతున్నారు. ఇటువంటివి ఈ యింట్లో పరిపాటే అన్నట్లుంది అక్కడి వాతావరణం యావత్తూనూ.

ధర్మారావు తెలివిలేనివాడనీ, చొరవలేనివాడనీ, అధైర్యస్థుడనీ, ఇంకాపోతే, భార్య కనబోతూవుండగా చూస్తూ ఊరుకొన్న క్రూరుడనీ భావించడం అంత కష్టంకాదు. కాని, తెలివైనవాళ్ళూ, చొరవవున్నవాళ్లూ, ధైర్యవంతులూ, ఆ సమయంలో ఆ యింట్లో అనేకు లున్నారు. వాళ్ళేం చేశారు? ధర్మారావుపక్షాన ఒక్క పురుగుకూడా ముందుకొచ్చిన పాపాన పోలేదు.

"ఆడది కంటున్నప్పుడు ఇట్లానే ఉంటుందిగామాలు! పోయి చూసే అవకాశం ఉంటేనో! పిండం ఎట్లా బయటపడేదీ...." అనే ఆలోచనలతో పడ్డా ఆరుబయట మేనువాల్చి, నిద్రపట్టక నక్షత్రాలు లెక్కిస్తున్నాడు.

పిండం ఎంతకాలం లోన కొట్టుకొంటుందని? అది బయట పడనే పడింది. చంద్రమతి సొమ్మసిల్లిపోయింది. పిల్లాడు కారుమన్నాడు. ఆ కేక విని, ధర్మారావు ఒకే అంగలో లోనికిపోయి, కళ్లు మూసేసుకున్నాడు. అతనిగుండె ఆగినంత అయింది.

ధర్మారావు ఆ సమయంలో ఆమాత్రమైనా చేయగలిగినందుకు సంతోషించాలి. ఆదరా బాదరా చంద్రమతిమీద గుడ్డకప్పి పిల్లవాడిని తల్లి పక్కలో పడుకోపెట్టాడు. పిల్లవాడిని ఎత్తుకోగానే, అతని వొళ్లు ఝల్లుమన్నది.

చంద్రమతి నుదిటిమీద చేయివేశాడు. వేడిగా ఉన్నది.

"చంద్రం!" అన్నాడు, ఆమె పలకలేదు. ఆమె భారంగా ఊపిరి తీస్తున్నది.

"చంద్రం!" అంటూ ఆ పసిపిల్లవానితో పాటు తనూ ఏడవ సాగాడు ధర్మారావు.

*　　*　　*

"నా పెళ్ళానికిప్పుడు పురుడుపోసే ఆడదిక్కు లేదు. నా కొడుకు బొడ్డు నేనే కోశాను. ఇద్దరి కిప్పుడు ముగ్గురమైనాం. మాకు తిండిలేదు" అనుకోసాగాడు ధర్మారావు.

"పిల్లవాడెంత ముద్దొస్తున్నాడమ్మా! ఎప్పుడొచ్చిందీ పురుడూ?" అన్నారు, అక్కడి గొడవబొత్తిగా తెలీనట్టు నటిస్తున్న ఆడంగులుకొందరు.

"ఆస్పత్రివాళ్ళు డబ్బుతినటం తప్ప ఇంటోనే పురుడు పోసుకోనేటంత సుఖం మరొకటి లేదు అనుకో! ఏది?" అన్నాడు యాజులు.

"దెబ్బ ఖర్చులేకుండా అంతా సుఖంగానే జరిగిందిలే. తల్లీ పిల్లాడూ ఎట్లా వున్నారు ?" అంటూ గదిలోకి తొంగిచూసింది పెద్దతల్లి.

గదిలో పండంటి కొడుకుని చూసుకుంటూ, రాత్రి తను పడ్డ కష్ట మంతా మరిచిపోతున్నది తల్లి.

"కంగ్రాట్యులేషన్సండీ ! రాత్రి మీకు కొడుకు పుట్టాట్టా !" అన్నది పెద్ద !

ఈ మాటలన్నీ ధర్మారావుదుఃఖాన్ని రెచ్చగొట్టాయే గాని, తగ్గించ లేదు. తన దారిద్ర్యంలో, కష్టంలో, దుఃఖంలో, దిక్కులేనితనంలో ధర్మా రావుకి కొడుకు పుటితే కలగవలసిన ఆనందం అట్టే కలగలేదు. అతనికి తిక్కెత్తినట్టయింది.

"ఈ ప్రపంచం బూటకం. మనుషులు మోసం. నిజాయితీ యెవ డికీ లేదు. మానవత్వం నశించిపోయింది. అమానుషత్వమే పోషిస్తోంది. అబద్ధాలే ఉద్యోగా లిస్తాయి. మోసమే తిండి పెడుతుంది. దుర్మార్గమే మనిషిని లాలిస్తుంది" అనుకోసాగాడు ధర్మారావు. అతనికి మతి చలించి నట్టయింది. ఉన్నట్టుండి అందరిమధ్యా దిగ్గున లేచాడు. తొందరగా వీధి లోకి వచ్చాడు. గట్టిగా ఒకి పెద్ద నవ్వునవ్వాడు. ఒకసారి ఒళ్ళంతా విరిచాడు. "చూస్తాగా ! నన్నెవరేం చేయగలరో !" అన్నాడు పైకి వినబడేటట్టు.

ఆ సాయంకాలానికల్లా ధర్మారావు ఆత్మహత్యకు ప్రయత్నించాడనే నేరం కింద పోలీసులకు పట్టుబడ్డాడన్న వార్త ఒక చిన్న కథగా, పెద్ద తల్లితో చెబుతూండగా చంద్రమతి చెవిని పడింది.

లేవలేకుండానే లేచి, చంద్రమతి పెద్ద తల్లిని సంజ్ఞచేస్తూ పిలిచింది.

"ఏమిటండీ ? మా ఆయన గురించి చెపుతున్నారూ ?" అన్నది అదుర్దాతో.

"ఆఁ, యేంలేదూ. ఆయనేమో...." అంటూ కథా ప్రారంభించేసి, మరిన్ని కొత్తభాగాలు చేర్చి చెప్పింది బోడెమ్మ. చంద్రమతికి ఆ గది లోనే మూర్ఛ వచ్చేసింది.

ఒక రాత్రప్పుడు మెలకువై చూడగా ఎదురుగా నవ్వుతున్న ఒక ముఖం—పాతదేనూ—కనపడ్డది.

"నేనున్నాన్లే, మరేం భయంలేదు. రేపట్నుంచి, మా అమ్మ. నీ సంగతంతా చూస్తుంది" అన్నది పద్ద.

పిల్లవాడి యేడుపు విని పద్ద తల్లి పరుగెత్తుకొచ్చింది.

"అయ్యో పాపం? ఉండు. వాడికి కాస్త పాలుపట్టాలి."

* * *

ధర్మారావు జెయిలునుంచి తిరిగివచ్చే లోపున చంద్రమతిని కుక్క ముట్టుకుంది.

పద్ద చేసినపనికి పద్దతల్లి ఆమోదం కూడ వుండటం గమనించ తగ్గది.

"వాడికేం! వాడు మగరాజు!" అన్నదికూడానూ మగరాజుతల్లి!

అయితే, చంద్రమతి అంతసులభంగా పద్దకి లొంగిపోయిందనుకో నక్కర్లేదు. ఆ పిల్లకు అంతకన్నా గత్యంతరంలేని పరిస్థితు లొచ్చిపడ్డా యన్నమాట నిజం. ఈ వైభోగానికి కూడా, ఆ పిల్ల అంట్లు తోముతూం డగానే నాందీకర్మ జరిగింది! అంతే కాదు! ఈ కర్మకూడా, ఆ యింట్లో మామూలు వ్యవహారం లాగానే జరిగింది! ఇది తెలిసిన వారెవరూ అట్టే ఆశ్చర్యపడలేదుకూడానూ.

పద్ద చేసిన ఈ పనికి, ఉపకారంగా చంద్రమతికి కాస్త తిండీ, పిల్ల వాడికి పోషణా లభిస్తున్నవి. కేవలం బతుకు సాగించటం కోసమే చంద్ర మతి శరీరం దానం చేయలేదు. ఆ యింట్లో ఉరిపోసుకు చావటానిక్కూడా ఆమెకు అవకాశం చిక్కకుండా ఏర్పాట్లు చేసుకున్నారు పద్దా, పద్దతల్లీనీ.

ధర్మారావు తిరిగిరాగానే, మొదట యాజులే యెదురైనాడు—గోచీతోనే!

"వొచ్చారూ! పాపం!" అంటూ చిరునవ్వు నవ్వాడు. ఆ చిరునవ్వులో అర్థమేమిటో ధర్మారావుకి బోధపడలేదు.

చంద్రమతి, ధర్మారావుతో ఏం జరిగిందీ చెప్పలేదు.

"ఈ యింటినుంచి తక్షణం మనం పోవాలి" అని మాత్రం అన్నది.

"ఎక్కడికి?"

"ఎక్కడికన్నా సరే. ఏట్లోకి!"

"సరే, ఏట్లోకే పోదాం పద!" అన్నాడు ధర్మారావు.

ధర్మారావూ, చంద్రమతీ, వాళ్ల పిల్లవాడితో సహా, ఏ యేట్లోకీ పోలేదు. ఈ ప్రపంచంలోనే, ఈ దేశంలోనే ఎక్కడో బ్రతుకుతున్నారు.

ఇటీవల ధర్మారావుకి అబద్ధమాడటం చాతనైంది. అబద్ధమంటే వాడికి ఇప్పుడు కోపంకూడా రాదు. దానిమీద ఒక విధమైన గౌరవం కూడా పెంచుకున్నాడు.

వాడిభార్య పడ్డతో పోవటం ధర్మారావుకి తెలిశాక, భార్యను వాడు సులభంగానే క్షమించివేశాడు. అదేనా, చంద్రమతికి కడుపుపోయినంత యింది. కడుపోవ్వటమే అని వాడంటాడు కూడానూ. ఆ సందర్భంలోనే వాడిభార్య, వాడికి జరిగినవన్నీ చెప్పి క్షమాపణ పొందింది.

ఈ మధ్యనే ధర్మారావుకి కాస్త కమ్యూనిస్టుల వాసన తగిలినట్టూ వాడెక్కడెక్కడో చిన్నచిన్న ఉపన్యాసాలిస్తున్నట్టూ వార్తలొస్తున్నాయి. వాడి బదుకు ఎట్లా గడుస్తున్నదో తెలీదు.

ఒకటి మాత్రం నిజం. వెనుకటి హరిశ్చంద్రుడే, ఈనాటికి మళ్ళీ ధర్మారావు అవతారం ఎత్తి, ఇప్పుడీ కష్టాలు పడుతున్నాడన్న నమ్మకం మాత్రం నాకు పోదు—ఎన్నటికీ!

★

118



# మణెమ్మగారి మనవడు

❖

శ్రీ ఇటికాల నీలకంఠరావు

---

జననం : 1917

చిరునామా : బ్రాహ్మణవీధి, ఖమ్మంమెట్టు, సెంట్రల్ రైల్వే.

కార్యకలాపాలు : సారస్వత సేవ. ఆంధ్రసారస్వత పరిషత్తు హైదరాబాదువారి ఖమ్మంమెట్టు శాఖానిర్వహణం.

అభిరుచి : తెలుగు సారస్వతం ముఖ్యంగా దానిలో కథలు - కథానికలు.

రచనలు : ముద్రితం : రచనలు అప్పుడప్పుడు పత్రికలలో ముద్రితం కావటం తప్పితే గ్రంథ రూపంలో ఏమీ వెలువడలేదు.

అముద్రితం : ——

అభిమాన రచయితలు : కొడవటిగంటి, గోపీచంద్, ముని మాణిక్యం, విశ్వనాథ మొదలగువారు.

119

# మహెమ్మగారి మనవడు

మహెమ్మగారు వాంతిచేసుకున్నదంటే, లోపలికి వెళ్ళాం. అంత వరకు కాళిదాసు, నేను బయటనడవలో మాట్లాడుతు కూర్చున్నాం. మహె మ్మగారు యింకా తలపట్టుకొని దొడ్లో కూర్చోనుంది. ఆమెకు అన్నం వెళ్ళిపోయింది. పైత్య వికారమని నేననుకున్నాను. వాంతి పూర్తిగా తిరుగుముఖం పట్టినతరువాత, ఆమే పుక్కిలించి ఉమ్మేసి లేచింది. కాళి దాసు ఆమెను లోపలికి నడిపించుకొని రావాలనుకున్నాడు. వాడివి బజారు బట్టలని వారించి, ఆమే లోపలికి నడిచివచ్చింది. వచ్చి మంచంమీద పడు కున్నది.

'దాసూ ! రంగయ్యగారిని పిలుచుకొవస్తే !' అన్నాను నేను.

రంగయ్యగారు ఆ వీధిలో ఒకనాటువైద్యుడు. ఆయనవచ్చి ఏదైనా ఒకచుట్టు అరగతీసియిస్తే ఆ పైత్యవికారానికి మంచిదని నా ఉద్దేశం, అది పైత్యవికారంకాక మరొకటైనా, ఆయనచూచి మందిచ్చిపోతే బాగుంటుందనుకున్నాను. కాళిదాసు రంగయ్యగారిని పిలుచుకొరావటానికి ఉద్యుక్తుడైనాడు. నాగేశ్వరరావుగారినే నేను పిలుచుకొ రమ్మనేవాణ్ణి. కాని మహెమ్మగారికి యింగ్లీషు మందులంటేనే యిష్టం లేదు. ఇంగ్లీషుమందులు మనిషిని యింకా పైత్యాన పడవేస్తాయని ఆమె అంటుంది. ఇది ఆమె స్వానుభవంమీద చెప్పేమాట. స్వానుభవంకల మనిషిని మరల్చటానికి తాతలు దిగిరావాలె ! ఒకసారి యెప్పుడో కాళిదాసు ఆమెకు యింగ్లీషు వైద్యమే చేయించాడట. జబ్బేదో జ్ఞాపకం లేదుకాని అప్పటికి నయమే అయింది. కాని తరువాత ఆమె ఎక్కడాలేని పైత్యంతో బాధపడ్డది. నాగే శ్వరరావుగారు ఆ పైత్యానికికూడా మందిస్తానన్నారు పాపం ! కాని ఆమె

నాగేశ్వరరావుగారికి, ఆయనసుందులకు ఒక నమస్కారం చేసింది. నాలుగు రోజులు రంగయ్యగారిని పిలిపించుకొని ఆయన దగ్గరే ఏదో మందు తిన్నది. సుఖంగా వున్నది తరువాత. తదాది ఆమెకు యింగ్లీషు మందు లంటేనే గిట్టవు. ఆ రంగయ్యగారే రావాలి. చీమచిటుక్కుమన్నా ఆయన చేతిమీదుగానే మందు పుచ్చుకోవాలె. ఈసంగతి ఆ వాడన అందరికీ తెలుసు. అందుకనే కాళిదాసుతో తక్షణం రంగయ్యగారినే పిలుచుకొ రమ్మన్నాను.

'రంగయ్యగా రొద్దు, శింగయ్యగా రొద్దు!' అన్నదామె.

'పిలుచుకొ రానివ్వండి, చూచి ఏదైనా మందిస్తారు' అన్నానేను.

'మందు కాదురా అబ్బాయి! నాకు మందూ అక్కరలేదు, మాకూ అక్కరలేదు. యీ యింట్లో యిక నేను ఉండలేనురా' అన్న దావిడ.

'కాదండి, మాటలుకూడా మీవి ఎట్లాగో వున్నాయి. రానివ్వండి' అన్నా. కాళిదాసు వెళ్లబోతున్నాడు.

'పైత్యంకాదు పాడుకాదురా నాయనా! ఈ కొంప మాదిగకొంప అయిందిరా! ఎట్లా యీ కొంపలో వుండటం?' అన్న దామె తిరిగి.

'మరేమి భయంలేదే. రంగయ్యగారొస్తే అంతా తగ్గిపోతుంది' అన్నాడు కాళిదాసుకూడా. కాళిదాసు విసురుగా వెళ్ళిపోబోయాడు. నాకైతే ఆమె ధోరణిచూస్తే నిశ్చయంగా పైత్యవికారం అనిపించింది. మణెమ్మగారి వయస్సుకూడా ఏమి తక్కువదికాదు. ఆమె డెబ్బయ్యోపడిలో మనిషి. వృద్ధులకు పైత్యం క్షణంలో రావచ్చన్నది నామనస్సులో మెదుల్తూనే వుంది.

కాళిదాసును 'వెళ్ళిరారా బాబూ' అన్నాను ఖచ్చితంగా. కాని ఆమె అక్కరలేదన్నది.

'ఎట్లాంటి యిల్లు ఎట్లా అయిపోయిందిరా!' అన్నది మణెమ్మగారు తిరిగి.

'వెఱ్ఱివాడా ! ఆమె పిల్చుకొరమ్మంటే పిల్చుకొస్తావురా !' అన్నాను కాళిదాసుతో. కాళిదాసు సందిగ్ధంలో పడ్డాడు. ఆమె వద్దంటే వద్దంటున్నది. నేను వెళ్ళమంటున్నాను.

'నేనేమీ యిప్పుడు చావను. మరేం భయం లేదు. కాని నేను బ్రతి కుండగానే యీ యిల్లు యిట్లా మాదిగరికం అయిపోతున్నదే అని నా విచారం' అన్నది మణెమ్మగారు అదోలా ముఖంపెట్టి.

ఆందోళనగా 'ఏమిటమ్మా ! ఏమయింది. ఏమై పోతున్నది యీ యిల్లు' అన్నాడు కాళిదాసు.

'ఇంతకంటె ఏం కావాలె ? కనపట్టం లేదూ !' అన్నదావిడ.

'ఏమిటమ్మా నీ మాటలు ? ఏమీ అర్థం కావటంలేదు. వైద్యుణ్ణి తీసుకొస్తానంటే వద్దంటావు. కొంపేమో అయిపోతున్నదంటావు. ఏమిటో అంతా' అన్నాడు నీరసంగా కాళిదాసు.

'ఏనాడైనా మనయింట్లో యెవరైనా చుట్టలు కాల్చారా ! నేటికి చూస్తున్నాను. ఇంతకంటే ఏం మాదిగరికం కావాలి ?' అన్నదావిడ.

'ఎవరు కాల్చారమ్మా చుట్టలు ? బైట ఎవరు కాల్చటంలేదు కదా !' అన్నాడు కాళిదాసు కాస్త తేరుకొని.

మణెమ్మగారు అన్నిటినీ చుట్టలే అంటుంది. చుట్ట, బీడి, సిగ రెట్లను ఆమె విడమరచి ఎట్లా చెప్పలేదో, అట్లాగే వాటి పొగల వాసన లను కూడా ఆమె ప్రత్యేకించలేదు. ఆమెకు చుట్టకంపంటే బొత్తిగా గిట్టదు. చుట్ట కాల్చేవాళ్ళను చూస్తే ఆమెకు పట్టలేని అసహ్యం. మణెమ్మ గారికి చుట్ట కాల్చేవాడిమీద అసహ్యం తాత్కాలికంగా పోవాలంటే వాడి నెత్తిన పదిబిందెల నీళ్లు పోయాలంటుంది. ఎవరైనా చుట్ట కాలుస్తూవచ్చినా, చుట్ట కాల్చుకుంటానన్నా, ఆమె బైటికి తనకు కనిపించకుండా దూరంగా వెళ్ళి కాల్చుకొరమ్మంటుంది. అందుకని వాళ్ళడిగే ఆకో, అగ్గిపెట్టో, నిప్పు రవ్వో నాలుగు తిట్టయినా గిరవాటేస్తుంది. కాళిదాసు దగ్గరికి వీళ్లూ వాళ్లూ

ఎందరో వస్తుంటారు. రైతు లొస్తుంటారు. స్నేహితు లొస్తుంటారు. ఎవరెవరో వస్తుంటారు. మరీ రైతు లొచ్చినప్పుడే ఆమె యిబ్బందినపడు తుంది. చుట్ట కాల్చుకుంటూ ఘాటైన పొగవదుల్తూ వాళ్ళు కాళిదాసుతో మాట్లాడుతూ కూర్చుంటారు. కొందరు మరీ, చుట్ట కాల్చుకోటానికి అవీ యివీ యిక్కడే అడిగిపుచ్చుకొంటుంటారు. కాళిదాసు కూడా జ్ఞాపకంతో వాళ్ళను బైటే కాల్చుకొరమ్మంటాడు. బైటివాసన లోపలికి పోకుండా కూడా తలుపులు మూస్తాడు. ఇంత జాగ్రత్తపడ్డా మణెమ్మగారు లోపల యిబ్బందిపడుతూనే ఉంటుంది. సాధారణంగా పక్కయింట్లోంచి కూడా సిగరెట్లవాసనో, చుట్టలవాసనో తరచు వస్తూవుంటుంది. పక్కయింటి వాళ్ళను ఏమనటానికి వీలు! గాలిని ఏమటానికి వీలు! అంతకంటే వాసనను ఏమనటానికి వీలు! అంటే ఎవరూరుకుంటారు? మరీ ఆ పక్క యింటిలో ఎప్పుడూ ఒకపదిమంది చేరి పొగలు విరజిమ్ముతూవుంటారు. మణెమ్మగారు మొత్తంమీద పంచాగ్ని మధ్యంలో ఉంటూన్న దనొచ్చు.

ఇంట్లో కాళిదాసు నేను తప్ప మగవాళ్ళెవళ్ళూ లేరు. పిల్లలంతా బళ్ళకు వెళ్ళినట్లున్నారు, అలజడిలేదు.

'లేదమ్మా! యింట్లో చుట్టలు కాలుస్తున్నవా ళ్ళెవళ్ళూలేరు' అన్నాడు కాళిదాసు మళ్లీ.

'ముసలిముండను అదరకొట్ట నక్కరలేదు. కాస్త అటు మల్లెసాల వైపు వెళ్ళిచూడు' అన్నది మణెమ్మగారు.

మల్లెసాలవైపు వెళ్తే ఎవరూ లేరు. కాని వాసనమటుకు బాగానే వస్తున్నది. అంతా కలయచూచాం. గదులన్నీచూచాం. కాళిదాసుది పైన ఒక అంతస్థువున్న యిల్లు. పైకీ వెళ్ళిచూచాం. ఎవరూ లేరు. తాళాలు వేసి వున్నగదులు అట్లాగేవున్నాయి. కాని వాసనమటుకు బాగా వస్తూనేవున్నది. ఇహ పక్కయింట్లోయించే వస్తున్నదని కాళిదాసు, నేను నిర్ధారణకు వచ్చాం. పక్కయింట్లోయించి రావటానికి అటు బజారువైపునుంచే కాక,

కాళిదాసు యింటిలోపల మల్లెసాలకు పక్కయింటివైపున యెత్తుగావున్న కిటికీలగుండా కూడా వాసనరావటానికి అవకాశంవుంది.

'లేదమ్మా ఎక్కడా ఎవరూలేరు. పక్కయింట్లోయించే వాసన వస్తున్నది' అన్నాడు కాళిదాసు నిస్పృహగా.

'నేనేమీ చిన్నపోరినికాదు. అంత తెలియకుండా లేను. గుప్పు గుప్పున మల్లెసాలలో వాసనకొడుతూవుంటే, పక్కయింట్లోయించి అంటా రేమిటి ?' అందావిడ.

'లేదమ్మా ! మన యింట్లోదికాదు వాసన, కాస్తనీవు కండ్లుమూసుకో పడుకో, అదే తగ్గుతుంది' అన్నాడు కాళిదాసు.

'కండ్లుమూసుకొని మీరు పడుకోండి. కావాలంటే రంగయ్యగారి దగ్గిర యింత పైత్యాంతకం తెచ్చివేసుకొని మరీపడుకోండి' అన్నది మణెమ్మగారు చివాల్న లేచికూర్చొని.

'లేవకమ్మాలేవకు ! అట్లాకూర్చో, పడతావు' అన్నాడు కాళిదాసు బ్రతిమిలాటగా.

ఇంతలో కాళిదాసు రెండవవాడు మల్లెసాలలో పట్టెమంచం కింద నుంచి లేచివచ్చాడు. మణెమ్మగారు కాని, కాళిదాసుకాని వాణ్ణిచూడలేదు.

'ఏంరా మంచంకింద ఏం పడ్డదిరా' అని అడిగాను వాణ్ణి. వాడు 'బలపం మామయ్య' అన్నాడు ఏమాత్రం ఒడుదుడుకు లేకుండా.



124



# మంకెనచెట్టు

❖

శ్రీ వి.ఎస్.ఆర్. ఆంజనేయశాస్త్రి

---

జననం : 22—11—1928

చిరునామా : C/o గోలకొండపత్రిక, బషీర్బాగ్, హైదరాబాదు.

కార్యకలాపాలు : పత్రికా రచన.

అభిరుచి : కవిత, నాటకరంగం.

రచనలు : ముద్రితం : గండిపడ్డ జీవితాలు. (కథానికలు)
అముద్రితం : పద్యాలు, గేయాలు, రేడియోనాటికలు.

అభిమాన రచయితలు : భాషాసేవలో తలలునరసిన పూర్వకవి వతంసులు, సుహృన్మణులైన సమకాలికులు.

*

# మంకెన చెట్టు

శోషవచ్చి ఒళ్ళంతా చెమ్మటలు క్రమ్మిన సీత నొసట, కారి చారిక కట్టిన కుంకమబొట్టు, భవిష్యత్తుకు తగిలిన గాయంలాగా రాఘవరావుకు కనిపిస్తోంది. ఎటు చూసినా నీడలేని తారురోడ్డు ప్రక్కగా సీత జబ్బపట్టు కొని రాఘవరావు నడుస్తున్నాడు. సీతను నడిపిస్తున్నాడు. ఆయాసంతో సీత మరో అడుగైనా కాలగమనంలో పాలుపంచుకొనే స్థితిలో లేదు. మట్ట మధ్యాహ్నం సూర్యునివంక నేరుగా చూసిన కళ్లు మరోవంకకు త్రిప్పినప్పుడు, బైర్లుక్రమ్మి కనిపించే ఎఱ్ఱటి కుదపలవంటి కాంతుల్లాగా, ఎదురుగా మంకెనచెట్టుమాత్రం నిల్చుంది. మంకెన పూలైతే బాగున్నాయి; అవసరమైన నీడమాత్రం శూన్యం. ఆ చెట్టుక్రింద సీతను నిలిపి రాఘవ రావు ముందుకు వెళ్ళి మాత్రం ఏంచేస్తాడు ?

కష్టాలవేడికి గుండెలెండి, ఏర్పడిన ఒగర్పుకు ఊగిపోతూ పాలి పోయిన సీత ఒళ్ళు, పసుపు రాచుకొని అభ్యంజనంచేసి తలార్చుకుంటున్న సుమంగళిని రాఘవరావుకు జ్ఞాపకం తెస్తోంది. ఆసుపత్రి మెట్లపద్దనుండి యీ మంకెనచెట్టువరకూ వాళ్ళు నడిచిన నడకలో ఎన్ని కొంటెకళ్లు అడుగుల్ని లెక్కబెట్టాయో రాఘవరావెరుగును. నీడలేక గాయపడిన భవి ష్యత్తుతో నడుస్తున్నతాము వాళ్ళలో కల్పించగలిగిన భ్రమరు రాఘవరావు సమాశ్వసిల్లాడు. ఇంతలో సీత సన్నగా మూలుగుతూ ఒగర్చేసరికి రాఘవ రావు భయమైన భవిష్యత్తు రూపంలో నిలిచి చుట్టూ ప్రకృతి మండిపోతున్న ఉనిపిస్తూన్న మంకెనచెట్టును, కొమ్మల్ని, దృష్టినిలిపి చూశాడు. పొడలు పొడలుగా పడుతున్న ఎండ మధ్యగా చెట్టుబోదె నానుకొని సీత కూర్చుంది. భవిష్యత్తులో నిక్షిప్తమై ఉన్న ఆశలాగా మంకెనపూలు ఆకర్షకం

గానే ఉన్నాయి. కాని చెట్టంతా విస్తరించుకొన్న ఆపూలవల్ల సీతకోసం నీడైనా సంపాదించలేని తన గాయపడ్డ భవిష్యత్తును ఆలోచిస్తు రాఘవ రావు బెదురుగా చుట్టూ కలయజూశాడు.

ఊర్నించి వచ్చేటప్పటికి సీతపరిస్థితి ఇలా అవుతుందని రాఘవ రావు అనుకోలేదు. ఎన్ని ఉత్తరాలువ్రాసినా జవాబు వ్రాయని వీరభద్రరావు మనస్తత్వం ఆ వూరు వెళ్ళివచ్చిగాని రాఘవరావు అర్థం చేసుకోలేక పోయాడు. పసుపుకొమ్ము కట్టుకొని, రైలుఖర్చుకు మంగళసూత్రమిచ్చిన చెల్లెల్ని కాపాడుకోడానికి వీరభద్రరావు ఒక్క దమ్మిడీ ఇవ్వలేదు. తల వంచుకొని తిరిగి వచ్చేందుకు రైలు ఖర్చుకులేక, అంచెలంచెలుగా, వారం రోజుల ఉపవాస ప్రయాణంతో యిల్లుచేరిన రాఘవరావు సీత ఆసుపత్రిలో ఉన్నవిషయం విని, విషాదాన్ని కడుపునిండా మ్రింగి త్రేన్చి ఆకలిలేకుండా చేసుకున్నాడు. బాకీ తీర్చకపోతే ఇంటి తాళంచెవి ఇవ్వనని ఖరాఖండిగా చెప్పిన యింటి యజమానిమీద అతనికి కసి రాలేదు. అతనితో పోట్లాడే శక్తిగాని, నల్గురిహామీతో బాకీ తీరుస్తానని నచ్చచెప్పే నైతిక స్తోమతగాని రాఘరావుకు లేవు. ఇంట్లో సామానుమాత్ర మేముంది కనుక? కట్టుకోడా నికి వీలుగా ఉన్న ఆ ఒక్కచీరా, ఆసుపత్రిలో సీత ఒంటినే ఉండి ఉంటుంది, సరాసరి సీతకోసం రాఘవరావు ఆసుపత్రికే వెళ్లాడు.

ప్రమాదం మాత్రం తప్పింది సీతకు. ఆసుపత్రి అధికారులు ఇన్ పేషెంటుగా డిస్ఛార్జి చేస్తే తిరుగుముఖంపట్టిన సీత, ఆసుపత్రి మెట్లమీదే రాఘవరావుకు ఎదురైంది. పోవడానికి ఇల్లంటు లేదని ఆ మెట్లమీదే తెలుసుకుంది.

వీరభద్రరావు మిత్రద్రోహం చేశాడు. రాజ్యం ఆత్మహత్యకు వీర భద్రరావే కారణమని అతని మిత్రకోటికందరికీ తెలుసు. తనపట్ల రాజ్యం చూపే చనవును ఆధారంగా తీసుకొని, రామారావు మనస్సు క్షోభిల్లేట్లు పాడుపని చేసి, రాజ్యం చావు కళ్లారా చూసిన విషయం వీరభద్రరావు

అంతర్యాన్ని కెలుకుతూనే ఉంది. రామారావుకు చేసిన ద్రోహాన్ని పరిహరించుకోడం కోసం సీతను రామారావుకు మాట్లాడి బంధుత్వం కలుపుకోవాలనుకున్నాడు. ఇది వేపచెక్కకు పంచదార అద్దడం మాత్రమేనని వీరభద్రరావు తన పశ్చాత్తాపంలో గుర్తించలేకపోవడం సీతకు అబ్బురమనిపించలేదు. కాని రాఘవరావు తోటి ఎకసక్కాలు తన జీవితాన్ని ఏ నాటికైనా పుష్పింపజేయాలనుకున్న సీత, వీరభద్రరావు పశ్చాత్తాపానికి విలువ కట్టలేక పోవడం సహజమేననిపించింది రాఘవరావుకు. అందుకే వీరభద్రరావుతో ప్రమేయం లేకుండా సీతా, రాఘవరావూ ఏకమయ్యారు. స్నేహితం చేసి చేసి, రాఘవరావు తనకు మిత్రదోహం చేశాడని వీరభద్రరావు కేర్పడిన క్రోధం చివరకు ద్వేషంగా మారింది. అప్పటినుంచి సీత యీ స్థితికి వచ్చేవరకూ రాఘవరావూ, వీరభద్రరావూ కలుసుకొని ఎరుగరు. రాఘవరావు హతాశుడు కావడానికి ఈమిత్రద్రోహమే కారణమని సీతకు తెలిసుండీ కూడా, చెల్లెల్ని చూసైనా మనస్సు మార్చుకోడాఅన్న ఆశతో, వీరభద్రరావు ఇంటికే పోవాలని సీత, ఆసుపత్రి మెట్లమీదనే నిశ్చయించుకుంది.

'వృథా అయిపోయిన రైలు ఖర్చన్నావచ్చింది మంగళసూత్రంవల్ల, పసుపుకొమ్ముమవల్ల ఏమొస్తుంది ?' జబ్బ పట్టుకొని సీతను ఆసుపత్రి మెట్లు దించుతూ రాఘవరావు అన్నాడు. అక్కడినుండి రైలుస్టేషన్ రెండు మైళ్ళుంది.

'ఆడకూతురుకదా అని బిడియంతోకలిసిన కనికరంతో, టిక్కెట్టు లేకుండా రైల్లో ప్రయాణం చేయనివ్వవచ్చు. మధ్యలో పట్టుకున్నా—' అంది సీత. సరే, రెండుమైళ్ళ దూరమూ గడిచి రైలుస్టేషన్ చేరడాని కెవరి కనికరం ఉపకరిస్తుందో రాఘవరావుకు తోచలేదు. అందుకే అడుగడుక్కూ విశ్రాంతి తీసుకుంటూ, సీతతో పార్కుమీదుగా, చెట్లక్రిందుగా

రాఘవరావు స్టేషన్ వైపు బయల్దేరి నీడనివ్వని ఎర్రని మంకెనచెట్టుక్రింద—యిక్కడ— సీతను కూర్చోబెట్టాడు.

మంకెనచెట్టు గ్రీష్మానికి చిహ్నం అనుకున్నాడు రాఘవరావు. కడుపునిండా విషాదం నిండి ఆకలిదప్పులు రాఘవరావువంకకు రావడం లేదు. వారంరోజులపాటు తిండిలేకుండా నడిచి నీరసించి వచ్చిన రాఘవరావుకు, సీతను కూర్చోబెట్టిన ఆ మంకెన చెట్టుక్రింద చలువ చప్పరం కనుమూసి తెరిచేలోగా ఏర్పాటైపోతే బాగుండునన్నంత పేదఆశమాత్రం తళుక్కుంది. రాఘవరావుకు కావలసిన నీడమాత్రం ఆ చుట్టుప్రక్కల ప్రకృతిలో లేదు. పార్కు అప్పటికే అరమైలు క్రితమే వెనుకబడిపోయింది. దుమ్ముకొట్టుకొని, రంగుమారుతున్న తారురోడ్డు మీంచి విసరేగాలికి సీత చెమటారిపోయిందిగాని, రాఘవరావుమాత్రం ద్రవిస్తున్నాడు.

మంకెన చెట్టులాగా కంటికి నదరుగా ఉన్నప్పటికీ నీడలేని భవిష్యత్తులోకి అడుగుపెడుతున్న రాఘవరావు చెమట తుడుచుకొనే ఓపిక కూడా లేకుండా, అన్నాడు. 'నువ్విక్కడే ఉండు, పోయి రిక్షాతెస్తా.' భవిష్యత్తులోని నీడకోసం వెదకపోతున్న రాఘవరావుదగ్గర చిల్లిగవ్వైనా లేదని తెలిసీ, సీత 'ఊ' అని మాత్రమే అంగీకరించగల్గింది. భవిష్యత్తు వేసిన మంటలాంటి మంకెనచెట్టుక్రింద తనను వదలి నీడకోసం పయనమైన రాఘవరావును నిండుగా ఒక్కసారి చూసింది.

పాతాళంలోకి దిగలాగుతున్న కాళ్లతో రాఘవరావు మంకెనచెట్టు దగ్గరనుండి బయలుదేరాడు. ఫర్లాంగు దూరంలో ఆగి ఉన్న రిక్షా ఒక్కటే రాఘవరావును నడిపిస్తోంది. రిక్షాను ఎండకడ్డంగా నిలిపి, నడుముక్రింద సీటువేసుకొని, రిక్షానీడలో నిద్రపోతున్న రిక్షావాలా అదృష్టానికి రాఘవరావు అసూయ పడ్డాడు. ఎదురుగా ఎలక్ట్రిక్ స్తంభానికి వ్రేలాడకట్టబడి ఉన్న సినిమా పోస్టరులోని సౌందర్యాన్నిచూస్తూ మూసుకున్నట్లున్న రిక్షావాలా రెప్పలను విప్పడానికి రాఘవరావుకు నిజంగా బెదురే పుట్టింది.

అయినా లేపాడు. కళ్లు నులుముకుంటున్న రిక్షావాలాకు ఫర్లాంగుదూరాన మంకెనచెట్టు చూపించి రాఘవరావు రిక్షాలో మెత్తని సీటుమీద కూచున్నాడు. కూర్చున్నవాడు తనకు దొరికిన నీడను పట్టలేని సంతోషంతో చేరిగిలబడ్డాడు.

రిక్షావచ్చి ఎదుట ఆగేసరికి సీత ఎండకు కుంచించిన కనుబొమ్మల్తో బరువుగా రాఘవరావువంకచూసి, తానే లేవదలిచింది. జబ్బపట్టుకొని తనను రిక్షా ఎక్కించడానికి దిగిరాని రాఘవరావు చెమటకు కరిగి చారికకట్టిన తన కుంకుమరేఖను ఇకమీద చూడలేని స్థితికి చేరుకున్నాడని తెలుసుకున్నసీత, ఆసుపత్రి మందులతోపాటు తీసుకున్న రొట్టె, పాలసత్తువ నంతా ఉపయోగించి ఒక్కసారి కేకపెట్టింది. నీడకోసం మరోచెట్టుమీదికి ఎగరదలుస్తు మంకెనపూలమధ్య ఆగిన ఏపిట్ట యీకేకకు బెదిరి ఎగిరిందో, ఆ ఊపుకు రెండు మంకెన రేకులు నిలిచిపోయిన సీత నెత్తిన రాలాయి.



130



# మేం నలుగురం

❖

శ్రీ ఎం. హీరాలాల్ రాయ్

---

జననం : 13–7–1924

చిరునామా : మోహన్ రోడ్, ఖమ్మం.

కార్యకలాపాలు : జర్నలిస్ట్.

అభిరుచి : కథానికలు, వ్యాసాలు, విమర్శనలు.

రచనలు : ముద్రితం : ఉర్దూ, హిందీ, తెలుగు సంచికలలో
సుమారు 150 కథలు, 30 వ్యాసాలు.

అముద్రితం : ఇంకా ఎన్నో కథలున్నాయి.

అభిమాన రచయితలు : షేక్స్పియర్, క్రిషన్‌చందర్, ప్రేంచంద్,
శ్రీ శ్రీ, దాశరథి.

*

# మేం నలుగురం

ప్రజ్వలించిపోయే సూర్యకిరణాల ధాటికి జడిసి, పొద్దస్తమానం ఎటూ వెళ్ళడానికే వీల్లేకుండా పోయింది. కాని, చూస్తుండగానే సూర్యుడు ముసలా డై పోయాడు. దానంతటనే రానే వచ్చింది రాత్రి. ఏనాడూ తొమ్మిది గంటలకి నేను నిద్రపోయినపాపానపోలేదు. నిద్ర పట్టి చస్తేగా? మా అమ్మ ఎప్పుడూ గోలపెడుతూనే వుంటుంది "జబ్బు చేస్తుందని" కాని నేను రాత్రిపూటనే తప్ప పగలు తిరిగే అవకాశం కనపడదు. జర్జరీ భూతమై పోతూన్న యీ మనస్సుకి కొంతసంతృప్తి, శాంతీ లభించాలంటే మిత్రబృందాన్ని కలుసుకోవడం తప్ప గత్యంతరం లేదు.

అమ్మకి కనపడకుండా చిన్నగా బజార్లో అడుగెట్టాను. ఆవిడకి రోజూ అలా గోలచేయడం, నాకిలా బయద్దేరిరావడం అలవాటైన విష యంలే. ఐనా ఆవిడముందు ప్రత్యక్షంగా నేను బజారుకి బయల్దేరడానికి జంకేవాణ్ణి. ఇవాళా అంతే.

బజార్లో రెండుపక్కలా చూస్తు వెడుతూన్నాను, మిత్రులెవరన్నా కలుస్తారేమోనని. మా మిత్రులంతా నిశాచరులే కావడంతో నేను రాత్రి పూటే నా సంచారకార్యక్రమం ఏర్పరచుకోక తప్పనిసరి అవుతోంది. అంతా ఉదయం పదినుండి సాయంత్రం నాలుగింటివరకు గాడిదచాకిరీ చేసి అలిసిపోయి వచ్చేవాళ్లే. ఇంటికొచ్చి ఓచక్కని కునుకుతీసి, ఆరు న్నరకి లేచి శుభ్రంగా బజారు కొచ్చేస్తారు వాళ్లు.

ఎదురుగా లంచ్‌హోమ్‌లోంచి 'లతామంగేశ్కర్' గానం మధు నదంలా పాయలుపాయలై ప్రవహిస్తూ బయల్పడుతోంది. 'లతా' పాటలు నా గుండెల్లో చెవుల్లో వేదనాగ్ని రేపుతాయెందుకో. లత తీయనికంఠం

వన్ను స్మృతిలేనివాడుగా తయారుచేస్తుంది. ఆ పాటలన్నా అంత మధు రాతిమధురత్వమన్నా నేను భరించలేను. ఆ పాటలకి జాగ్రత్తపడి నేనెంత దూరం వున్నా నా కవి వినిపిస్తూనే వుంటాయి. అబ్బబ్బ! బజార్లో నడుస్తున్నా, మూతపడ్డ పాడుకొంపల మూలల్లోంచీ, అందమైన అమ్మాయల నోళ్ళల్లోంచీ, గొప్పగొప్ప సౌధాల్లోంచీ, నిశాగర్భం చీల్చుకుంటూ ఆ పాటలు పుంఖానుపుంఖంగా అక్షయతూణీరంలోంచి వచ్చే బాణాల్లా నా చెవుల్లోంచి గుండెల్ని దూసుకుంటూన్నాయి. పాటల్లో అతి తీయదనం గుండెని కబళిస్తుంది. మనిషి నీలోకంలోంచి తప్పిస్తుంది.

"లతాదేవీ! నీకో నమస్కారం. దైవసాక్షిగా చెబుతున్నాం. నీవిక పాడడం మానివేయి. మేమంత తీయదనాన్ని భరించలేం. మా మనస్సులు చిల్లులు పడుతూన్నై. మా నిద్ర పాడైపోతోంది. మా బుద్ధి నశిస్తోంది క్రమంగా. మేం గాలిలో తేలిపోతున్నాం. గానం నీకు అమరత్వాన్ని ప్రసాదించిందిలే. ఇక పాడకు. అంతగా నీకు కళాభిరుచి వుంటే చక్కగా ముస్తాబై నృత్యం చేయడం నేర్చుకో, నీకు మా హృదయపూర్వక స్వాగతం." పైవిధంగా ఓ అప్లికేషన్ వ్రాసి నాలాంటి ఇంకా కొన్నిలక్షల మంది సంతకాలు తీసుకుని లతామంగేశ్కర్‌కి సమర్పించాలనివుంది నాకు.

"కాదు. లతా....లత....లత పాడాల్సిందే. ఇంకా, అంతా వినాలి. గుండెల్లో వేదనాగ్నులు ప్రజ్వలించాలి, మేమంతా ఉన్మత్తులం కావాలి. వేణునాదం విన్న కోడెతాచుల్లా మరచి లతపాటకి అనుగుణ్యంగా శిరస్సు లాడించేంత భయం ఉన్మాదం ఆవేశించాలి మాకు. అప్పుడే మా కథలో చివరి అధ్యాయం. అక్కడితో అంతం."

మళ్ళీ ఇలా ఆలోచిస్తు లంచ్‌హోమ్ ప్రొప్రైటర్‌ను చూస్తూ లత పాటలు ఆ హోటలుముందు నిలబడే వినొద్దనుకుంటూనే వింటూన్నా. ఇంతలో ఎక్కణ్ణించో బిలబిలా ప్రవేశించారు మిత్రులు సుబ్రహ్మణ్యం, రంగారావూ, రామకృష్ణ—ముగ్గురూ ఒకే తల్లి పిల్లల్లా. వాళ్లు ముగ్గురూ

నాతో కలిగానే నా కెందుకో సంతోషంతో ఎగిరి గంతేయా లనిపించింది. "పదండిరా! ఓ మాంచి ఘాటైన బ్రూక్ బాండ్ టీ తలో ఒకటీ తీసుకుని మరీ కూర్చుందాం." అని అంతా ఒకేసారి అనడంతో ఒకేసారి నవ్వుకుంటూ హోటల్లో జొరబడ్డాం. 'బృందావన్'లో సుబ్రహ్మణ్యం ఎక్కౌంట్ ఉండనే వుంది, ఇక విచారం ఎవడికి?

మందమైన చుక్కలకాంతిలో మెరుస్తూ వెలిగే చంద్రుడి వెన్నెల్లా రాళ్ళమీంచి ప్రవహించే మునేటి గలగల చప్పుడుతో, స్వచ్ఛంగా సుబ్రహ్మణ్యం నవ్వు ప్రతిక్షణం వినబడుతోనే వుంటుంది. ఆ నవ్వుకు అంతం లేదా అనే సంశయము నాకోసారి కలుగుతూంటుంది. సుబ్రహ్మణ్యం డి. పి. బి. క్లర్కు. చచ్చేంత చాకిరీ, వాడిజీతం అంతా ఇలా హోటళ్ళ పాలే. వాడింకా బ్రహ్మచారిగా వుండడంవల్ల బతికిపోయాడనిపిస్తుంది.

ఇవాళ సుబ్రహ్మణ్యం నవ్వు రామక్రిష్ణ కెందుకో చిరాకు కలిగిస్తూన్నదల్లే వుంది. "ఒరేయ్! ప్రతిక్షణం అర్థం లేకుండా ఏమిట్రా ఆ వెధవనవ్వు నువ్వూను?" అన్నాడు. రామక్రిష్ణకి పోస్టాఫీసులో వుద్యోగం. ఉదయం ఏడుగంటలకి వెళ్ళితే రాత్రి ఏడుగంటలకే మళ్ళీ కొంపకి చేరుకోడం. చావడానికైనా తీరదు వాడికి, అయినా రోజూ వాడు మాతో కలియందే తృప్తిపడేవాడు కాదు. ఇవాళ రామక్రిష్ణ చికాగ్గా వున్నాడు. అందుకే అలా అన్నాడు.

సుబ్రహ్మణ్యం తన నవ్వు నాపకుండానే "రామక్రిష్ణా! చచ్చేంత వరకూ ఇలానే నవ్వుతుంటానురా నేను. ఈ నవ్వుకోసం నేను రోజూ ఎన్నివేల కన్నీటిబొట్లో ధారపోస్తాను! నా యీ నవ్వుతో యీ చరాచర ప్రపంచం ప్రతిధ్వనించిపోవాలి. ఇంతకంటే నాకింకేమీ లేదు" అన్నాడు అదోరకం బాధతో మళ్ళా బాధ కనిపించనీయనంత మామూలు ధోరణిలో.

"బావుంది చాలా బావుంది. నవ్వుకోసరం యేడవడం, ఏడుస్తూ నవ్వడం, నవ్వుతూనే చస్తాననడం ఏమిట్రా నీ వెధవ ఫిలాసఫీ అంతాను?

మా ప్రాణం తోడేస్తున్నావ్" అంటూ రామక్రిష్ణ ఇంకేదో అనబోతు న్నాడు. సుబ్రహ్మణ్యం మధ్యలోనే అడ్డుకుని—

"మీకేం తెలుసురా బతుకునిగురించీ? ఏమీ తెలీకపోయినా అన్నిటినీగురించి రచనలు ఎలా సాగిస్తారో నా కర్థం కాదు. నా జీవితానికీ రెండే రెండు ధర్మాలు తప్ప మరేమి లేవని లక్షసార్లు చెప్పాను. నవ్వులో ఏడుపు, ఏడుపులో నవ్వు....ఈ రెండు రసాత్మకక్రియలూ తోడుతోడుగా వర్ధిల్లాలంటే వీటికి ఘాటైన టీ, సిగరెట్ల సహకారం అత్యవసరం. ఒరేయ్! రామక్రిష్ణా! ఇంకోమాట; నామీద నాకే విశ్వాసం లేదు....నాకు నేనే ఓసారి సమస్యగా, ఇంకోసారి పరిష్కారంగా, ఇంకోసారి ప్రాక్షన్‌లో పడ్డ లెక్కలా తయారవుతాను. ఉద్యోగం చేస్తూకూడా ఇవాళిటివరకూ పైసా ఇంటికి పంపలేదు. పంపలేనుకూడాను. పోతే నా టీ, సిగరెట్లకే నా సంపాదనసహితం....ఇంకోసంగతి, చెప్పుల్లేకుండా పుత్తపాదాల్తో నడవాల్సిన స్థితి వస్తుంది. కాని, అలానడిస్తే అంతా వెక్కిరిస్తారనే భయంతో ఉపవాసం వుండైనా చెప్పులు కొనుక్కుని తీరాలి. ఎన్నిరోజులు నేను కూడులేకుండా గడుపుతానో ఎవడికి తెలుసు? అసలెవరికి చెప్పను? ఇలా చెబితే మీరు పరిహసిస్తారు. గుండెల్ని పిండిచేసే మీ పరిహాసాలు భరిస్తూ బ్రతుకుతుంటాను నేను. మానవుడికీ, విజ్ఞానానికీ, జీతాలిచ్చే చదువుకీ, చదువుకీ సంస్కారానికీ, మంచికీ కీడుకీని అంతరాంతర సంబంధా లెలా వుంటాయో ఆలోచించబుద్ధవుతుంది. నేను ఆలోచిస్తాను. ఇంతకంటే మహోన్నత విషయాల్ని గురించికూడా ఆలోచిస్తూ నిద్రపోతాను. నిద్రలో నవ్వుతాను. మేలుకుని ఏడుస్తాను. ఆకాశంతో మాట్లాడతాను. నీలాంటి మిత్రులుకలిస్తే వికృతంగా నవ్వుతాను. నవ్వడం ఏడవడం నాలో జీర్ణించుకు పోయాయిరా! అవి నన్ను వదలవు" అంటూ చిట్టచివరికి ఓతాచుపాము బుసలాంటి నిట్టూర్పు విడిచాడు సుబ్రహ్మణ్యం.

"ఒరేయ్! నీకో వెయ్యినమస్కారాలు. కాస్త నీ యేడుపుల భాగోతం ఆపు. తాగిన టీనీళ్ళమైకం వదిలిపోతోంది. నేనో చిన్నకథ రాశాను. ఐదునిమిషాలు పడుతుంది. వినిపిస్తా నుండు" అంటూ రామక్రిష్ణ జేబులో చెయ్యిపెట్టాడు.

సుబ్రహ్మణ్యం ఈమారు హోటల్ హాలంతా అదిరేంత వికృతంగా నవ్వాడు.

"నీవే ఓ గొప్పకథ వైనప్పుడు ఇంకా నీవేం కథలు రాస్తావురా? నేనేం వింటాను? జీవితానికి అవతలొడ్డునున్న నాలుగు భయంకర సన్నివేశాలూ, రెండు ప్రణయఘట్టాలూ ఇరికిస్తే ఓ కథ అయిపోతుందా?.... అలాంటి కథలు నాకు అవసరంలేదు.... అసలెందుకూ అంట నీ పిచ్చి కథలు? కథలురాస్తే కడుపునిండుతోందిరా? మానవుడి రోదనధ్వని మాటు మణిగి పోతుందా? ప్చ్....వట్టిది....అంతా బూటకం. బంగారాదుంపలు పాతిపెట్టి, వరిపంట పండుతోందంటూ రాసేకథలు బతుక్కు పనికిరావురా! కథాప్రపంచంలో పడి నీ బతుకు మరచిపోతున్నావ్.... పైగా నే నెప్పుడూ ఏడుస్తూంటానని దబాయిస్తావ్?...." సుబ్రహ్మణ్యం ఈమారు చాలా ఉద్రేకంలో పడిపోయాడు. ఒకసారి నావేపుచూసి మళ్ళీ లంకించు కున్నా డిలాగ.

"ఒరేయ్! రామక్రిష్ణా! ఇటుచూడు. ఇవాళ నీ గదిలో డ్రాయరు మీదున్న పుత్తరం ఎక్కణ్ణించి వచ్చిందిరా? అది చదివావా? చెప్పు.... చదివావా అని....? మీ అమ్మగారుగదుట్రా రాసింది? ఏముందందులో? యీ నెల యింటద్దే, స్కూల్ ఫీజూ ఈ నెలైనా చెల్లించకపోతే పరిస్థితి బాగుండదనికదూ రాసింది? నేను చూశానని కోప్పడకు. ఇవన్నీవదలి.... మనలో మాట.... నేనో గొప్పకథకుణ్ణని మందినిగురించి కథలు రాయబోతావేం? అవి నాకు వినిపిస్తానంటావ్ మళ్ళీ....నీవు కథరాస్తే ఈనెల యింటద్దెబాకీ గానీ మీవాడి ఫీజుకానీ చెల్లిపోతాయట్రా? చెప్పవేం?

ఎందుకా మౌనం ? కథ వినిపిస్తావా ? నీ కథవింటూంటే ఇంటద్దెకోసం యజమాని మీ అమ్మని కేకలేయడం వినొస్తుంది నాకు....వద్దులే.... నీ కథకన్నా 'లతామంగేశ్కర్' పాట వేయిరెట్లు మెరుగు.... ఏదో కొంతబాధ అనుభవిస్తూనైనా వినొచ్చు....నీకథ విప్పకు. గుండెపగిలి చస్తాను. నేనింక మాట్లాడన్లే" అంటూ సుబ్రహ్మణ్యం గప్పున నోరు మూసుకున్నాడు...రామక్రిష్ణ నిజంగానే బేజారెత్తి ఏమిటోఆలోచిస్తున్నాడు.

నాలోవున్న మనిషెవడో మాట్లాడుతున్నట్టుంది........ "నిజం. సుబ్రహ్మణ్యం మాటలు నూటికి నూరుపాళ్లు నిజం. కథరాస్తే ఇంటద్దె తీరుతుందా, బడిఫీజు రద్దవుతుందా ? ఇంకా యీరాసిన కథలు ప్రకటించుకునే పత్రికలూ ఈ రాసేవాళ్ళలానే వుంటాయి.... లోపల ప్రచండమైన బాధతో పీళ్లు కథలురాసి పైకెంతో శాంతంగా కనిపిస్తారు.... ఇక పత్రికలో.... పై అట్టమీద చక్కనిముస్తాబూ, లోపల పొట్టలోకి తిండిలేదని గోల....ఇంతేగా ?" అని.

మేమంతా ఇలా సమ్మతమవుతోంటే రంగారావు, ఇందాకటినించీ గొప్పవేదాంతిలా మా మాటలన్నీ మౌనంగా వింటూ మా ముగ్గురి ముఖాలూ తదేకంగా పరిశీలిస్తున్నాడు. ఇండియా పాకిస్థాన్ పంచాయితీల పరిష్కారం గురించో, కొరియాయుద్ధం ముగింపుతెచ్చే విషయాన్ని గురించో, లేక ఆంధ్రరాష్ట్ర సుస్థిరత్వాన్నిగురించో ఆలోచిస్తూన్నంత దీక్షమైన స్థితిలో వాడు మమ్మల్ని చూస్తున్నాడు. చేతిలో సిగరెట్టు వాడి నోట్లోంచి పొగకక్కుస్తోంది. ఇంతవరకూ వాడు ససేమిరా నోరు విప్పనే లేదు. వాడిచాత మాటాడించడం ఎలానా అని నేననుకుంటున్నాను.

రంగారావు ఓ లైబ్రరియన్‌గా జీవితం గడుపుతున్నాడు. అస్తమానం వాడు పుస్తకాలమధ్య ఇరుక్కుని నలిగి, అంతో యింతో అంటించుకుని బయటపడుతాడు........ చక్కగా కవిత్వం, కథలూ, రాస్తాడు.... ఈ మధ్య చాలామంది పత్రికలవాళ్లు వాడి రచనలకోసం వుత్తరాలు రాసే

వాళ్ళు, కాని, వాడిష్టమైతేతప్ప చస్తే పంపకపోయేవాడు.... అప్పుడప్పుడు వాడు నాతో అంటూండేవాడు.... "భాయీ! నా పద్యం వినాలని అంత కుతూహల పడతావుగాని, నేనివాళ ఛోంచేశానో లేదో తెలుసుకోవేం?" అని. వాడిష్టమైతే కోరని పత్రికకైనా రచనలు పోస్టుచేస్తాడు. అవి తిరిగొచ్చినాసరే. అడిగే వాడికి పంపడు.... పంపనికారణం నాకుతప్ప చస్తే మరొకడికి చెప్పడు. సంస్కారంలేని మొరటుమనిషిలా ప్రతిమాటా గభాల్ని అనేస్తాడు. అన్నందుకు పీసమెత్తు పశ్చాత్తాపంపడంగానూ వాణ్ణి మా మిత్రబృందంలో ఎవడూ చూర్లేదు. వాడిజీవితం చార్లెస్‌డికెన్స్ పాత్ర, 'సిడ్నీకార్టన్' జీవితంలాంటిది: కార్టన్‌కి సారాదుకాణం, వీడికి కాఫీ హోటల్. నేను పెద్దగా వాడి చెవికింద నోరుబెట్టి "అరే! కవిమార్తాలం! మేమంతా కొట్టుకుచస్తుంటే పిల్లిలా అలా కూర్చుంటావేంరా? తగిలించు నీపీ రెండుముక్కలు. కథగానీ, కవిత్వంగానీ, ఏదైనాసరే" అన్నాను నేను పెద్దగా.

వాడోసారి చిన్నగా నవ్వాడు. ఇతర్లకి ఆ నవ్వు అమాయకమైన పసిబిడ్డ నవ్వులానో, లేక వెకిలిగానో కనిపిస్తుందికాని, నాకుమాత్రం వాడి నవ్వు అతిభయంకరంగా, దెబ్బతిన్న కుక్కపిల్ల అరుపులా, అగాథంగా వుంటుంది. ఏదో బాధని చీల్చుకునివస్తూన్నట్టు వినిపిస్తుంది. చివరికి వాడూ నోరువిప్పాడు.

"ఒరే నాన్నలూ! ఇదిగో ఇటువినండి! కొన్ని హఠాత్సంఘటనలు ఎంత భయంకరంగా వుంటాయో, మన జీవితాలూ అలాంటివే. ఇదే జీవితానికి రూపం అంటే నమ్మండి. ఇదిగో! ఈ బతుకులున్నాయే వీటిని గురించి మనం ఆలోచించకూడదురా! మన పరిసర వాతావరణాన్ని గురించి కానీ, ఏమాత్రం ఎన్నడూ ఆలోచించకండి. ఆలోచించడం పిచ్చితనంరా! ఊరకే వున్నాలేకున్నా అలా నిరంతరం విశ్రాంతిలేకుండా ముందుకు నడవడమే మనపని. ముందుకు నడవాలి. కాని ఆలోచిస్తూ

కూర్చోగూడదు. ఆలోచించామా ? మన కళ్ళముందు నరకం ప్రత్యక్షమై కూచుంటుంది. ఆత్మవిశ్వాసం నాశనమవుతోంది. మన బుర్రలమీది జుట్టు రాలిపోయి, చివరికి లోపలేమీ మిగలకపోగా జవాబుకూడా దొరకదు మన బతుక్కి. ఆలోచించామంటే మనం ముందుకడు గెయ్యంలేం. పిరికితనం వస్తుంది. ఆలోచన మనల్ని మృత్యువుసన్నిధికి లాక్కునిపోయి నిలబెడుతుంది. మన బాధలూ, గాథలూ, కథలూ, కల్పనలూ, అన్నీ వెంటదీసుకుని ముందుకే మనం నడవాలిరా ! వద్దురా నాన్నలూ ! ఎందుకలా ఆలోచిస్తారు మీరు ? పదండి. అలానైతే మనం ఎవరెస్టుని నిముషంలో జయిస్తాం. ఎర్రకోట చరిత్రని మారుస్తాం. తాజమహల్ తలదన్నే సౌందర్యాన్ని నిర్మిస్తాం. అజంతా ఎల్లోరా గుహల్ని నవీన సాంస్కృతిక సంప్రదాయంలో పునః చిత్రిస్తాం- ముందుకే నడుద్దాం. వెనక్కిపోయి చూసుకోకండి ! దోవలో ఎదురయే ఆభిజాత్య సంపన్నుణ్ణీ, అతిదూష్యవర్తనుణ్ణీ ఇద్దర్నీ ఒకే రకంగా పలకరించండి. ఏడ్చేవాణ్ణి చూసి నవ్వండి. నవ్వేవాణ్ణి చూసి వాడికంటే వికృతంగా నవ్వండి. కాని వెనక్కితిరిగి వాళ్ళతో మాట్లాడకండి. తిండిలేక చచ్చిన ముసలాళ్ళ అస్థిపంజరాలు కాళ్ళకి తగిలినా ఆగకండి. ఈ అస్థిపంజరాల్లో కూడా ఓ రోజున యౌవనం పెల్లుబికేదనీ, వీళ్ళకి పిల్లాజెల్లా ఉండేవుంటారనీ, వీళ్ళూ మనుషులేననీ, వీళ్ళూ ఒకనాడు కడుపునిండా తిని గౌరవంగా కాలక్షేపంచేసినవాళ్ళే కావచ్చుననీ „ వాళ్ళ జీవితాల్లోకి చొరబడి చూడకండి. అలా వెళ్ళారో అంతా అగాథం. ఇంకా కూరుకుపోతారు దానిలో."

వీడిమాటలు విన్నాక ఇంతక్రితం మేం పుచ్చుకున్న టీ సిగరెట్ల స్టిమ్యులేషన్ యావత్తూ కరిగిపోయింది. వాడిచూపుల్లో ఇందాకటిలా లోతు లేదు. నిప్పురవ్వలు కనిపిస్తున్నై. సుబ్రహ్మణ్యం నవ్వుతోనేవున్నాడు. కాని ఆ నవ్వులో ఓ ఎకమైన స్పర్ధ.... రామకృష్ణ మౌనంలో భరించరాని వికటధ్వని. హోటల్ రేడియోలోంచి వచ్చే లతామంగేశ్కర్ గానంలోంచి

గుండెల్ని చీల్చేవేదన ప్రస్ఫుటమవుతున్నై. నే నెక్కడున్నానో నాకే అర్థంకాలేదు.

హోటల్ మూసేస్తున్నారల్లేవుంది. "లేవండి బాబూ! ఇక! రాత్రి పదిన్నర కావస్తోంది" అంటూ రేడియో స్విచ్ ఆఫ్ చేసి మమ్మల్ని గొట్టెల్ని అదిలించేటట్టు ప్రొప్రైటర్ అదిలించడంతో ప్రపంచంలో పడ్డాను........

నలుగురం బలవంతాన బైటికొచ్చాం మోయలేనంత మౌనభావంతో.... ఒకళ్ళనొకళ్ళం మాట్లాడించుకోవడం కూడా చేతకాని నరాల బలహీనతతో నలుగురం నాలుగుదిక్కులకీ వ్యాపించాం.

"ఆలోచించకండిరా! చస్తారు"అనే ధ్వని నన్ను వెంటబడి తరుముతూంటె, పాతబైక్‌మీద పడి కొంపకి చేరుకుని అమ్మకి కనపడకుండా గదిలోకెళ్ళి పడుకున్నాను. నిద్రపట్టి చావదు.





# లోకం పోకడ

❖

శ్రీ వల్లపురెడ్డి బుచ్చిరెడ్డి



జననం : 7 అక్టోబర్ 1932

చిరునామా : పెద్దేరు, మహబూబునగరం జిల్లా.

కార్యకలాపాలు : వ్యవసాయం.

అభిరుచి : కథలూ, గేయాలూ.

రచనలు : ముద్రితం : వివిధ పత్రికల్లో కథలూ, గేయాలూ.
అముద్రితం : కథలు, గేయాలు.

అభిమాన రచయితలు : చేమకూర, నన్నయ్య, సి. నారాయణ రెడ్డి, శ్రీ శ్రీ, దాశరథి, జంధ్యాల, పింగళి, కాటూరి.

*

# లోకం పోకడ

మా వారు పొలాలవైపు వెళ్ళి ఉండటం మూలాన ఉదయం ఎని మిది గంటలకు ఇంట్లోకి అవసరమైన వెచ్చం కొనుక్కురావడానికై దుకా ణానికి వెడుతూన్న దాన్నల్లా, మా పొరుగింటి ముందర ఇద్దరు వ్యక్తులకి జరుగుతూన్న కలహాన్ని చూసి ఆగాను. ఆ ఇరువురిలో ఒకడు ఆ ఇంటి జీతగాడు; మరొకడు మా ఇంటికి చేరువనే ఉన్న ఒక చిన్న వ్యవసాయ దారుడు. వాణ్ణి అందరూ బీరడని పిలుస్తారు.

బీరడిని మా ఇంటికి చేరువన ఉండే ఒక చిన్న వ్యవసాయదారు డని నిర్వచించడం మాత్రమే ఇక్కడ సరిపోదు. కొంచెం వివరించాల్సి ఉంది.

నేటికి మూడు వర్షాకాలాల క్రిందటివరకు బీరడితో పేచీ పడటా నికి మా ఊళ్ళోగాని, మా ఊరికి సమీప ప్రాంతాల్లోఉన్న ఇతర ఊళ్ళల్లో గాని ఎవడికీ గుండెలులేవు. వయసు నలభైకి సమీపిస్తున్నా ఆరడుగుల ఎత్తుగల వాడి నల్లని ఆకారం, మెలికలు తిరిగిన కండరాలూ, కోరమీసం చూస్తే, చాలాకష్టంగా ఇరవై అయిదేళ్ళంటాయన్నట్లు స్పష్టపడేది. అప్ప టికి ఒక పది సంవత్సరాల వెనకటిమాట. మా ఊళ్ళో వల్లారెడ్డి అని ఒక మంత్రతంత్రాలు నేర్చిన వ్యక్తి ఉండేవాడు. ఆనాడతని దౌర్జన్యానికి గ్రామ ప్రజలంతా లోనయ్యారు. ఎవరేనా అతనికి విరుద్ధంగా ఏ కించిత్ విషయంలో నాల్క కదిపినా సరే, వాడి నాశనాన్ని చూసి వదిలేవాడు. ఊళ్ళో అందమైన స్త్రీ లుండటం కూడా కష్టమైపోయింది. అతడు తను నేర్చిన చేతబడుల ద్వారా ప్రతి వ్యక్తినీ తనచేతి కీలుబొమ్మలా ఆడించే వాడు. ప్రజల్లో సహనశక్తి నశించిపోయింది. ఎట్లాగైనా ఆ దుష్టుణ్ణి తమ కళ్ళముందునుంచి తొలగించే ఉపాయం చూడాలనుకున్నారు. అందరి

లోనూ పిల్లి మెడలో గంటకట్టేవంతు ఎవరిదన్నసమస్య ఉత్పన్నమైంది. అప్పుడు వాళ్ళ అందరి దృష్టికీ బీరడు కన్పించాడు.

తనకు కండబలం, గుండెబలం ఎంత ఉన్నా బీరడు శాసన విరుద్ధమైన పనులు చెయ్యాలంటే ముఖ్యంగా ఇతరుల ధనమానప్రాణాలకు హాని కావించాలంటే ఒక అడుగు వెనక్కి తగ్గుతాడు. అంచేత సకలజన సంత్రాస కారకుడైన ఆ రెడ్డిగారిని యమ సదనానికి పంపటానికి సంకోచించాడు. కాని, వాడి దుష్టభూయిష్టమైన కార్యకలాపాలను కళ్ళారా చూస్తుండటం వల్ల ఎట్టకేలకు ఒప్పుకున్నాడు మోసంచేత చంపటానికి, ఆ రహస్యం ఏనాడూ బయటికి పొక్కనీయకుండా ఉండేట్లు ప్రమాణాలు తీసుకున్న తరువాత.

మా ఊర్లో ప్రతి యేటా సౌడమ్మదేవత ఉత్సవం జరిపే ఆచారం ఉంది. నాడు తదుత్సవాలోకనార్థం వచ్చిన మంత్రాల వల్లారెడ్డిని బీరడు వెనకనుంచి వెళ్ళి అమాంతంగా కంబళితో కప్పి, రెండోకంటికి కన్పడకుండా ఊరి బయటికి తీసుకువెళ్ళాడు. అంతే, మరు రోజునుండి ఆ రెడ్డి చాయ కనపడలా.

ఇతరుల సంపదను చూచి కళ్ళలో కారం పోసుకునే వాళ్ళు కూడా లేకపోలేదు మా ఊర్లో. ఈ ప్రకృతి గల కొందరు శిష్టులు బీరడి సుఖజీవనం చూళ్ళేక చాలా నాళ్ళ తరువాత మాటుమణగిన హత్యావిషయాన్ని రహస్యంగా ప్రభుత్వ రక్షణశాఖ వారి చెవుల్లో వేశారు. న్యాయ విచారణలో బలమైన కారణాలు బయల్పడక పోవటం వల్ల బీరడు ఆరునెలలు శిక్ష ననుభవించి వచ్చాడు.

కడచిన మూడోయేట వర్షర్తువులో బీరడి కాలికి ఒక ముల్లుగ్రుచ్చుకుని చాలా బాధించింది. ముల్లు గ్రుచ్చుకొన్న చోట చెడుగుపుట్టి చివరకు కాలు పనికిరాకుండా పోయింది. అప్పట్నుంచీ ఊతకఱ్ఱల సహాయంతో తిరుగుతుంటాడు.

వాని కాలు పోయిన్నాటినుంచే వాడంటే అందరికీ చులకన దృష్టి ఏర్పడింది. వాణ్ణి చూస్తే జడియకపోవడ మటుంచి పేచీ పడటానికి తయారు కాసాగారు. ఇది లోకంలో సహజం. కాలు సరిగాఉన్న రోజుల్లో బీరడు "వూ" అంటే ఎగిరిపోయే చెత్తవెధవ ఈనాడు వానితో కలహానికి దిగాడంటే—

కలహ స్వరూపం శారీరక బలప్రయోగాలమీద ఆధారపడి ఉండక పోవటం వల్ల వాళ్ళిద్దరి మధ్య జరుగుతున్న వాదనను వింటూ నిలుచున్నాను. బీరడు ఆ ఇంటి జీతగాని భుజంమీద ఉన్న గొంగళిని గట్టిగా కుడిచేత్తో మెలిపేసి పట్టుకున్నాడు. వాడేమో పెనుగులాడుతున్నాడు గొంగళి విడిపించుకోటానికి.

"నిన్న నువ్వుతప్ప మా చేన్లోకి ఎవరూ రాలేదు. ఆ మోదుగుచెట్టు దగ్గిర గడ్డికోసిందికూడా నువ్వే. ఆ చెట్టుదగ్గరున్న గొడ్డలిని నువు కాకపోతే మరెవరు తీస్తారు? తప్పకుండా నువ్వే తెచ్చిఉంటావు. విడువ్, గొంగళి విడు. గొడ్డలి తెచ్చిఇచ్చి మరి నీ గొంగడి పట్టుకెళ్ళు" అంటూ చేత్తో ఒడిసి పట్టుకున్న కంబళిని లాక్కోటానికి ప్రయత్నిస్తున్నాడు బీరడు. కాని కాలు లేకపోవడం వల్ల, చంకలక్రింద కఱ్ఱలపై సరిగా నిల్చుండలేక తన ప్రయత్నంలో విఫలుడవుతున్నాడు.

"ఇదుగో, నువ్వెంత పెనగులాడినా నేను గొంగడిని మాత్రం వదలను. నేనా చెట్టుదగ్గిర గడ్డి కోయనేలేదు. చేనులో కోసినా, నేను నీ గొడ్డలి పట్టుకురాలేను. నువ్వే ఎక్కడ పడేసుకున్నావో నన్నడుగుతున్నావు. బావుంది వరుస. ఒక్కరోజు చేనులో అడుగుపెట్టానో లేదో అప్పుడే దొంగతనం అంటగడుతున్నావు. నాకు తెలీదుపో" అని ఖచ్చితంగా చెబుతూ బీరడి చేతినుంచి కంబళిని గింజుకుంటున్నాడు జీతగాడు. అప్పుడే దూరంగా నిల్చుని వారి మాటల్ని వింటూన్న నా దెసచూచి తన కంబళిని బీరడి చేతిలోంచి విడిపించుకోవడం మానివేశాడు. ఏదో యోచన

స్ఫురించినట్లుగా మారింది వాని ముఖకవళిక. వెంటనే నావైపు వ్రేలెట్టి చూపుతూ "నే నొక్కడినేనా నిన్న నీ చేలోకి వచ్చింది? నా మీద దొంగ తనం మోపుతున్నావు. అదుగో, ఆమె బుచ్చమ్మకూడా వచ్చింది. ఆమె కాని తీసిందేమో అడుగు. నేను తీయలేదు" అన్నాడు.

వాడి మాటల్లోని అంతర్యాన్ని గమనించాను. తను తప్పుకునేం దుకు చోరనేర పంకంలో ఇంకొకర్ని ఇరికించాలనే వాని ప్రయత్నమంతాను. గత దినం గడ్డి కోసుకురావటానికి నేనూ అవైపు వెళ్ళినమాట నిజమే. అయినా, నేను బీరడి చేలో అడుగైనాపెట్టలేదు. అక్కడ పొలం గట్లమీదపెరిగిఉన్న గడ్డిని కోసి మోపుకట్టుకుని వచ్చాను. జీతగాని వాలకం చూస్తే ఆ గొడ్డలి నిజంగా వాడే దొంగిలించి ఉండవచ్చుననే అనుమానం కలిగింది నాలో. ఐనా ఆ విషయమై నేనేమీ కల్పించుకోలా. బీరడు తన గొడ్డలి నేనేమైనా తీసిఉంటానేమోనని తలంచి నన్నడుగుతాడేమో నని నిశ్చలంగా నిలుచున్నా.

అంతలో వాని మాటలకు బీరడే జవాబు చెప్పాడు. "అవసరం లేకుండా ఆమెమీద దొంగతనం వేస్తావెందుకు? దొంగముండాకొడుక! నేను చూశాను నిన్ను ఆ మోదుగుచెట్టు దగ్గర గడ్డి కోస్తుంటే. పాపం! ఆమె మా చేలోకి రానేలేదు. మా పొలానికి చాలా దూరంగా గడ్డికోసుకు పోయింది. నువ్వే తీశావు గొడ్డలి. విడు ముండాకొడక!" బీరనికి కోపం ముంచుకొచ్చింది. బలంకొద్దీ ఒక్కసారి లాగాడు కంబళిని. కంబళి జీత గాని చేతిలోంచి జారిపోయింది. దాంతో బీరడి బాహుమూలాల క్రింది నుంచి ఊతకఱ్ఱలు కదిలినై. వాడు నిలుచుండలేక ఒరిగి వెనుకఉన్న అరుగుమీద పడ్డాడు. అయ్యో అనిపించింది నా మనస్సుకి.

కలహ వాదనను నాతో బాటు నిలుచుని వింటూన్నవాళ్లలో ఒకామె ఆ దృశ్యాన్ని చూడ్లేకపోయింది కాబోలు "అయ్యో, అయ్యో" అంటూ ముందుకురికి జీతగాణ్ణి ఉద్దేశించి "ఏమొచ్చిందిరా నీకు? కాలులేనివాణ్ణి

అట్లా త్రోస్తే వాడి గతేంగాను? ఇంత పొగరు పనికిరాదు. గొంగడి వదిత్తే నీదేం పోయింది? నీవు గొడ్డలి తీయలేవని రుజువయితే నీ గొంగడి నీకు తిరిగి వస్తుంది. ఎక్కడికి పోతుంది? విడువరాదా సన్నాసి!" అంటూ కోపంతో పలికింది బీరడికి ఊతకఱ్ఱల నందిస్తూ.

అప్పుడే ఆ యింట్లోంచి యజమానురాలు వచ్చింది. ఆమెముఖం కూడా కోపంతో ఎఱ్ఱబారిఉంది, "నువ్వెవ్వరమ్మా మధ్యన తగుదునంటూ వచ్చావు? గొడ్డలి పోగొట్టుకున్నవాడలా ఉండగా న్యాయం చెప్పటానికి సిద్ధమయ్యావు. వాడిచిత్తం, వాడిచిత్తం నువ్వు నోర్మూసుక్కూచోరాదూ?"

ఆమె మాటలు అసమంజసంగా తోచి "ఎందుకమ్మా పాతివ్రతమ్మా నువ్వంతగా కోప్పడుతున్నావు? అవిటి వానితో అలా గింజుకోవటం బావుండదని చెబితే ఏంపోయింది? ఈ మాత్రం మాట అంటేతప్పా? ఏమో మనిషికనక మనిషిపట్ల జరిగిన ప్రవర్తనను వారించింది. లేక పోతే...."అని అనకండా ఉండలేకపోయా న్నేను.

"ఓహో, నువ్వా వచ్చావా సాయపడటానికి? అందరూ సంసారులే! దుడుకు ఎవరో తెలీదు. వాళ్ళూ వాళ్ళూ పెనుగులాడుకుంటూంటే మీరెవ రమ్మా మధ్యన? ఇంతకూ నువ్వూ వెళ్ళావటగా నిన్న ఆ చేనువైపు. నువ్వుగాని తెచ్చావేమో ఇవ్వరాదూ? ఎవడు చులకనగా కన్పిస్తే వాడి మీదికే విరుచుకు పడుతుంది లోకం" అని చేతులూపుతూ చిఱ్ఱున లేచింది నామీదికి. అనవసరంగా పేచీ పడటం నా కిష్టం లేక పోయింది.

జీతగాణ్ణి లొంగదీయటానికి బీరడి దగ్గర శారీరక బలం కావలసి నంత లేదు. మాటలు సరిపోవటం లేదు. ఆఖరుకు బీరడు జీతగాణ్ణి సంబో ధించి అన్నాడు......... "అరే. తీయలేదంటున్నావు కదా, సరే. అయితే ప్రమాణం చేసి చెప్పు, విడిచి పెడ్తా. వెధవగొడ్డలి. పోతే పోనీ—"

బీరడి మాటలు పూర్తవక ముందే "నిజంగా నేను గొడ్డలి తీయ లేదు. ప్రమాణంచేసి చెబుతున్నా" అన్నాడు జీతగాడు.

"ఊరికే నోటితో అని ప్రమాణం చేస్తే సరిపోదు. పద. పోదాం. హనుమంతుని నెత్తిగొట్టి చెప్పుదువు పద" అన్నాడు బీరడు వాణ్ణి చెయి బట్టి లాగుతూ.

వాడు గొంగడి భుజాన వేసుకుని బీరనివెంట నడవటానికి ఉద్యుక్తు డయ్యాడు. బీరడు మళ్లీ అన్నాడు, "నువ్వు మాత్రమే వస్తే ఎట్లాగు! ఇంటికెళ్ళి నీ కొడుకునెత్తుకుని రా పో."

మాఊళ్లో పూర్వంనుంచీ వస్తున్న ఆచారం ఒకటుంది. ఎవడేగాని అన్యాయం నడతనడచినవాడు తనమీదినేరం నిజం కాదని రుజువు చేసు కోవాలంటే తన కొడుకునుగానీ, తనభార్యనుగాని ఎత్తుకుని నిజంగా తానా నేరం చెయ్యలేదని అంటూ ఊరిబయటఉన్న హనుమంతుని శిలావిగ్రహం నెత్తిన చెయి ఉంచాలి. అది ప్రమాణం. అన్యాయప్రవర్తన కలవాడలాచేస్తే వాడివంశం నశించిపోతుందని చాలా నాళ్లనుంచి వస్తూన్న నమ్మకం.

తన కొడుకుపేరు వినేసరికి అదిరిపడ్డాడు జీతగాడు. "ఇదుగో, నన్ను రమ్మంటే వచ్చి నీకు కావాల్సిన ప్రమాణం చేస్తాను. కాని నా కొడుకు నెత్తుకు రమ్మంటే మాత్రంచచ్చినారాను. నీఇష్టం. వెళ్లి ఎవరితో నైనా ఫిర్యాదు చెప్పుకో." ఈ మాటలంటూ ఆగిపోయాడు వాడు.

ఎక్కువ మాటలవల్ల లాభం కన్పించకపోయేసరికి బీరడు "సరే, నువ్వేపద ప్రమాణం చేద్దువుగాని." అన్నాడు.

జీతగాడు 'సరే' నంటూ బీరడిని వెంబడించాడు. వెనకనుంచి యజమానురాలు పిలిపించి, "ఓరి బాలిగా! (అది వానిపేరు) ఎక్కడికి పోతున్నావ్? ఇంట్లో ఒక్క నీటిబొట్టయినా లేదు. నీళ్లు తెచ్చి మరి వెళ్లు" అంది.

బాలిగాడు ఆగాడు: "ఇంట్లోకి నీళ్లుతోడి పోసి వస్తాను" అంటూ. ఆమె ఎందుకు పిలిచిందో అక్కడున్న వాళ్లకు అవగతం కావటానికి క్షణం పట్టలేదు.

"వాణ్ణి పోనివ్వమ్మా ప్రమాణంచేసి మరీ మస్తాడు" అంది అక్కడ నిల్చున్న వాళ్లలో ఒకామె.

"అంత పట్టుదల కలదానివి నువ్వువచ్చి నీళ్లతోడి పొయ్యరాదూ ఇంట్లోకి ?" అని కోప్పడింది పార్వతమ్మ....

కొన్నాళ్ల తరువాత పార్వతమ్మ మా ఇంటికొచ్చి "బుచ్చమ్మా, కాస్త గొడ్డలివ్వమ్మా. మా ఆయనా, జీతగాడు ఇవాళ కట్టెలు కొట్టుకు రావటానికి బండి కట్టుకు వెడుతున్నారు అడవికి. తిరిగి రేపు తెచ్చి ఇస్తాను" అని అడిగింది.

నేను గొడ్డలి ఇచ్చాను. "మళ్లీ మరువకండా తెచ్చివ్వమ్మా" అని మామూలుగా చెబుతూ.

మరుసటి రోజు అవసరమొచ్చి వాళ్లింటికి వెళ్లాను మా గొడ్డలి తిరిగి తెచ్చుకోడానికి. ఆమె ఆదోమాదిరి ముఖంపెట్టి "అయ్యో, బుచ్చమ్మక్కా మీ గొడ్డలి నిన్న మా ఆయన అడవిలో ఎక్కడో మరచి వచ్చాడట. ఎట్లాగమ్మా ? ఈసారికి మా గొడ్డలి తీసికెళ్లి పని జరుపుకోండి. వచ్చే ఆదివారం సంతరోజున మరోగొడ్డలి కొని ఇస్తాం. మరేమి అనుకోకమ్మా" అంది.

ఆమె అంతగా ప్రాధేయపడుతుంటే నాకేమి అనటానికి మనసొప్పలా. అలాగే నంటూ వాళ్ల గొడ్డలి తీసుకొచ్చి, అవసరం తీరాక తిరిగి తీసుకువెళ్లి ఇచ్చాను. "తప్పకండా సంతరోజున కొనితెచ్చివ్వమ్మా గొడ్డలి" అని చెబుతూ ఇంటికి వస్తుంటే "ఎంతమాట ! తప్పకండా కొనిస్తానక్కా. నా కామాత్రం జ్ఞాపక ముండదూ ?"అని ఆమె అంటున్న మాటలు నా కర్ణేంద్రియాల్లో ఒక్క టొక్కటే వచ్చి దూరినయి.

ఆదివారంనాటి అంగట్లో కొందేమో గొడ్డలిని పార్వతమ్మ, సోమవారంనాడు "ఇదుగో నమ్మా" అంటూ ముట్టచెప్పింది.

ఒకనాడు ఉదయం వంటింట్లో కూచుని అంబలి కాస్తూంటే బయటినుంచి "ఏమేయ్" అని మా ఆయన గొంతు విన్పడింది.

"ఏమిటి ?" అడిగాను ఇంట్లోంచే.

"ఇటురా" అన్నాడాయన.

నేను బయటికి వెళ్లాను. మాఆయన చేతిలో గొడ్డలి పట్టుకుని ఉన్నాడు. అక్కడే బీరడుకూడా నిలబడి నాకేసి చూస్తున్నాడు. వాడి మొహంలో క్రోధం, అసహ్యం ప్రస్ఫుటమవుతున్నాయి.

"ఈ గొడ్డలి బీరడిదట. మనింట్లో కెలావచ్చింది ? ఆనాడు వీని పొలంవైపు గడ్డికొరకు వెళ్లావట. నువ్వుగాని తీసుకొచ్చావా ?" అని ఉరిమాడాయన.

నాకేమీ అర్థం కాలేదు. అంతా అయోమయంగా తోచింది. ధైర్యం చిక్కబట్టుకుని చెప్పాను. "కాదు, ఈ గొడ్డలి నేను తీసుక రాలేదు. మన గొడ్డలి పార్వతమ్మ తీసికెళ్లి పోగొట్టి అంగట్లో ఈ గొడ్డలి మనకు కొని ఇచ్చింది" అన్నాను.

"ఎందుకమ్మా అబద్ధమాడుతావ్ ? ఈ గొడ్డలి నిజంగా నాదే. నా చేతిలో దీన్ని చూసినవారెందరో ఉన్నారు. కావలిస్తే సాక్ష్యం పలికిస్తా. అదుగో దాని నెత్తిమీద సితారుకూడ వేయించాను." అంటూ గొడ్డలిమీద అలంకారానికై చెక్కిన చిన్న చిన్న రంధ్రాలు చూపాడు.

నాకేమీ పాలుపోలా. ఏం చెయ్యాలో స్ఫురించలా. మాఆయన ముఖాన్ని చూశాను. నామీద చేయిచేసుకుంటా డనిపించింది. "అయితే కావచ్చు. పార్వతమ్మను పలికిస్తా పద, ఈ గొడ్డలి ఆమె ఇచ్చిందో కాదో? భగవంతుడిమీద ఒట్టేసి చెబుతున్నా, నేను మాత్రం తేలేదు" అని అంటూ పార్వతమ్మ ఇంటికడకు వెళ్లాను. 'గొడ్డలితో మాఆయన, బీరడూ నన్ను వెంబడించారు.

"ఏమమ్మా, పార్వతమ్మా ? ఈ గొడ్డలి నీవట కొనివ్వలేదూ ?" అని మా ఆయన చేతిలోని గొడ్డలి తీసుకుని చూపిస్తే — పార్వతమ్మ దానిని అటూ ఇటూ త్రిప్పి, పరకాయించిచూసి "ఎబ్బే, కాదే ! నేను కొనిచ్చిన గొడ్డలి ఇదికాదు" అంది.

ఏం సమాధానం చెప్పుకోవాలో నాకు బోధపడలా. గొడ్డలిని మరో సారి చూశాను. నాకు బాగా జ్ఞాపకముంది. పార్వతమ్మ తెచ్చి ఇచ్చిన దాగొడ్డలే. పార్వతమ్మకేసి చూశాను దీనంగా. ఆమె అమాయకపు పోజు పెట్టి నిల్చుని ఉంది.

మా ఆయన అసహ్యంతో "ఛీ, ఈనాటికి ఈ బ్రతుకులో ఒక గొడ్డలి ఇనుపముక్క దొంగతనం....ముదనష్టపు ముండ ! ఛూ !" అని ప్రక్కకు ఉమిసి కోపంతో చరచరా వెళ్లిపోయాడు.

నేనక్కడే నిల్చున్నా. అపవాదు నెత్తిన మోసినందుకు నా కడుపు లోంచి దొంతరలు దొంతరలుగా వస్తూన్న దుఃఖం కళ్లలో అశ్రువుల రూపంగా జారి క్రిందపడుతూంది.

"పాపం ! ఆనాడు అనవసరంగా పార్వతమ్మను, ఆమె జీతగాణ్ణి అనుమానించాను, అసలు రహస్యం ఇక్కడే ఉంచుకుని. నమ్మినందుకు మంచిపని చేశావమ్మా. ఇటివ్వు" అంటూ నాచేతిలోని గొడ్డలి లాక్కుని వెళ్లిపోయాడు. పోతూపోతూ "హుఁ, ఒక్కొక్కప్పుడు అమాయకుల మీదనే నేరాలు పడతాయి లోకంలో" అని సణిగాడు బీరడు.

గొడ్డలి పోతే పోయింది. కాని భరింప శక్యంగాని అపవాదు నెత్తిన పడింది. బీరడి దృష్టిలో నేను దొంగతనం చేసినదాన్ని. బరువైన గుండెతో ఇంటికి వస్తున్నా. బీరడు అన్న ఆఖరుమాట నిజమే, కాని అదేమాట వాని అభిప్రాయంతో పోల్చిచూస్తే....





# సర్కారు కిస్తు

❖

శ్రీ మంద రామారెడ్డి

---

జననం : 3–1–1929 A. D.

చిరునామా : ప్రస్తుతం : పోష్టు మాడుగుల (వయా) దేవరకొండ.
స్థిరనివాసం : మొకరాల గ్రామం, పోష్టు రంగాపురం, కల్వకుర్తి తాలూకా, మ. న. జిల్లా.

కార్యకలాపాలు : ఉద్యోగం.

అభిరుచి : నేటి సాహితీ ప్రక్రియలన్నింటిలో రచనలు సాగించడం. విశేషించి పద్యకవిత, ఆంగ్ల సంస్కృత భాషల అభ్యసనం, విమర్శ, మానసిక శాస్త్రం - అంటే అభిరుచి.

రచనలు : ముద్రితం : పత్రికలలో వచ్చిన కొన్ని పద్యాలూ, కథలూ తప్ప ఇతర మేవీ లేవు.

అముద్రితం : మందలింపు (పద్యకావ్యం)

అభిమాన రచయితలు : అతినవ్యులు, అభ్యుదయులు.

*

# సర్కారు కిస్తు

"ఈ రసత్తానికి మన నడిపిదానికి పదకొండేండ్లు నిండుతయి. సమర్తీడుకొచ్చిన పడుచుదాన్ని ఇంట్లోపెట్టుకొని ఇట్లా పెండ్లి పేరంట మనిగూడా తలవకుండా మీకు కంటికి నిద్రలెట్లొస్తున్నయిరా నాయనా? నాదీ పెద్దప్రాణం, వూరు దూరమయింది, కాడు దగ్గరయింది. నాతల్లి తల్వాలైనా కండ్లజూస్తానో లేదో! బతికినన్నాళ్ళు బతుకవోతానా! యేదో ఓ కులమింటయ్యను చూచితెచ్చి ఇంత పప్పన్నంబెట్టి దబ్బున దారవోస్తే యెందుకైనా బాగు" వంగుతూ వాలుతూ పడ్డెనతెస్తూ కొడుకు కోదండయ్యను మందలిస్తూంది తల్లి బాగమ్మ.

"తోటకాడికెళ్ళి మిరపకాయలు తెంపుకునే సరికే పొద్దుకూ మాకూ సరిపోయె. ఇంట్లో పోటువడ్డ బియ్యంగూడా లేకున్నై. ఈ పూటకు నూకలుమాత్రం వుంటే వొండినా" అని స్వపక్షంగానే సమాధానం చెబుకూంటుంది భోజనంమీద గూచున్న భర్తకి భార్య రంగమ్మ. ఒక ప్రక్క చంటిబిడ్డకు చన్ను నోటబెడుతూ, వేరొకప్రక్క యేడుస్తూ మారాంచేసే యెడబిడ్డను కాళ్లమీద వేసుకొని సముదాయిస్తూ.

కోదండయ్య తల్లిమాటలు గాని భార్యమాటలుగాని వినిపించుకో వడంలేదు. బజారుతట్టు వినిపించే తప్పెటదరువుదిక్కే చెవులు వాలే శాడు. తప్పెట హటాత్తుగా ఆ యింటిమూలన ఆగగానే.... "సర్కారు కిస్తు రేపే పోవాలెనంటా, రకంగట్టని ఆసాములంతా రేపు తెల్లవారుగట్లా, రసీదు బొక్కులూ, రకం, తీసుకొని కరణం పటేండ్లముందరికి చావట్లకు రావలెనంటా, తకావీరకం, కిస్తురకం అంతా కలిపి కట్టాలెనంటనో

హోయ్".... అని కావలిచిన్నోని కేక వినిపించింది. అవ్వలుకిస్తు వసూలు చేసేరోజులు అవి.

నూకలబువ్వ, గోకరికాయ కూర పదిబుక్కలైనా దిన్నాడో లేదో కోదండయ్య చాటింపువిన్న తర్వాత అతనికి ఒక్క బుక్కైనా నోట్లకు వోవడంలేదు. కొడుకువాలకం చూస్తున్న ముసలమ్మ "పాలు కాగినయి నాయనా" అని పొయిమీది పాలచట్టిని ఈడ్చుకుంటూ దగ్గర తెస్తుంది. కాని "ఊహుఁ" అని అతడు పీటమీదినుంచి లేచి చేయి, మూతి కడుక్కొని అవతలియింట్లోకి వెళ్లిపోయాడు. "అయ్యో కొడకా!" అనుకుంటూ ముసలమ్మ తిరిగి పాలచట్టిని తీసుకవెళ్లి పొయిమీద ఉంచి మూత పెట్టుకుంది.

కుంపటిముందు కూచొని కారుచుట్టను కాల్చుకుంటూ ఆలోచనలో పడ్డాడు కోదండయ్య. తప్పెటదరువు చెవులో బడ్డలగాయితీ అతనికి దడదడ వదలలేదు. నిన్న పొద్దుటిపూటే మాలిపటేలు నరసింహారెడ్డి పిలిపించి తన కాతాకు తగిలేరకం వివరంగా చెప్పాడు. "యర్రచెల్కకు ఇంతా, చెరువుకొమ్ముచిడతకు ఇంతా, సివారంచు చెల్కకు ఇంతా, బావి పొలానికి ఇంతా, మొత్తానికి పునాసకు ఇంతా, తరికి ఇంతా, అసలు ఇంతా, దానికి లోకల్‌ఫండు ఇంతా, (జమాబంది కర్చులు, గిర్దావరు మామూళ్లు మినహా) అంతాకలిసి ఇన్నూటా ముప్పైయేడు రూపాయీల పాంచాన చార్‌పాయి" అని.

"కరువులోనే అధికమాసం అన్నట్టు తకావీరకం గూడా యిప్పుడే తగులాలా! ఇంకా నయం. ఎరువుసంచులూ, విత్తనాలూ గురించి అడుగలేదు. జిరాతి (వ్యవసాయశాఖ) వాళ్లదే పుణ్యం. శ్రావణమాసపు వరపుల్లో నేల సెనగచేనుకు వేరుపురుగు తగులకుంటే అది బాగానే సమయానికి అక్కరొచ్చేది. అప్పుడట్లా మంచి పొట్టపాలువోసే కాలంలో జీతగాడు యెగదొబ్బి రిషలాగ పట్నమెళ్లె. ఆ కాస్తపరిమళ్లు అవురుతప్పె. పిల్లల

నోట్లో మన్నువడె. జ్వరమొచ్చినా బువ్వలేదు, జేజెకు పెడదామన్నా బువ్వ లేదు. కాలంలో కరువు అన్నట్టు చిత్త పాశం వోసింది మొదలూ మింటికి మంటికి ఒక్కటేధార కుండతో కుమ్మరించినట్టే. ఈనినకంకి ఈనినట్టే బుసిరాలి పాలారిపోయింది. ఈననిది ఈననట్టే నిలువునా నల్లగట్టి పడి పోయింది. తిప్పితిప్పికొడితే జొన్నలు, సజ్జలు కలిసిముప్పందుము ఇంటి కొస్తే యేమన్నట్టు? చాటప్పులకు సరిపెట్టంగా సంక్రాంతిదాకనైనా జీవనము జరిగేటట్టులేదు. ఆమిదపుచేల సంగతి చూస్తే దినదినగండం. యెప్పుడూ దాసరి పురుగే. ఇక యాసంగిపంట వకనాటివంట, రేపటిదానికి రూపంలేదు.

ఒకటా? రెండా? యెవనికొంపకు కన్నమేయాలి? సర్కారు రకం ఆగేదెట్లా? జొన్నో సజ్జో! ఇంత పూట జరుగుతూంది. ఆయిన్ని బోర్లవేస్తే ఆవల బుక్కాడేదెట్లా? ఒకరా! ఇద్దరా! వచ్చేటోడు, పొయ్యే టోడు, బిచ్చగాడు, అచ్చగాడు అటుంచి చమువుపంతులు మొదలూ, చాకలి వరకు పూటకు యేడుగురు. అమిసిన బత్తెం అయిదుసేర్లు గావాలి రోజొక్కంటికి.

నులకమంచంమీద గొంగడి అడ్డమేసుకొని కూచున్న కోదండయ్య ఇవన్నీ తలుచుకుంటూ, అట్లే నెత్తికి చేతులు పెట్టుకొని కూర్చున్నాడు. అర్ధరాత్రిమీరినా అతనికి రెప్పకు రెప్ప అంటుకోవడంలేదు.

రంగమ్మ చంటిబిడ్డను పక్కనేసుకొని పండుకొంది. యెడబిడ్డ గడెగడెకు యేడుపు సాగిస్తుంటే "దానికి కండ్లు మంటలేస్తున్నాయో ఏమో! ఈ రెండుమాపులనుంచీ దానికి నిద్రలేమీ, నాకూ నిద్రలేదు. ధారణమేమొ చేసింది. యేంజేయాలె? ఈ పాడు గాన్సునూనె వచ్చింతర్వాత ఇంత పిల్లల మాడపట్టుకు రాసేదటువోగా, కండ్లో యేసుకుందామంటే గూడా అంత ఆముదపుచుక్క గతిలేకుంటయింది" అని విసుగుతూ జోకొడు తుంది ముసలమ్మ.

కొట్టులా అలానే కూచున్న కోదండయ్య "కొక్కొ—రోకో" అన్న కోడికూతవిని, గొంగడి దులుపుకొని బుజానవేసుకొని పొలం మొగాన పొయ్యాడు.

* * *

చిత్తెండ పటపట గొడుతూంది. ఆసామీలకు సగం నాగులకూ, సరినాగులకూ యిచ్చిన తిండిగింజలు తిరిగి ప్రోగుజేసి భద్రపరచడానికి పాతగుమ్ములు పూతవేయించి ఆరబెట్టిస్తూ, తాను వుల్లిగడ్డ చెరుక్కొ—ంటూ వాకిట్లో నిల్చున్నాడు, షావుకారి మిర్యాలపాపయ్య.

యెప్పుడో వచ్చి గొంగడి మడతమీద నెట్టుగా గోడనీడలో గూచున్న కోదండయ్య సావుకారి యెప్పుడింట్లకు వస్తాడా, యెప్పుడడుగుదామా అని అనుకుంటూ చుట్టలకు పొగాకునలక నలుచుకుంటూ చూసుకుంటూ గూచున్నాడు.

చెరిగిన ఉల్లిగడ్డలచేట చేతబట్టుకొని కోదండయ్యను చూసి గూడా చూడనట్టే దుకాణంలోకి పోతున్నాడు సావుకారి పాపయ్య.

'నీవద్దికే వచ్చినా' అంటూ వెనుకాల నడిచాడు కోదండయ్య.

'యేంపని ?'

........మూడునిముషాలు మౌనంగా గడిచాక 'కిస్తు' అన్నాడు కోదండయ్య.

'కిస్తూ ! కిస్తులేదు గిస్తులేదు.'

'అట్లంటే యెట్లా ?' మందస్వరంతో అన్నాడు.

"యెట్లాలేదు యాసంగిలేదు."

"గతి !" దీనంగా అన్నాడు.

"గతో, గంగో, నావద్ద రాగిదుడ్డు దొరకదు."

"సర్కా—రురకం, ఆపేదెట్లా ? యెందుకిట్లా జేస్తవ్. నీ సొమ్ము ఇదివరకేమన్నా ఉంచుకున్నామా ?"

"ఆగకుంటే నా యల్లుని కట్నాలా! అంతా ఉంచుకోనివాడవే. పెద్దబిడ్డ పెండ్లి జేస్తి కోరా పత్రం అట్లే మూలుగుతుంది. ఒక్క దమ్మిడి వసూలులేదు. మళ్ళీ అల్లునికేదో కట్నాలనీ కానుకలనీ బట్టలు బాతలు యాపైకి పైగా చేసి కూచున్నావ్. విత్తనాల బాబతు గిద్దెడుగూడా గొలువలేదు. ఈ రెండు సంవత్సరాలనించి తిండి గింజల బాపతు తీసుకపోయిన ముఖమే కాని యిచ్చినముఖం గాదు."

పాపయ్య సావుకారి యిచ్చిపుచ్చుకునే మోతుబరు మనిషి. అతడా వూరికి వచ్చేనాడు ఆస్తి అంటూ వెంట యేమీ తేలేదు. అసిమిసంచిలో అద్దసేరు నూకలూ, తక్కెడా, బాట్లూ తప్ప. మొదలు చిన్నపూరిగుడిసెలో బుడ్డీమకాణంపెట్టి బతికాడు. అట్లే అట్లే నాలుగు కాసులు చేజిక్కించుకొని ఆసామీలకు నాగు గింజవేయడం ప్రారంభించాడు. బిక్కమొగపు అమ్మలక్కలకు అతడు చిల్లరసామాను యిచ్చి లెక్కరాసే అప్పుడు సంపటం మీద బెల్లందుడ్డు, బెల్లంబాపతు దుడ్డు అని అంతకంత కర్పించి మడతరాతలు రాసి అది పెద్ద కాతాకెత్తి చూపి దానికి మిత్తిగట్టి పంటల మీద గింజలు గొలిపించుకొని ఆరు నెలలనుండీ యిచ్చుకుంటూ వచ్చాననీ బజారు ధరకు పావలా తక్కువ చొప్పున ధరలు ఖరారు చేసుకొనేవాడు. మిత్తికిచ్చిన రూపాయిలకు ముద్దతు దాటితే పెచ్చులు గట్టేవాడు. తిండి గింజలు కాగులలో బోసి, గుమ్ములలో మెత్తువెట్టి, గోనెసంచుల్లో గుద్దేసి, పాతర్లలో పూడ్చి, శ్రావణ భాద్రపద మాసాల్లో తీసేవాడు. శ్రావణ భాద్రపద మాసాలు తెలుగుగడ్డకు ప్రకృతి ప్రసాదితమైన గడ్డు కరువుకాలాలు. పాతపంటల తాలూకు చిట్టెడు గూడా మిగిలివుండవు. కొత్తపంటలు అప్పటివరకు యేమీ మెదలవు. కొడవలి పదని కత్తెరపంట లేవైనా ఉంటే కుంభవర్షాలూ, పిల్ల గోదావరులూ కలసి సర్వమంగళం చేసే శుభదివసాలు అవి. సమయజ్ఞతగా పాపయ్య తన ఆర్థిక సూత్రప్రకారం, కడుపు కక్కుర్తిని రేపే అట్టి కాటకంలో పేద రైతులను ముప్పైమూడుమాట్లు ఇంటి

చుట్టు తిప్పించుకొని, ముప్పుతిప్పలు బెట్టి అప్పులిస్తూ, సరినాగులకు రాయించుకోవడమే కాక, "గండ గరువులో కూటిగింజ లిస్తున్నాను సుమా!" అని చూపి చెప్పి, చొప్ప, గడ్డి బండ్లకొద్ది మెప్పుగా తీసుకొనే వాడు. అంత జాణతనంతో అతడు గాదెపంటను పెంపుజేస్తూ వచ్చాడు. రెండు భవంతుల యిల్లు గట్టాడు. మూడు లగ్నాలు జేసుకున్నాడు.

కోదండయ్య ఖాతాతాలూకు నాగుబాబతు గింజలు కొన్ని మూడేండ్ల నుంచీ అట్లే పట్టుకొచ్చినై. వచ్చేవాడి వద్ద వడ్డికేడ్చే సామెతగా అతడు నలుగురిని గూర్చి నానా చేసే గింజకు మూడుగింజలు పద్ధతిప్రకారం తీర్పు చెప్పించుకొన్నాడు. పైగా గొణుగుతూ, సణుగుతూ 'యేదో నూటికి నూలుపోగు' అనుకుంటూనే ఓ దాపటెద్దును దాని కిందికి తూడ్పు పెట్టుకున్నాడు.

ఇప్పుడు గూడా కోదండయ్య వద్ద అతడేదో గిరువుకో కుదువకో ఒప్పందానికో ఆసించి అలా సర్కారురకం దగ్గరకొచ్చేసరికి అడ్డగాలేసి కూచున్నాడు. ఈ కోపమంతా కోదండయ్యకు లేకపోలేదు. కాని బ్రతికే దినమంతా ముందుంది. షావుకారితో గాని, సర్కారుతో గాని కంటుగట్టుకుంటే రైతు జీవితంలో మేడి మెదలదూ, కాడి కదలదూ అతన్ని బతిమిలాడలేక, బాములాడలేక కోపం కొనముక్కుమీదికి వచ్చింది. అయినా చేదుమందులా దిగమింగుతూ లేచిపోయి చేతులు దొరికించుకొని, "చూడు పాపయ్యా! రేపు నలుగురు పాలివాళ్ళ ముందు నన్ను గడ్డి గరపించకు. నగేవాని ముందు జారిపడినట్టవుతుంది నా పని. ఇవి చేతులుగావు కాళ్ళు" అని అడుక్కొన్నాడు. ఉహు ఫలంలేదు. అతడు దులిపి వదిలించుకొని స్నానాలగదికి వెళ్ళిపోయాడు. కోదండయ్య చేతులు నలుచుకుంటూ వచ్చిన మొఖాన పొయ్యాడు.

ఇంటికి వెళ్ళి అతని కేమీతోచక నెత్తికిచేతులు బెట్టుకొని నేలలు జూస్తూ కూచున్నాడు. వంగి వంగి మోకాలు బట్టుకొని నడిచేతల్లి ముస

లమ్మ దగ్గరొచ్చి, "సావుకారి యేవన్నడు నాయినా !" అని అడిగింది. మారు మాట్లాడతోచక చింతలుజేస్తున్న కొడుకు ముఖం చూడలేక ఆమె వెనికికి మళ్లి, "యెట్ల మాట దక్కించుకొంటావో కొడకా ! తనోడనక, మనోడనక, కులమనక, తలమనక, కూస్తాడా పచేలు. సర్కారుతోమాట. యెదురుగా వుంటె యెందుకైనా మంచిదికాదు. యిజ్జతుపోకుండా మొకం దప్పించాలె. 'సావుకారికిముందు సర్కారుకు చాటు' అన్నరు. ఇన్ని దినాలొలె నా వద్దనన్నా యేదన్న బంగారం ఉండికాలవడిండా ! అంతా గండగత్తెర వచ్చింది కొడుక్కు" అని నిట్టూరుస్తూ, మూలుగుతూ పోయింది ముసలమ్మ.

బాగమ్మకు చిన్నతనంలోనే మొగుడుపోయి నెత్తినసీడ లేకుంపైనా వ్రేలెడంత మొగమొల్క కోదండయ్యను నమ్ముకొని, వెంట్రుక వట్టుకొని కొండ వాకినట్లు నడుపుకుంటూ వచ్చింది సంసారాన్ని. ఆకాస్త భూమికి పాలివాళ్లు పెట్టే పంచాయితీలు, చిక్కులు, కాలికితప్పితే మెడకూ మెడకుతప్పితే కాలికీ ఉండేది ఆరోజుల్లో. కరువనక కాలమనక అప్పుడు తులం ఇప్పుడు తులం తెగ్గొట్టి, సర్కారుతాకిడి వచ్చినప్పుడల్లా అష్టకష్టాలువడి "చినుగని వస్త్రం" అనుకొని ఆయింతా భూమిని నిలబెట్టుకు వచ్చేసరికి ఆమె గొంతులో గుండ్లుగూడా కరిగిపోయినై. యిప్పటో అలాంటి బండారమేమీలేదు మాటదక్కించుకోను.

"సర్కారుకు చాటు" అన్న తల్లిమాట అతనికే మర్థమిచ్చిందో ఆ కాసేపటికే దుప్పటి దులుపుకొని బయటికెళ్లి పొయ్యాడు. అతడిప్పుడూళ్లోలేడు.

* * *

అక్టోబరు 11 వ తారీకు కిస్తుపోయేరోజు. చావడిముందు అంతా హడావిడి ఉంది.

"వీనమ్మ ఊరమ్మను మాదుగులడగా అంతా చిన్నాయనలూ, పెదనాయనలూ, బావలూ, మామలూ, కొంపనిండా తనవాళ్లే, మనవాళ్లే

అయ్యాక యెవరినేమనాలి యెవరినేమనగూడదు? తిట్టవోతే అక్కడిద్దా కొట్టవోతే యాకటిమనిషి. ఈ వూళ్ళో సర్కారురకం వసూలుచేసేవరకు కురుక్షేత్రంలో యుద్ధంజేసిందానికన్నా కాసంతెక్కువేగాని తక్కువగాదు. ఒకయ్య బాపనయ్య, ఒకయ్య గురువులయ్య, ఒకడు అయ్య, ఒకడు మియ్య, అంతా అయ్యలు మియ్యలు. నడుమ నావి తకతయ్యలు. ఒకడు పెద్ద పట్టాదారు, ఒకడు షావుకారు, ఒకడు ఇనాందార్, ఒకడు వతన్ దార్. అంతాదాన్లే సర్కారురకం నదారద్. కిస్తు ఇవాళ్లవోవాలి. పోకుంటే యిస్కూలు బరాయిందా. ఆరుగాలంజేసి నోట్ల యేలు పెట్టుకున్నట్టే. తహసీల్దారు తగనిమిండడు. చప్రాసివచ్చి గొంతుమీద గూచున్నాడు. రోజు రెండు రూపాయలు వాని కర్చుకు నాజేబు కాళీ అవుతుంది. యెవని పెండ్లి కోయ్ ఇదంతా? ఇంతైతే మాయింట్ల తినాలి మందింట్ల పనిజేయాలి. తీర్వకువస్తే ఊరికిచేసిన ఉపకారం పీనుగుకు చేసిన సింగారం.... ఆరే యెల్లుగా! ఈ నగ్గిరు యెట్టిగాళ్ళను తోలుకపో, ఆ మదారుసావును ఇట్ల గుంజురా, ఆ చింతకింది ముత్తని బర్రెను గొట్కురా, అట్లే ఆ కోమటయ్య నిటపట్కురా."

మసీదుముందు మాలిపటేలు మంటలై మండుతూండు. అతనిదొక విచిత్ర ప్రవృత్తి. రకం వసూలుకు కూచునేరోజుల్లో బాగాతర్కించి అతణ్ణి గమనిస్తే రోజురోజుక్కూ అతని మనస్తత్వం మారుతూంటుంది. మొదటమొదట "ఆదొరను పిలుచుకురా, ఈ దాతను పిలుచుకురా, ఆ అయ్యను పిలుచుకురా, ఈ అమ్మను పిలుచుకురా, మావను పిలుచుకురా, బావను పిలుచుకురా" అని మర్యాదపద్ధతి నవలంబించేవాడు, తర్వాత తర్వాత "ఫలానివాణ్ణి పట్టుకురా, అదుగో వాడు, ఇదుగో వీడు" అనేవాడు. రాగారాగా రకం బకాయ చాలా కనిపించెనా ఇగ ఆనోటికే మొక్కాలి. కుక్కను మూతికి కట్టుకున్నట్టే కూసేవాడు.

యెట్టిమాదుగులూ, కావలికాళ్లూ, మచుకూరీలు, విరామంలేకుండా ఉరుకులాడుతున్నారు. కరిగట్లో నాగళ్లు గొట్టే వాళ్ళనూ, ఆమిదపుచేలలో అరకలు తోలేవాళ్లనూ, మోటలుగొట్టేవాళ్ళనూ, మొద్దులు గొట్టే వాళ్లనూ, ఇంకా చేనుకాడివాణ్ణీ, చెట్టుకాడివాణ్ణీ, చెట్టుమీదివాణ్ణీ, గుట్టమీది వాణ్ణీ, తాడు పేనేవాణ్ణీ, తలుగు పేనేవాణ్ణీ, అందరినీ యేపనిజేయనీయకుండా యెంటదగిలి రైతులను మసీదు ముందరికి కుప్పకూరుస్తున్నారు.

పట్టాదార్లకూ షిక్మీదార్లకూ, పట్టాదార్లకూ కౌలుదార్లకూ మధ్య గల తగాదాలను గ్రామకరణం పరిష్కారంచేస్తూ, యెవరెవరి తాకీడి రకం వారికి వేరువేరు కాయితాలమీద వేసి....“ఇది అస్సలు రకం - ఇదిలోకల్ ఫండు- ఇది బకాయబాబతు, జమాబంది కర్చులివీ, గిర్దావరు మామూళ్ళివీ- మొత్తం ఇంతా. దీనికి కద్దారు పెచ్చు ఇంతా”— అని ఒకరొకరి గుండెలు గుభిల్లు మనేటట్టు వినిపిస్తున్నాడు.

కరణంగారి పద్దులను తలుచుకుంటే, కట్టెపుస్తెలు గట్టించే వాని లానే కన్పిస్తున్నాడు. మాలిపటేలును చూస్తే కుక్కయి కూస్తున్నాడు. షావుకారిని మందలిస్తే, అడ్డికి శేరుప్రకారం ఇండ్లు ఊడిసేయించుకుంటు న్నాడు.... చాలామంది బీదరైతులకు ప్రాణం ప్రాణంలో లేదు. మనసు మనసులో లేదు. తలకాయలువంచీ నేలలు జూస్తూ పుల్లలు విరుస్తున్నారు.

మగదిక్కులేని ఆడపట్టాదార్లు కొందరు మాలిపటేలు బండ బూతులకు చెవులప్పగించి, నెత్తిగోకుకుంటూ, కాలివ్రేళ్ళ నేలరాస్తూ, మొకం బిండుకొని యేమితోచక గోడచాటుకు నిలబడ్డారు.

పట్టుకొచ్చేవాళ్ళను పట్టుకొస్తూనే వున్నారు. తెచ్చేవాళ్ళను తెస్తునే వున్నారు. చెల్లించేవాళ్లు చెల్లించి రశీదుబుక్కులపైన రాయించుకొని పోతు న్నారు. షావుకారి మిర్యాల పాపయ్య గూడా అక్కడే కూచున్నాడు. రెండుంపావులకాడికి యిప్పుడు జొన్నలూ, రెండుకాడికి వడ్లూ, రేక మూడుకాడికి అప్పటికి ఆమిదాలూ, ఒప్పదం చేసుకున్న ఆసాములరకం

వొప్పుకొని తనపేర జమాగట్టించి రసీదు లిప్పిస్తున్నాడు. వచ్చేవాళ్ళు వస్తున్నారు, పొయ్యేవాళ్ళు పోతున్నారు.

"ఉత్తరదిశాభి ముఖంగా సీతాన్వేషణకేగిన వానరమూకలా ఈ కోదండయ్యకోసం పోయిన యెట్టిగాళ్లు యేమైనట్టో ? పొయ్యిందేపోకడ ఒక్కడూ రావడంలేదు" అని పురాణఫక్కీలో వినిపించింది కళ్ళకు సులోచనాలు తగిలించుకుంటూన్న కరణంగారి ఉవాచ.

కిస్తును సాగనంపి పీడ వదిలించుకుందా మనుకుంటున్న పచేలుకు ఒకరొకరి జాప్యాయా, నిదానాయా, నిష్క్రమణాయా, చూస్తుంటే ఎత్తించే పీనుగును ఇంట్లో బెట్టుకున్నంత అసహ్యమేస్తుంది. పైగా కోదండయ్య విషయం స్ఫురించేసరికి కోపం యెక్కువైంది. కోదండయ్య దగ్గరిమట్టం. తల్లికి తమ్ముడనిపిస్తాడు. తనకు ప్రేలువిడిచిన మేనమామ. అయితే మాత్రం అతనేంజేస్తాడు ? సర్కారుహుకుం, రకం. ఆ పనిచేసే బాధ్యత గల వ్యక్తులు తల్లిచన్ను గోయమంటే కోయాలి.

పొద్దున్నే పొయ్యారు కావలికార్లు, యెట్టిగాళ్లు. కోదండయ్య పశువుల జప్తికి. ఆవులనూ, లేగలనూ కలెదోలుకొస్తున్నారు. మేకలదొడ్డి తడక తీస్తుంటే ఊడుగుజల్లల్లో ఉన్న కుడుపని మేకపిల్లలు ఉరుందొక్కుతూ 'బ్యా' అంటున్నయ్. దొడ్లోకివెళ్ళి యెడ్లనూ, దున్నపోతులనూ, పగ్గాలతో పట్టుకొంటున్నారు. బొల్లికోడెమాత్రం పగ్గం కొలికిని పణకు తగులనీయకుండా, ఈగలను దులుపుకుంటూ పశువులసందుకు ఈగిఈగి పోతుంది. ముఖానికి ముక్కులా దొడ్డికి అలంకారంగా అదొక్కటేవుంది· కోదండయ్యకు. అత్తగారిచ్చిన అరణం అవుది. ఆరుగురుమనుషులు చుట్టూ దొడ్డిగట్టి, పగ్గాల కొలుకులు తెరచి నుచ్చుకొడుతూ, పన్నాగంచేస్తుంటే బుస్సుమని యెలుగుపొదినుంచి లగుగొట్టి కంగున రంకెవేస్తూ కంచె మొగాన కాలులేపింది.

ఇక్కడ ఇంటిముందరి పాడిబర్రెను గూడా పట్టుకుపోవడానికి యిద్దరు యెట్టి మాదుగులొచ్చారు. గుంజకుకట్టిన బర్రెను విడిచి గుంజుతున్నారు. పెండకడి తీస్తున్న రంగమ్మ యేమీ అనలేక నిలువురాయిలా నిలుచుంది. తడకలోపల తంబానికి కట్టేసిన లేగదూడ చుట్టూ గంతులేస్తూ 'అంబా' అని చెవులు బిక్కరించి అరుస్తుంది. "దూడనన్నా కుడుపలేదు నాయినా, గడ్డిగరవని దూడ అరచిచస్తది" అని బాగమ్మ బావురుమంటుంటే బర్రెను తోలుకొనిపొయ్యారు యెట్టిగాళ్లు.



162



# హితోక్తి

❖

శ్రీ బూర్గుల రంగనాథరావు

జననం : 12—10—1917

చిరునామా : నారాయణగూడెము, హైదరాబాదు - ద.

కార్యకలాపాలు : ప్రభుత్వోద్యోగము.

అభిరుచి : సాహిత్యారాధన యిదివరకు - ఇప్పు డేమీ లేదు.

రచనలు : ముద్రితం : వాహ్యాళి (కథల పుస్తకం)

అముద్రితం : కథలు, వ్యాసాలు, రేడియో ప్రసంగాలు, నాటికలు.

అభిమాన రచయితలు : కవిత్రయం, షా, శ్రీ శ్రీ.

*

# హితోక్తి

క్షణమొక కల్పంవలె ప్రేమలత కోసం ఒళ్ళంతా కళ్లు చేసుకొని చూస్తూ కూర్చున్నాము శర్మ, మూర్తి, స్వామి, నేను. ....ఎవరా ప్రేమ లత ? ఎట్లా వుంటుంది ? ఎంత వయస్సు ? ఆమెతో యేమి మాట్లా డాలి ? ఆమె వెళ్ళిపోయిం తరువాత మాకు ఎట్లా అనిపిస్తుంది ? చివరికి యీ అనుభవాన్నంతా మరచిపోయి, యేమీ జరగనట్లు, యెవరు మెదిగిన దారిలో వారు యెట్లాపడాలి ? ఈ ప్రశ్నలన్నీ తలెత్తుతున్నాయి. ఏమాత్రం చీర పొలిపిరి కనపడ్డా, కొ_స్త గాజుల చప్పుడైనా, యించుక మాటల సవ్వడి అయినా, ఆమె వస్తూన్నదేమో అని, కిటికీలోనుంచి ఒకరు, డాబా మీదినుంచి ఒకరు, గుమ్మంలోనుంచోని ఒకరు నిరీక్షిస్తున్నాము....ఎన్నో బళ్ళు, రిక్షాలు—అందమైన ఆడవాళ్లు యెక్కినవి—వెళ్లుతున్నాయి. అందులో ఏ బండిలో, ఏ రిక్షాలో ఆ ప్రేమ....వస్తున్నదో యెట్లా తెలుసుకోవడం ? ఊరుకోలేక వీరయ్యా మాకు ఆమె పేరెందుకు చెప్పాలి ? యిదంతా మోసం కాదుగదా ! వీరయ్య ఆమెను తీసుకవస్తాడా ? అసలు మళ్లీ అతడు మాకు కనబడుతాడా ? ఇవే సందేహాలు........

అదిగో చేతిలో చిన్న సంచి వేలాడేసుకుని వయ్యార మొలికిస్తూ వస్తూన్నదెవరో ? ఆమే కాదుగద ?....చచ్చాం. ఆ బండకాళ్లు !! ఆ విసు ట్టాయి నడుము !!! ముందుకు వెళ్ళిపోయింది ! బ్రతికిపోయాం !!

ఈ నిరీక్షణ యెంతసేపు ? సాయంత్రం యేడుగంటల నుంచి ఎదురుచూస్తున్నాం. ఎనిమిదిన్నర అయినట్లు 'టంయి' మని హోటల్లోని గోడ గడియారం హాల్లో మోగింది. ఇహ లాభం లేదనుకున్నాము. "ఈపాటికి చాలు వెధవనిరీక్షణ! ఏ సినెమాకైనా వెళుదాం" అన్నాడు శర్మ.

"ఉండరా శర్మా! నీకు బొత్తిగా ఓపికలేదు" అని మూర్తి ఆక్షేపించాడు.

"సరీగ్గా లొమ్మిదింటికి బయల్దేరాం" అన్నాడు స్వామి, శర్మ, మూర్తి మధ్య సామరస్యం కుదిరించటానికన్నట్లు.

నేను శర్మను సవర్థిస్తూ వాకిట్లోకి వచ్చేశాను.

ఇంతలో ఒక రూపసి రిక్షాలోనుంచి దిగివచ్చి యెకాయెకి మేడ పైకి చూసింది. వెంట వీరయ్య కనపడ్డాడు. ఇంక అనుమాన మెందుకు? ఆమె ప్రేమలత.... వీరయ్య, ఆమె, నేను కలిసి మా గదిలోకి వెళ్ళాం. పరిచయాలయినాయి. వీరయ్య బయటికి వెళ్ళిపోయాడు.

ఆమెను నఖశిఖ పర్యంతం ఓ మారు తనివి దీరా చూశాము. మరి యింకో ఆడదానైతే ఇంత ధైర్యంగా చూడగలమా! అందులో ఆమె మా గదిలో ఆ రాత్రంతా మా స్థిరాస్తివలె పడివుంటుందని తెలుసుగాబట్టి అంతా శూరులమైనాము. పిల్ల పుట్టగానే యెన్నటికైనా చస్తుందిగదా అని ఏడ్చే కొందరు అడవిజాతుల వారివలె తెల్లవారిం తరువాత ప్రేమను యెట్లా వదిలివెళ్లడమా అని నాకు విచారం కలిగింది. కాని ఆ విచారం అట్టేసేపు వుండలేదు. భావాలు సుడిగాడ్పు వలె చెలరేగినాయి. శరీరం పట్టుతప్పింది. బుద్ధి విపరీతంగా పనిచేస్తున్నది. కుర్చీమీద కూర్చునిఉన్న ప్రేమను, యేదో ఒక చిన్న సాకుచేత నడిపించాలని నాకు విచిత్రమైన కోర్కె ఒకటి కలిగింది.... "ఆ కిటికీ తెరుస్తారా కొంచెం" అన్నాను ఆమెతో. ఆమె మాకు అధోముఖంగా నడుస్తుంటే బాగా పరిశీలించిచూడాలని. ఒకటి రెండు సార్లు నవ్వించాము. నేనూ మూర్తి తెలివితేటలు గమనించటానికి రెండు మూడు ప్రశ్నలు వేశాము. ఇక చాలుననిపించింది.... తృప్తి కలిగింది, ఆ మనిషికి యింకేమీ అక్కర లేదనుకున్నాను నేను. మళ్ళీ పరుగెత్తాయి ఊహలు.

మా అయిదుగురికీ భోజనంవచ్చింది. అంతా సిద్ధంచేసి ఆమె కూర్చునే కుర్చీని అన్ని కుర్చీల మధ్య అమర్చాము. ఉలకదు; పలకదు. వడ్డనలో సహాయం కూడా చేయలేదు. ఎంతో బలవంతం చేసి ఆమెతో రెండు మెతుకులు కొరికించే వరకు మా తాతలు దిగివచ్చారు.... నాకు వళ్లు మండింది యిదంతా చూచి. నా మట్టుకు నేను భోజనం ముగించుకుని టవెల్ భుజంపైన వేసుకుని సిగరెట్టు కాల్చుకుంటున్నాను. ఆమె కూడా భోజనం ముగించుకొని చేతులు కడుక్కుని బహుశః టవెల్‌కోసం యిటూ అటూ చూసింది. తక్కినవారంతా యింకా భోజనం చేస్తూనే వున్నారు, మా యిద్దరిని ఒక కంట కనిపెడుతూ, మరీ ఆ మూర్తి! వెధవ నవ్వూ వాడున్నూ !! నేను ఆమెకు టవెల్ యివ్వలేదు, యేమి చేస్తుందో చూదామనే ఉద్దేశంతో. కాని ఆమె నన్ను టవెల్ అడుగక తన కొంగుతో చేతులు తుడుచుకోగానే నేను మాడిపోయాను. ఆమె గమనించిందో లేదో కాని మిత్రబృందం కనిపెట్టింది.

'ఇదంతా మనకన్న ఓ ఆకు ఎక్కువ చదువుకున్న బాబతు' అనుకున్నాం మాలో మేము కళ్ళతోనే. శర్మకూ, ఆమెకూ కళ్లే కలియలేదు యింతవరకు. ఆమె మా ఒక్కొక్కరి మొహంకేసి చూస్తూ స్టడీ చేయసాగింది. 'ఎవరు పిలిపించా' రని అడిగినట్లనిపించింది మాకు. శర్మవైపు చూడగానే అతడు కళ్ళు త్రిప్పుకొని ప్రశ్నను తప్పుకున్నాడు. కళ్ళతో ఆమె అతడినే ఓడించిందో అతడు ఆమెనే ఓడించాడో తెలియదు కాని, మాతో శర్మ "నేను సినిమాకు వెళ్లుతున్నాను, నన్ను క్షమించండి" అని యింగ్లీషులో చెప్పి ప్రేమలత వైపు ఒక దొంగచూపైనా చూడకుండా వెళ్ళిపోయాడు. "నేను మాత్రం యేమీ అనుకోను" అని యించుక మందహాసంతో ప్రేమ అనేసరికి, మా మీద ఒక్కసారి మంచువర్షం కురిసినట్లనిపించింది. అంతవరకు ఆమెకు ఇంగ్లీషు అర్థమవుతుందనుకోలేదు మేము.

"ఇంకా నయం యింగ్లీషు రాదనుకుని మిమ్మల్ని తిట్టుకోలేదు మేము" అన్నాడు మూర్తి.

"నన్ను తిట్టడానికే పిలిపించారా ?" అంది ప్రేమ మూర్తి కళ్ళల్లోకి చూస్తూ.

"లేదు యేడ్పించడానికి" అన్నాడు స్వామి.

"మీ చేతుల్లో పడ్డాను ఏమైనా చేస్తారు. కాని చంపి వేయకుండా నన్ను మీరు యేమిచేసినా నాకు చాల బాధగా వుంటుంది " అంది ప్రేమ. ఏదో ఛలోక్తి జవాబు చెప్పిందనుకున్నాము. కాని ఈ మాటల గాంభీర్యాన్ని తరువాతగాని మేము తెలుసుకోలేదు.

"నేను త్వరగా వెళ్ళిపోవాలె. కాలహరణంచేయక నన్ను తొందరగా పంపివేయండి...." అన్నది ప్రేమ నా రిస్టువాచీవైపుచూస్తూ. ఆమె మాటలు ఒకదానికన్న ఒకటి విస్మయం కలిగిస్తున్నాయి. అయినా ఆమె మాటలు నాలో యేమాత్రం పరివర్తన కలిగించనట్లుగా, వేళ్ళసందున కాలిపోతున్న సిగరెట్టు వైపు చూస్తూ, "ఈ రాత్రి మేము ముగ్గురం మీ...." అని వాక్యాన్ని ముగించకముందే ప్రేమ కనుబొమలను పైకెగురవేసింది రెండు ధనుస్సులను ఒకమారే పైకి లాగినట్లు. ఆమె కళ్లు రాలిపోవడానికి సిద్ధంగావున్న నక్షత్రాలవలె కనుపడ్డాయి.

"మీతో కులాసాగా కాలక్షేపం చేయాలనుకున్నాం" అని నా వాక్యాన్ని పూర్తిచేశాను.

"మీరూ మేమూ యిలాగే కూర్చుందాము. మీవేళ అయిపోగానే మీరు వెళ్ళిపొండి....అంతవరకు మమ్మల్ని ఆనందింప (Entertain) చేయండి" అన్నాడు. స్వామి నా వాక్యానికి వ్యాఖ్యానం చేస్తున్నట్టుగా.

"నిస్సందేహంగా" అన్నట్టు మూర్తి కుర్చీ సవరించుకొని కూర్చున్నాడు. నేను సోఫామీద వాలి ఆమెను ఈజీచేర్లో కూర్చోమని బలవంత

పెట్టితే కూర్చుని "మీ ముగ్గురిదీ ఒకే వూరా ?" అని అడిగింది నావైపు చూస్తూ.

"ప్రస్తుతం ఒకే వూరు" అంటూ సిగరేటు కాలుస్తుందేమోనని యివ్వబోయాను. కాని యిదివరకు అభ్యాసం వుండి మానివేసినవారివలె నిర్లక్ష్యంగా వద్దన్నట్టు ఒక నమస్కారం చేసి-

"అయితే మీరేం చేస్తారు ?" అని అడిగింది. ప్రేమ యేదో వ్యవహారం మాట్లాడడానికి వచ్చిన ధోరణిలో.

"మేము రామనగర్‌లో చదుపుకోడానికి హాస్టలులో వున్నాము. రెండురోజులు శెలవులుంటే సరదాగా యీ ఊరు వచ్చాము సినిమాలు అవీ చూడవచ్చునని. కాని స్టేషన్ దగ్గరినుంచే మీ వీరయ్య మమ్మలను అనుసరించుకుంటూ హోటల్లోకి వచ్చి మేమెగది తీసుకున్నతర్వాత మా వాలకంచూసి మీ సంగతి చెప్పాడు. మిమ్మలను తీసుకొస్తానంటే 'సరే' అన్నాము. ఈ సరదాకూడా తీర్చుకుందామని నిశ్చయించి మీరు వచ్చారు.... వెళ్ళిపోతారు" అన్నాను నేను. "మేము పడుకుంటాముగా బాబు" అని స్వామీ మూర్తి, చాల నిద్రవస్తున్నట్టు, యీ ప్రసంగంతో తమకు సంబంధం లేనట్టు అన్నారు.

"దయచేసి నా సంగతి కొంచెం విని వెళ్లండి" అంది ప్రేమలత.

"పోనీ విని వెళ్ళండిరా" అన్నాను; ఈ ముక్క అనకపోతే బావుండదని. అంతే చాలుననుకొని యిద్దరూ మళ్ళీ తమ కుర్చీల్లో కూర్చుని సిగరెట్లు వెలిగించారు,

"అయితే వినండి నా స్వంతకథ చెబుతాను. కాని అది మిమ్మల ఆనందింపచేస్తుందో లేదో చెప్పలేను. పైగా విసుగుకలిగింపవచ్చు. మీకు ఆశాభంగం కలిగితే క్షమించండి. మీకు సంతోషమూ విచారమూ కాక, మీలో నేను అనుకున్న మార్పుకలిగితే ధన్యనౌతాను........" అని ప్రేమ యింకా చెప్పబోతూవుంటే,

"ఉపోద్ఘాతం అయింది. శలవిప్పించండి" అన్నాడు స్వామి చికాకుతో.

"నేను వుండేది శ్రీరంగపురంలో. అక్కడి మా వూరిలోకల్లా నేనే అందకత్తెనని మీలాంటివారు అనుకుంటూవుండేది కాబట్టి ఇతరుల కన్నా, పొట్టకోసం చేసే ఈ పాడువృత్తిలో నాకే యెక్కువ గిట్టుబాటవు తుండేది. ఒక నియమం ఒక పద్ధతి లేకుండా అవసరాన్నిబట్టి ధరను పెంచుతూ దించుతూ నా వృత్తిని సాగిస్తూవుంటిని. నా వృత్తిలో నాకు కుడిచేయివలె సహాయంచేసినవాడు మీరెరిగిన ఆ వీరయ్యే ఒకడు. బడిలో చదువుకున్న దానికన్న యింట్లో కృషిచేసి మీబోటివారి సహాయంతో కాస్త చదువు నేర్చుకున్నాను. పోషించడానికి నాకొక ముసలితల్లి, ఒక చిన్నబిడ్డ ఉండేది. ఈ వృత్తి చెడ్డదని తోచినా యెంతో విసుగూ కోపం కలిగినా, అందులో పడిపోయిన తర్వాత బాగుపడే మార్గం గోచరించక కొట్టుకు లాడుతుండేదాన్ని. నా బిడ్డకైనా విద్యాబుద్ధులు చెప్పించి పెద్దదైనాక పెళ్ళి చేయాలని అనుకున్నాను. కాని దైవసంకల్పం వేరేవిధంగా వుండింది!"

మేము మిత్రులంతా యీ సోదెవినాలా, విఘ్నం కలిగించాలా అని చూపులతో వితర్కించుకుని వేరే యింకేమి చేసే పనిలేనందున వినా లనే నిశ్చయించుకున్నాము కాబట్టి నేను 'ఊఁ' అన్నాను చాలా శ్రద్ధతో వింటున్నట్లు, ఆమె ఒక నిట్టూర్పువిడిచి మళ్ళీ ప్రారంభించింది.

"ఒకనాడు రాత్రి వర్షంలో తడుస్తూ వీరయ్య ఒక వ్యక్తిని పేరుతో యేంపని యేదో 'రావు' అట- మాయింటికి తీసుకవచ్చాడు. ఆతడు ఆ రాత్రి అక్కడేవుండి తెల్లవారకట్ల వెళ్ళిపోయాడు. మామూలుగా మరునాడే లతడిని మరచిపోయాను నేను. కాని నెలరోజుల తర్వాత రావు మరొక సారివచ్చి వెళ్ళాడు. అప్పుడూ నాకు ఆతడిమీద ప్రత్యేకంగా ఏ భావమూ కలుగలేదు. కాని అలవాటుపడుతాడేమో అనే ఆశతో కొంచం యెక్కువ చనువు కనబరచినాను....రావు వెళ్ళిపోయింతరువాత నాలుగైదురోజులకు

ఒహా ఉత్తరం వ్రాశాడు. ఆ ఉత్తరంచూసి నవ్వాలో యేడ్వాలెనో తెలియ లేదు. నన్ను పొగడుతూ ప్రేమవర్షం గుప్పిస్తూ వ్రాశాడు. నేను మాత్రం ఇదొకరకం 'పిచ్చి' అనుకుని ప్రత్యుత్తరం వ్రాయలేదు. కాని అతడిఉత్తరాల ప్రవాహం ఆగిపోలేదు. రిప్లయికవర్లు పంపిస్తూ జవాబు వ్రాయవలసిందిగా యెంతో ప్రాధేయపడుతూ కొన్ని ఉత్తరాలు వచ్చాయి! చివరకి విసిగెత్తి ఒక జవాబు వ్రాశాను నేనుకూడా. తనను చూడకుండా వుండలేననీ ఈ వియోగంవల్ల పరితపించిపోతున్నాననీ ఒకసారి తను మా యింటికి వచ్చి దర్శనంయిప్పిస్తే తనకూ నాకూ మనశ్శాంతి అవుతుందనీ వ్రాశాను. రావుమాత్రం యెందుచేతనో రాలేదు. ఉత్తరాలవర్షం కురిపిస్తూనే వున్నాడు. తన ఫోటో పంపించి నా ఫోటో ఒకటి పంపమని ఒక ఉత్తరంలో వ్రాస్తూ తాను నన్ను భరించలేననీ నావద్దికి డబ్బులేనిది రాదలచుకోలేదనీ కూడా వ్రాశాడు. ఈ సంగతి తెలుసుకున్న తరువాత ఆ అమాయికుడితో కలిగే ఆర్థిక లాభంలేదని తెలుసుకుని యెన్ని వుత్తరాలు వచ్చినా జవాబు వ్రాయలేదునేను. కాని రావు వద్దినుంచి ఉత్తరం వచ్చిన రోజల్లా ఏదో ఒక విధమైన జాలి అతడిమీద కలుగుతూ ఉండేది. ఇంతలో ప్లేగువల్ల మా అమ్మ చనిపోయింది, అయిదేళ్ళ నాకూతురు— ఒక్కగాను ఒక్క ముద్దుల బిడ్డ నిమోనియాతో...."

ఆమె యిహ చెప్పలేకపోయింది. కళ్లనీరు చెక్కిళ్ళ మీదనుంచి జారిపడకుండ ఆమెచేసిన వ్యర్థప్రయత్నం మా హృదయాలను కదలించింది. కొంగుతో కనుగొనల నద్దుకొని వాక్యాన్ని పూర్తిచేసింది.

"ఆ బిడ్డపోయింది. ఏకాకినై పోయాను. అప్పటినుంచి వీరయ్యే ఒక్కడే నాకు ప్రపంచంలో ఆప్తబంధువుడయ్యాడు! ఈ యిద్దరు చని పోయిన తరువాత వీరయ్య నావద్దవుండి నాకు అన్ని విధాల సహాయం చేసి ధైర్యం చెప్పకపోతే యీపాటికి యే భావిలోనో దూకి వాళ్ళతో పాటు నేనూ వెళ్ళిపోయేదాన్ని. ఆ అదృష్టం పట్టనివ్వలేదు వీరయ్య.

కొన్ని రోజుల తర్వాత నా మామూలు కార్యక్రమంలో నన్ను పడమనీ లేకపోతే నేనూ తానూ పస్తుండవలసి వస్తుందనీ జీవితంలో తిరిగి అభిరుచి కలిగించుకోవాలనీ వీరయ్య నాకు ఎంతో నచ్చ చెప్పాడు. ఇంక నేను సంపాదించకపోతే అతడు నన్ను పోషించజాలననికూడా చెప్పలేక చెప్పాడు. కాబట్టి విధిలేక ఒకటి రెండు పెద్దకేసులు పట్టుకొస్తే దుఃఖంతో కృశిస్తూకూడా ఒప్పుకోక తప్పిందికాదు. ఆ మహాశయుల విషయం తలుచుకుంటే యిప్పటికీ ఆశ్చర్యం కలుగుతుంది. వారి పెద్ద మోటరు కారు, విలువైన దుస్తులు, యాభైకి తక్కువకాని వయసు....రామరామ వయోవృద్ధులు కాబట్టే యే అల్లరీ కాకుండా నేను యేమీ అనందం వారికి యివ్వకున్నా ఒప్పుకున్నంత డబ్బు యిచ్చారు. ఏమీ తోచక ఒకోసారి పగలల్లా యేడ్చేదాన్ని....ఈ స్థితిలో ఒకనాడు మళ్లీ ఉత్తరం వచ్చింది రావు దగ్గరినుంచి. ఈసారి యెందుకో ఉత్తరం రాగానే చదువాలని బుద్ధి పుట్టింది. చదివాను. చదువగానే నాలో ఉద్భవించిన భావాలు, నాలో కలిగిన మనోవికారాలు నేను చెప్పజాల. క్లుప్తంగా ఏమి వ్రాశాడో చెబుతాను....తనకు అప్పుడు ఉండిన పెద్ద ఉద్యోగం పోయిందనీ, ఇప్పుడు ఓ ప్రైవేటు కంపెనీలో ఈ వూళ్ళో పనిచేస్తున్నాననీ, నేను తనవద్దికి వస్తే నన్ను యెప్పటికీ తనదానినిగా స్వీకరిస్తాననీ, నన్ను నా పూర్వపు జీవితాన్నంతా మరచిపోయి క్రొత్తదారిలో పడమనీ, కొంచెం ఆర్థికంగా కష్టమైనా తనవద్దికి వచ్చేస్తే యిద్దరమూ సంతృప్తికరంగా గౌరవంగా జీవించవచ్చుననీ వ్రాశాడు.... ఇంతకన్నా నాకు కావలసిందేమి ? నేను ఎంతో సంతోషించి వెంటనే వచ్చేస్తున్నానని ఉత్తరం వ్రాసేసి వీరయ్యతో బయలుదేరి పదిహేను రోజుల క్రితం ఈ ఊరు వచ్చాను. స్టేషనుకు రావు వచ్చి కలుసుకొన్నాడు కాని నన్ను తన యింటికి తీసుకవెళ్ళక ఒక హోటల్లో దింపాడు. అయినా ఎప్పుడూ అతడు నాతోనే హోటల్లో కాలక్షేపం చేస్తూ ఉండేవాడు. మొదలు కొన్ని

రోజులు ఎన్నిరకాల పట్టణపుజీవితపు సౌఖ్యానుభవాలు వుంటాయో అన్నీ అనుభవించాము. అదంతా అప్పుడే ఒక స్వప్నంవలె అనిపిస్తున్నది.

ఓ వారంరోజుల తర్వాత ఒకనాడు వున్నట్టువుండి రావులో మార్పు కనపడ్డది. సరిగా హోటలుకు రావడం మానేశాడు. వచ్చినా సరిగా మాట్లాడక యెప్పుడూ యేదో పరధ్యాన్నంలో వుంటూవుండేవారు. మొదటి వారంలో ఆ కట్టతెగిన ఆనంద ప్రవాహంలో పడిపోయి ముందుగతి నేను మనస్సులో యోచించుకున్నా, రావుతో మాత్రం పైకి యేమీ అనజాల లేను. కాని యీమార్పు వచ్చింతరువాత ఒకనాడు హోటల్లో కాఫీ తాగుతూ కూర్చున్నప్పుడు తన యింటికి యెప్పుడు తీసుకపోతావనీ, హోటల్లో బోలెడంత ఖర్చుపెడుతూ యిలా దొంగతనంగా యెన్నాళ్ళు వుండాలనీ అడిగాను. అతడు జవాబు చెప్పడానికి సంకోచించాడు. నేను పట్టుపట్టి నాను. ఉత్తరంలో తను చేసిన వాగ్దానాన్ని పూర్తిచేయమని ప్రాధేయ పడ్డాను. కాని రావు కుండ బ్రద్దలుకొట్టినట్లు యిట్లా అన్నాడు.

"ఇన్ని రోజులూ నీతో ఈ విషయం దాచినందుకు సిగ్గు పడుతు న్నాను. మా యింట్లో నా భార్యేకాక ముగ్గురు పిల్లలు, మా అమ్మకూడా వున్నారు. నిజం చెప్పాలంటే నీవు వచ్చిన అయిదారు రోజులకే నేనేమి చేస్తున్నానో యెందుకు చేస్తున్నానో అని మనసులో విచారణ ప్రారంభ మైంది. ఒక విధమైన విసుగు, విరక్తి కలిగిందని చెప్పితే క్షమించాలి నువ్వు. అన్ని వింతవింత ఉత్తరాలు నీకు యెట్లా రాశానా అని యిప్పు డనిపిస్తున్నది. అసలు మొదటి పరిచయం తరువాతే తనివిదీర నీతో అనుభవించి వుంటే ఈ వ్యామోహం అట్లా పెరిగి ఇట్లా విరిగేదికాదు. కాని ఉద్యోగ కారణంగా అప్పుడు నేననుకున్నప్పుడల్లా మీ ఊరు రావడా నికి వీలుకాలేదు. కాబట్టి నిన్నేరమ్మని వ్రాశాను. అసలు నా బదిలీఅయ్యింది

మళ్ళీ మా ఊరికి. అప్పుడు నేను పూర్తిగా పిచ్చివాణ్ణయిపోయాను.... ఇప్పుడు నన్ను క్షమించు; నన్ను మరచిపో. నిన్ను నేను మరచిపోతాను. నేను రేపే మా ఊరు వెళ్లాలి. అక్కడికి నిన్ను తీసుకెళ్లజాల. ఈ నెల అయిందాకా నీవు యిక్కడ వుండొచ్చు; తరువాత మీవూరు వెళ్ళిపో.... నిన్ను భరించేదానికి డబ్బుగూడా లేదు."

నేనేమి అనలేదు. తలవంచుక కూర్చున్నాను. ఆ మనిషి మీద చెప్పరాని విముఖత కలిగింది. "వెళ్ళిపోతాను" అని మాత్రం అనజాలి నాను. రావు ఒక నూరు రూపాయల నోటు యివ్వవస్తే తీసుకోలేదు. ఆ రోజు రావు వెళ్ళిపోయింది మొదలు మళ్ళీ కనపడలేదు. ఇహ ఆయన ఆశ వదలుకున్నాను.... జీవితంపైన.... అసహ్యం కూడా కలిగింది.... "నా తోవ నేను చూసుకుంటాను. నేనెక్కడైనా వెళ్లుతాను నీవు ఊరికి వెళ్ళిపో"మ్మని వీరయ్యకు గట్టిగా చెప్పితే అతడువెళ్లక నన్నుయిక్కడే మళ్లీ ఆ పాడువృత్తి నడుపుమని బలవంతపెట్టాడు. నేనుమాత్రం ఆవృత్తికి స్వస్తిచెప్పినానని గట్టిగా చెప్పాను వీరయ్యకు. వీరయ్యకు తెలియకుండా యెక్కడికైనా వెళ్ళిపోదామని నిశ్చయించుకున్నాను.

కాని ఈరోజు సాయంత్రం రాముకువచ్చి మీరిట్లావచ్చి హోటల్లో వున్నారనీ అరవై రూపాయలు యివ్వ సిద్ధంగా ఉన్నారనీ నన్ను తీసుక వస్తానని మీకు మాట ఇచ్చాననీకూడా వీరయ్య అన్నాడు. మళ్ళీ నాయొక్క యీ ప్రసంగం ఎత్తినందుకు యింకొకరినైతే తిట్టి వెళ్ళగొట్టివుందును. కాని సావధానంగా వీరయ్యకు నచ్చజెప్పాను. 'రాను' అన్నాను. కాని అతడు "నిన్ను సరిగా తెలుసుకోక ఈ పనిచేశాను. యీ ఒక్కమారు యెలాగైనా ఒప్పుకో. తరువాత ఊరికి వెళ్ళిపోతాను. నాయీ ఆఖరుమాట దక్కించు" అని చాలా బ్రతిమాలాడు. నాకు కూడా చేతిలో కొంతడబ్బు

కావాలిగదా ఈ ఊరినుంచి యెక్కడైనా దూరంవెళ్ళడానికి! వెళ్ళిపోతూ ఆనాడు రావు నూరు రూపాయలు ఇవ్వవస్తే తీసుకోలేను. కాబట్టి వీరయ్య నాకు చిన్నప్పటినుంచి చేసిన ఉపకారాన్ని తలుచుకుని ఆఖరుసారికని మీ వద్దకి రావడానికి ఒప్పుకున్నాను. నన్నూ వీరయ్యనూ మీరు క్షమించాలి. మీరు నన్ను అపార్థం చేసుకోవద్దు. మీకు నేను బుద్ధి చెప్పవలసిందాన్ని కాను. కాని మీరు కాస్త డబ్బుగల విద్యార్థులయినందుకు మీ డబ్బును ఈ విధంగా పాడుచేయకండి. మీకు డబ్బు అంత యెక్కువగా ఉంటే యేదైనా మంచిపనులకు వినియోగించండి. నాకు ఓ యిరవై రూపాయలు, వీరయ్యకు ఓ పదిరూపాలు రైలు టిక్కట్ల కొరకు దానం చేస్తే చాలు....మీలాంటి విద్యార్థులు చాలామంది యేవేవో పార్టీల్లో చేరి పనులు చేస్తూంటే మీరిట్లా మీ కాలాన్ని డబ్బును నాలాంటివారి మీద కర్చు పెట్టడం నాకు విచారం కలిగిస్తున్నది...."

"మా విషయం అట్లా వుంచి మీ కథ కానివ్వండి" అన్నాడు స్వామి. "కథ యింకేమున్నది? వీరయ్య నన్ను వదలడు. యెప్పటికప్పుడే యేదోచెప్పి నన్ను వెంటాడుతాడు. నేను వీరయ్యకు చెప్పకుండా యెక్కడికైనా వెళ్ళిపోతాను. దీనికి మీరు చేతనైతే సహాయం చెయ్యండి."

"ఎక్కడ వెళ్లుతారు! మీకు యెన్ని మంచి ఉద్దేశాలున్నా మీ వయసు, మీ అందం మీకొక విఘ్నంగా పరిణమించవచ్చు. మద్రాసు వెళ్ళండి. అక్కడ సేవాసదనంలో నా బంధు వొకామె ఉపాధ్యాయినిగా ఉంది. అక్కడ మీరు చదువుకుంటూనే యేదైనా వృత్తి నేర్చుకోవచ్చు. నే నామెకు ఉత్తరం యిస్తాను, మీరంగీకరిస్తే" అన్నాను నేను.

"అట్లాగే చేస్తే మీకు పుణ్యం వుంటుంది; తప్పకుండా వెడతాను" అంది ప్రేమలత. నేను వెంటనే ఉత్తరం వ్రాసి యిచ్చాను.

శర్మకూడా యింతలో వచ్చాడు సినెమానుంచి. మేము ఆమెను రెండుగంటల బండిలో మద్రాసుకుపంపించడానికి స్టేషనుకు వెళ్లదామనుకున్నాము. కొంతసేపు మాలో మేము తర్కించుకుని...." నీవూ మూర్తి, శర్మ ఆమెను తీసుకుని స్టేషనుకు వెళ్ళండి. నేను వీరయ్యకి కాస్త నచ్చజెప్పి అతడికేదో యిచ్చేసి వస్తాను. మన బెడ్డింగులుకూడా కట్టండి. మన ట్రేన్ నాలుగుగంటలకు కాబట్టి ఆమెను పంపించి మన ట్రేన్‌లో మనం వెళ్ళిపోదాం" అన్నాడు స్వామి. "ప్రేమలత చెప్పిన హితోక్తి బాగా తలకెక్కిందన్నమాట...." అన్నాను నేను.



# దేశోద్ధారక గ్రంథమాల

ఆంధ్ర సోదరులకు అవసర గ్రంథముల నందించు ఆశయముతో బహుధాన్య (౧౯౩౮) సంవత్సరంలో కీ.శే. దేశోద్ధారక, విశ్వదాత, కళా ప్రపూర్ణ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి స్మారక చిహ్నముగా స్థాపింపబడిన ఈ గ్రంథమాలద్వారా లోగా ౧౨ ప్రచురణములు దేశీయుల కందజేసినాము. ఆ రోజుల్లో *విజ్ఞానము నిచ్చి, స్వాభిమానమును పురి కొల్పి, సత్వర కర్తవ్యమును తెలుపు గ్రంథములను ప్రచురించి దేశభక్తుల యొక్కయు, మేధావంతులయొక్కయు మన్ననలను పొందినాము.* పిమ్మట మొత్తము భారతదేశముతోపాటు హైద్రాబాదులో యేర్పడిన రాజకీయ అసాధారణ పరిస్థితులలో గ్రంథమాల ౧౯౪౨ లో ఆగిపోయింది. ౧౦ సంవత్సరముల తర్వాత కొంత స్థిమితము కలిగి, తిరిగి గ్రంథ ప్రచురణకు పూనుకొను అవకాశము కలిగింది. *గ్రంథమాల స్థాపన కాలములో మాముందుండిన కర్తవ్యము నేటివరకు తీరలేదని భావిస్తున్నాము.*

'మనిషి యే పంథా నవలంబించవలయునో అని ఆలోచించుటకు ముందు వివిధ పంథాలను తెలిసికొనుట ముఖ్యము'. కాబట్టి మేము ప్రచురించు ప్రతి గ్రంథము దేశీయుల ఆకాంక్షలను, హక్కులను, బాధ్యతలను దృష్టియందుంచుకొని, కర్తవ్యములను సూచించునదిగా నుండును.

ఇట్టి మా కృషికి చేయూతనిచ్చి మా ఆశయ సఫలతకు దేశీయులు మమ్ము ప్రోత్సహించెదరని విశ్వసిస్తూ, విజ్ఞులగువారి సర్వసహాయాలపై మాత్రమే ఈ మా వ్యవస్థను నిర్వహించ గలుగుదుమని విన్నవిస్తున్నాము.

పది రూపాయలకు తక్కువకాని విరాళమును మీ నుండి అభ్యర్థిస్తున్నాము. రూపాయకు రెండు అణాల హెచ్చింపు ప్రకారం మీకు గ్రంథాలు క్రమంగా అందించెదము.

3-5-1027
నారాయణగూడ
హైదరాబాదు

ఇట్లు విన్నవించు
వట్టికోట ఆళ్వారుస్వామి
స్థాపకుడు, ప్రకాశకుడు

2

# ప్రశంసలు

"ఈ గ్రంథమాలరూపమున తమరు చేయుచున్న ఆంధ్రభాషా సేవ ప్రశంసనీయమై యున్నది."

—ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు

"ఆంధ్రుల విజ్ఞానాభివృద్ధికి శ్రమించునట్టి వీరి గ్రంథమాలను అందరూ ఆదరించి తమ విధిని నెరవేర్చ వలసియుండును".

—కీ. శే. సురవరము ప్రతాపరెడ్డి

"దేశోద్ధారక గ్రంథమాలను స్థాపించి ఆంధ్రదేశమునకు గొప్ప భాషాసేవ చేసిన దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారిని చిరస్మరణీయులుగా చేసియున్నారు".

—శ్రీ కొండా వెంకట రంగారెడ్డి

"దేశీయులందరు గ్రంథమాలయొక్క ప్రచురణములను పొంది ఈ కార్యమును జయప్రదముగ నిర్వహించుటలో సహాయపడుదురని ఆశించుచున్నాను."

—శ్రీ మందుముల రామచంద్రరావు

"ప్రతి పుస్తకము ఆకర్షవంతముగను, ఉపయోగకరముగను ఉన్నది.... మీ గ్రంథమాల ఆంధ్రదేశమున కమూల్యమగు సేవచేయుచున్న దనుటలో నెట్టి యతిశయోక్తిలేదు."

—శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు

"ప్రజలకు వినోదం కలిగించడంవల్ల గ్రంథమాలను అభివృద్ధి చేసుకొనే దృషి ప్రకాశకులకు లేదు. 'ప్రజలకు ఈ దినాలలో అత్యావశ్యకమయిన విజ్ఞానం కలిగించాలి' అన్న దృఢ సంకల్పం ప్రతి ప్రచురణమునందు ప్రస్ఫుటంగా కనబడుతూ ఉంది."

—కాగడా 10-2-1940

# లోగా ప్రచురించినవి

1. హైందవ ధర్మవీరులు (హైందవధర్మ పోలీలు)
—శ్రీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారు
2. ప్రాథమిక స్వత్వములు
—శ్రీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారు
3. 4. కమాల్‌పాషా జీవితము (రెండు భాగములు)
—శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరము
5. బౌంధు సంస్థానము
—శ్రీ పులిగడ్డ వెంకటసుబ్బారావు
6. ప్రజలు - ప్రభుత్వము
—శ్రీ కౌంట్‌ లియో టాల్‌స్టాయ్
7. గ్రంథాలయోద్యమము
—శ్రీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారు
8. కాంగ్రెసు - సంస్థానాలు
—శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్య
9. సంస్థాన సమస్యలు
—శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్య
10. 'నా భారతదేశ యాత్ర'
—హెచ్. ఎన్. బ్రెయిల్స్‌ఫర్డ్
11. 12. గాంధీ మహాత్ముడు (రెండు భాగములు)
—'విష్ణుచక్రం'

4

# 13. జైలులోపల (కథానికలు)

రచయిత: శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి

వెల: ఇతరులకు 0-10-0 సభ్యులకు 0-9-3

"క్రొత్తజాతికథలు మీరు తెలుగులో సృష్టిస్తున్నారు........కథలు హృదయవిదారకంగా ఉన్నవి. పడమటి దేశాల్లో ఇట్టి వాఙ్మయసృష్టి సంస్కారణాలకి దారితీసేది. మన దేశంలో ఆలనా పాలనా లేదు."

— శ్రీ చింతా దీక్షితులు

"యిలాంటి కథావస్తువులు యింతవరకు యెవరూ తీసుకోలేదనే నా అభిప్రాయం. ఈ వస్తునిర్ణయంలోనే మీరు నవ్యమార్గం అనుసరించి, సామాజికంగా చచ్చినవాండ్లతో సమానమని నిర్ణయించబడ్డ ఖైదీల జీవితాలు ఈ విషసమాజచరిత్రకు స్మృతిచిహ్నాలుగా పనికి వస్తాయని చక్కగా నిరూపించారు." — శ్రీ ధరణికోట శ్రీనివాసులు

"జైలుసంస్కర్తలు గ్రహించాల్సిన విషయాలు బలంగా ప్రతిపాదించబడడం గమనార్హం. నేరస్థులు వస్తుతః నేరస్థులుకారు. వారు పరిస్థితులకు లొంగిపోయి నేరస్థులు కావించబడ్డారన్న అభిప్రాయం ప్రతి రచనా కలిగిస్తుంది." — గోలకొండ పత్రిక

"........ఇవి ఉన్నసమస్యల వాస్తవికతను, మానవ స్వభావములను, పరిస్థితుల సత్యస్వరూపమును అతిసహజముగ హృదయంగమముగ తెలుపుచున్నవి, ఇవి రచయితకు గల సంస్కారమును, భావోద్వేగమును వెల్లడించుచున్నవి." — సుజాత

"... ....దైనందిన జీవితంలో మనం చూచే సాధారణఘట్టాలనే కథగా తీసుకొని సాధారణం అనుకునేటట్టు గాక ఉత్తమంగా సృష్టించారు. ........ఆళ్వారుసామిగారు తమ జైలు జీవితానుభవంలోంచి కొన్ని అమూల్య విషయాలను ముచ్చటైన పుస్తకంద్వారా అందజేసినందులకు అభినందనీయులు." — స్రవంతి

5

# 14. నా గొడవ (గేయాలు)

*రచయిత : శ్రీ కాళోజీ నారాయణరావు*

వెల : ఇతరులకు 1-8-0 సభ్యులకు 1-5-0

"కాళోజీ నిఖిలాంధ్రకవి.........ఆయన తన ఖండకావ్య సంపుటానికి 'నాగొడవ' అనిపేరు పెట్టారు....కాని ఇది విశాలజగత్తు ప్రజలందరి గొడవ. ఇది మనం మననం చేసుకోవాల్సిన పుస్తకం. యుద్ధంలో పాల్గొన్న కవులంతా చెల్లాచెదురుగా పారిపోతే లూయీ ఆరగాన్ ఒక్కడే దేశంలోనిలబడి మహావిశ్వాసాన్ని వెల్లడించే గీతాలు వ్రాశాడు. కాళోజీ లూయీ ఆరగాన్‌వంటివాడు."

—శ్రీ శ్రీ

"కాళోజీ కవిత్వం సమాజానికి హెచ్చరిక వంటిది....వేమనకూ ఈయనకూ రేఖామాత్రంగా వ్యత్యాసం ఉందేమో గాని అతను చెప్పడానికి వీలుగానివి కాళోజీ చెప్పంది తప్పలేదు. ఆడంబరంలేని, అలంకారాల ఆరభటిలేని నిసర్గమైన కృతి కాళోజీ కావ్య సంపుటి......... వ్యంగ్యాత్మక విమర్శాయుత హాసగీతికలు రచించి కాళోజీ కవితాజగత్తులో క్రొత్తవిప్లవాన్ని కలిగించాడు."

—శ్రీ దాశరథి

"ఈ కవి రచనలో అంతటా ఒక విశిష్టమైన ప్రత్యేక వ్యక్తిత్వం సుస్పష్టంగా కనిపిస్తున్నది....కాళోజీవారిపేరు. 'నాగొడవ' పఠిస్తున్నప్పుడు మనమొక్క వినూతనమైన అనుభూతి ప్రపంచములోకి వెళ్ళిపోతాము...., ఈయనలోగల సత్యాన్వేషణదృష్టి సంకుచితమైన రాజకీయ నినాదాలకు తాత్కాలికమైన అలజడులకు అతీతమైన కాలావధులనుదాటి నినూక్తి

ధోరణిలో వినబడుతూంటుంది. నేటికాలపు కవితాపరిణతి అవగాహన చేసుకోదలచిన భావుకులందరు తప్పకుండా చదువ వలసిన ఖండకావ్య సంపుటి."

—భారతి

"……………… ఈ సంపుటిలో ప్రతి గీతం ఒక పరమ సత్యం. ఆ "సత్యం"కల్పనా కథలకంటె చిత్రమైంది కాదూ ? తెలంగాణా ప్రజల కన్నీటిలో ఎన్నెన్నికలలు కలవో చూడతలచినవారికి కాళోజీగారి 'నాగొడవ' కనువిప్పు."

—కిన్నెర

# 15. ఉదయ ఘంటలు

( 56 అఖిలాంధ్రకవుల గేయసంపుటి )

వెల : ఇతరులకు 2-4-0 సభ్యులకు 1-15-6

"……..ఈ సంకలనంలో ఇంతకు పూర్వం అజ్ఞాతంగా ఉండి పోయిన ఉత్తమ ఖండకృతులెన్నో సేకరించి ప్రకటించారు. పేరుపొందిన రచయితల రచనలలోనించికూడా ఈలాంటి కృతులే సేకరించడంవల్ల ఈ సంకలనానికి కీవిషయంలో ఒక ప్రత్యేకత వచ్చింది. ఇది ఆధునిక కవితాభిమాను లందరు తప్పకుండా పరిశీలింప వలసిన సంపుటి."

—ఆంధ్ర పత్రిక

"ఇప్పుడు ఆంధ్ర దేశంలో అనేక తరహాల కవిత్వం ఆవిర్భవిస్తున్నప్పటికీ అందులో ప్రధాన ప్రవాహం అభ్యుదయ సాహిత్యం. దీనికికారణం దినదిన ప్రవర్ధమానమౌతున్న సామాజిక చైతన్యమూ, ప్రజాజీవితమూ దీనిలో వెల్లివిరియడమే. ఇలాగ వెల్లివిరిసిన అఖిలాంధ్ర

కవులగీతికా సంపుటి "ఉదయఘంటలు." ........ అనేకకవుల చక్కని గీతాలు యిందులో ప్రచురితమైనాయి. ........సంపాదకుల, ప్రచురణ కర్తల కృషి కొనియాడతగింది."

—విశాలాంధ్ర

"........నవ్యకవితోద్యమంలో పాల్గొన్న వారి రచనలను ఏర్చి కూర్చి. ........ఒక్క సంపుటిలో అందించినందుకు అభినందనీయులు. ....ఆధునిక ఆంధ్ర రచనావిధానంలో వచ్చిన మార్పుయొక్క సమగ్ర స్వరూపాన్ని తెలిసికోవాలంటే ఈ గ్రంథం చాలావరకు సహాయ పడుతుంది."

—బృందావని

"........సానలుతీరి పక్షపక్షాన రంగురంగుల రోచిస్సులు విర జిమ్మే మణిలా కలరవాలను కురిపిస్తూ, వంపువంపునా కర్పూరకాంతులీనే కపోత కంఠంలా, వివిధ సౌరభాలను, వెలార్చే కదంబ ప్రసూనమాలలా, రంగు, రుచి, వాసనల. సౌరుతీరులు గల అపురూపపు "ఉదయఘంటలు" నిదాదతరంగాలు అనవరతం మనశ్రవణ మనోమస్తిష్క ఫలకాలను తాకు తూనే వుంటాయనడం అత్యుక్తికాదు."

—ఆంధ్ర ప్రభ

"ఈ సంకలనంలో యావదాంధ్ర కవులు సమిష్టిగా ఏకముఖాన మనకు మేల్కొలుపు పాడుతున్నారు. ఇవి ఉదయ ఘంటలు ........ఇవి హృదయ ఘంటలు............మనకావ్య సాహిత్యంలోని విశిష్టభాగాలతో ఒక్క "తెలుగు ఎంథాలజీ" కూడా రాలేదని నిరుత్సాహపడుతున్న ఈనాడు కనీసం గేయసాహిత్యంలోని మచ్చు రచనలతోనైనా ఈసంపుటి వెలువడడం ఆంధ్ర సాహిత్యానికి ఒక అభ్యుదయమేనని దీనిని పరిశీలిం చిన వారు అంగీకరించుతారు."

—స్రవంతి

"………కేవలము జీవితోత్సాహమూ, సౌందర్య సంచిన్హనమూ మాత్రముగాక, పీడితసోదరబాధానుకంపనమూ, నిత్యనూతన చైతన్య కల్పిత చిత్రసృష్టి………"ఉదయ ఘంటలు" దారిలోనే మోగుతాయి. ………ఈ సంపుటము నిండా బ్రతికివున్న వ్యావహారికంలోనే తళుక్కు-మన్నాయి భావాలు. ………భావవిప్లవానికి "ఉదయ ఘంటలు"లో ఆట విడుపు. "మాడుపొట్టతోడ నీవు గాడిద చాకిరి చేయగ తోకవూపి, మూతి నాకు తుచ్ఛులకే వైభవాలు."

—అనీ పుట్టకీట్లుకదిల్చే భావాలు "ఉదయఘంటలు"లో ఎన్నైనాకలవు."

—కిన్నెర

"ఈ ఆధునిక ఖండకావ్య సంపుటి పురోగమిస్తున్న నవ్యాంధ్ర సాహిత్య పోకడలను ప్రస్ఫుటింప జేస్తున్నది. ఇందులో………దేశీయ సాంఘిక సమస్యలు, ఆర్థికసమస్యా లోపాలు, ప్రపంచ క్లిష్టపరిస్థితులు, పీడితమానవ సంఘటనలును యితివృత్తముగాగలవి. ………చక్కని ముద్రణ, తయారీలతో ఆకర్షణీయంగా తయారైన యీ గ్రంథము ముద్దులు మూటగట్టుచు ఉత్సాహానందముల ప్రేరేపించుచున్నది."

—గృహలక్ష్మి

ఈ సంవత్సరం—చిరకాలంతర్వాత కవితా సంపుటాలు వచ్చాయి. అందులో ఉత్తమమైనది వేసినగౌరవం తెలంగాణావారికే దక్కింది. అఖిలాంధ్ర కవుల రచనలతో కూడిన "ఉదయ ఘంటలు" ఒక గొప్ప కృషి అని చెప్పకతీరదు."

—శ్రీవాత్సవ

# 16. ప్రజల మనిషి (తెలంగాణా నవల)

రచన: శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి

వెల : ఇతరులకు రు. 2-8-0 సభ్యులకు రు. 2-3-0

"1938 కి పూర్వమున్న తెలంగాణా గ్రామ జీవితంలోని వేర్వేరు వర్గాలను, వ్యక్తులను వారి సమస్యలను, జీవిత విధానాన్ని ఆళ్వారుస్వామి గారు కళ్ళకు కట్టినట్లు చిత్రించి కృతకృత్యులైనారు.........తెలంగాణా ప్రజా జీవితాన్ని కళ్ళకు గట్టినట్లు వర్ణించే నవలలు బహుకొద్ది. వానిలో యిది నిస్సందేహంగా ప్రధాన స్థాన మాక్రమిస్తుంది."

— విశాలాంధ్ర.

"....ఈనాడు ప్రజాస్వామ్యం, స్వాతంత్ర్యం, జాతీయత స్వేచ్ఛగా అనుభవిస్తున్న ప్రజలకి ఆనాడు తెలంగాణా ప్రజలు పడిన బాధలు తెలియవు. ఈ నవల చదివితేమాత్రం ప్రతిపుటలోను తెలంగాణా హృదయం స్పందిస్తూ ఉన్నట్లు, భరించిన అవమానాల పరంపరతో పరాజయం పొందినాగాని పట్టుదలతో నిలచిన ప్రజలమనిషి పలుకరిస్తున్నట్టు కనిపిస్తుంది. "ప్రజల మనిషి" తెలుగు సాహిత్యంలో ఉత్తమశ్రేణికి చెందతగిన మరొకనవల."

—"శ్రీవాత్సవ" తెలుగు స్వతంత్ర.

"ఈ కథ పనికట్టుకు అల్లినట్లు ఎక్కడా అనిపించదు. నలిగిపోయిన రైతుల పాలేళ్ళ బాగోగులు వాళ్ళభాషలోనే, వాళ్ళచేతనే రచయిత చెప్పించాడు. దీనివల్ల వాస్తవికత చక్కగా పోషించబడింది..... మితిమీరిన భావోద్వేగాన్ని చూపించడానికికూడా రచయిత ప్రయత్నించలేదు. కృత్రిమ సన్నివేశాలున్ను సృష్టించ లేదు."

—ఆంధ్ర పత్రిక.

"తెలంగాణా మనగుండెకాయ. రాజకీయంగా ఆ ప్రాంతపు కోటి మంది మన సోదరులు విడిగావున్న మన కండలో కండ, రక్తంలో రక్తం. కాని పెక్కు కారణాలవల్ల మన ఈ కండల సంగతి మనం తెలుసుకోలేక పోతున్నాం. ఈ ఆత్మబోధ కలిగించి తెలంగాణా తీరు తియ్యాలను సమగ్రంగా మన కట్టెదుట పెట్టే ఉత్తమ నవల "ప్రజల మనిషి"....తెలంగాణా విమోచనోద్యమంలోని అనేక ఘట్టాలు ఈ నవలలో చక్కగా వివరించ బడినవి. తెలంగాణా నిత్యజీవితానికి మచ్చుతునకలైన పాత్రలు యిందులో కలవు ...అస్వతంత్ర తెలంగాణా సంఘ జీవితాన్ని ప్రతిబింబింపచేసిన ఈ ఉద్గ్రంథం ప్రతి గృహాన్ని, గ్రంథాలయాన్ని అలంకరించ గలదు."

—ఆంధ్ర ప్రభ.

"అందరికీ అభిరుచి కలిగించేటట్టు రాజకీయ వాతావరణంలో నవల వ్రాయడం అంత సులభం కాదు....రాజకీయాలగురించి వ్రాస్తూ ఉన్నప్పటికి ఏ పక్షాన్నీ బలపరచకుండా ఆయాసంస్థల వైఖరులు తేటపరుస్తూ కథ వ్రాయడం కష్టం. ఈ నవల రచించిన వారు కష్టసాధ్యమైన ఈ పనిని జయప్రదంగా నిర్వహించారు....తెలుగు సాహిత్యంలో కలకాలం నిలిచే నవల వ్రాసిన కొద్దిమందిలో—ఆళ్వారుస్వామిగారొకరైనారు. ఈ నవల చదవలసిన విధి ప్రతి సాహిత్య ప్రియుడి మీదను ఉన్నది."

—స్రవంతి.

"నేటి హైదరాబాదు చరిత్ర వెనుక పుటలు తిరుగవేస్తే హృదయ విదారకమైన ఎన్నో సంఘటనలు గోచరమౌతాయ్. చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించ వలసిన 'ప్రజల మనుషు'లైన వ్యక్తులు ఎందరో గోచరమవుతారు. 'ప్రజల మనిషి' అనే యీ నవల ఆ పరిస్థితులనూ, ఆ వ్యక్తులనూ, వారి చర్యలనూ, చాలా యథార్థంగా, హృదయంగమంగా చిత్రించిన ఉత్తమశ్రేణి సాహిత్య సృష్టి....చెత్త శృంగారానికిగాని, స్టంటులకు

గాని తాపీయక యథార్థవిషయాలను ఆధారంగా తీసుకొని ప్రబోధాత్మకమైన చక్కని నవలను సృష్టించిన శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామిగారు నిజంగా అభివందనీయులు."

—గుండుసూది.

## 17. సెలయేరు (జానపద గేయ సంపుటి)

సేకరణ: *శ్రీ నేదునూరి గంగాధరం*

వెల : ఇతరులకు రు. 1-12-0 సభ్యులకు 1-8-6

"జానపద వాఙ్మయ సేకరణకై అధికముగా కృషిచేయుచున్న వారిలో శ్రీ నేదునూరి గంగాధరంగారు ముఖ్యులు. వీరు దాదాపు ముప్పది సంవత్సరములనుండి చేసిన కృషి ఫలితమే ఈ గ్రంథ మనిన దీని విలువనుగూర్చి చెప్పుట చాలును. తెలుగు దేశపు హృదయాన్ని, దాని మాధుర్యాన్ని చవిచూడ దలచిన ఈ సెలయేరు చాలును. ఇది ఏడుపాయలుగా సప్తరుచుల నీనుచున్నది. ఇందలి తీయతీయ తేనెల ఒలుకు పాటల భావసంపద ఇచ్చు వినోద, విజ్ఞానము ప్రత్యేకముగా పేర్కొ నవలసిన పని లేదు....గ్రంథాలయము మొదలగు సంస్థలేగాక ఇది ఇంటింటా వెలయవలసిన గ్రంథము."

—గోలకొండ పత్రిక.

"....ఈ జానపద సాహిత్యం ఆంధ్రావళికి చేకూర్చి, అందించడానికి బద్ధకంకణులలో శ్రీ నేదునూరి గంగాధరంగారు 'కనిష్ఠికాధిష్ఠితులు'. వీరు సేకరించిన అపార గేయ సంపదలో కొంతను....బాల, స్త్రీ, ఉత్సవ, భక్తి, గృహసేవ, శృంగార, పాటకజన సారస్వతాలనే ఏడుపాయల 'సెలయేరు'గా అందించి ప్రశంసనీయతను పొందారు.... సుందర జానపద నృత్య ముఖచిత్రంలో మరికొన్ని చిత్రాలతో అందాలు

పొర్లిపారే ఈ 'సెలయేరు'కు శ్రీ బి. రామరాజుగారు జానపద సాహిత్య చరిత్రను రేఖామాత్రంగా చిత్రించే సంపాదకీయంతో దారిచూపినారు....ప్రతి సహృదయుడూ, ప్రజావాదీ, ప్రతి ఆంధ్రుడు, తాగి, తనిసి, తలకుపోసుకోవలసిన సెలయేరిది."

—ఆంధ్ర ప్రభ.

"శ్రీ నేదునూరి గంగాధరంగారు సుమా రిరువై ఏళ్ళనించి జానపద గేయాలు సేకరిస్తున్నారు....వీరి జీవితశక్తి యావత్తు ఈ పాటల సేకరణకే ధారపోశారు....గేయసంకలనంలో....రత్నాలవంటి జానపద గేయాలెన్నెన్నో కనిపిస్తున్నాయి, శ్రీ బి. రామరాజుగారు వ్రాసిన ప్రవేశిక జానపదగేయ సారస్వతాభిమాను లందరు తప్పక పరిశీలించ దగినది."

—ఆంధ్ర పత్రిక.

"తెలుగుదేశం వివిధ ప్రాంతాలలో విస్తరించి వున్న జానపద గేయాలను సేకరించడానికి ఆధునిక కాలంలో చాలామంది రసజ్ఞులు తీవ్ర కృషి చేస్తున్నారు. అట్టివారిలో శ్రీ గంగాధరంగారు అగ్రస్థానం వహిస్తారని నిస్సందేహంగా చెప్పవచ్చు. జానపద సంకలన వారికి తపస్సు వంటిది....వీరి సేకరణలో జానపద గేయాలను ఏరి శీర్షికల క్రింద విభజించి హైదరాబాదులోని దేశోద్ధారక గ్రంథమాలవారు ప్రకటించారు.... యింత కృషిచేసిన శ్రీ గంగాధరంగారున్నూ యింతమాత్రమైనా జానపద సాహిత్యాన్ని గ్రంథరూపంగా పాఠకలోకానికి అందిచ్చిన దేశోద్ధారక గ్రంథమాల వారున్నూ మిక్కిలి అభినందనీయులు."

—కృష్ణాపత్రిక.

"ఎంతో కష్టపడి, గంగాధరంగారు సేకరించిన ఈ పాటలలో ఏడు విభాగాలున్నాయి....ముఖ్యంగా గృహజీవన సారస్వతం, అత్త

మామలు, బావవదినెలు, మరదలు మొదలైనవారి మధ్య జరిగే పరియాచకాలను, హాస్యాన్ని వర్ణించే పాటలు విస్తారంగా ఉన్నాయి...."

—విశాలాంధ్ర.

"శ్రీ నేదునూరివారు సుమారు పాతిక సంవత్సరాలనించీ మన జానపద గేయాలు సేకరిస్తున్నారు. వీరి కృషి దేవేంద్ర సత్యార్థి మొదలైన ప్రముఖ గేయ సంకలన కర్తల ప్రశంస లందుకొన్నది....ఆయా విభాగాలలో వీరు ప్రచురించిన గేయాలలో స్వచ్ఛమైన జానపద ధోరణి జాలువారు తున్నది....మొత్తంమీద ఈ గేయసంపుటిలో స్త్రీల సారస్వతంలో సర్వోత్తమమైన గేయాలు కన్పిస్తున్నాయి. ఈ గేయసంపుటికి శ్రీ బి. రామ రాజుగారు వ్రాసిన ఉపోద్ఘాతం చక్కగా ఉంది. ఇది గేయ సారస్వతాభిమానులందరు తప్పక పరిశీలింపదగినది."

—భారతి.

"....చిరకాలంనుండి వేలకొలది పాటలూ, కథలూ, అవీ సేకరించిన నేదునూరి గంగాధరంగారి కృషికి గ్రంథరూపంబిస్తూ బి. రామ రాజుగారు చక్కని సంపాదకీయం వ్రాశారు....ఈ సెలయేరు....యేడు పాయలుగా ప్రవహించింది. ఒక్కొక్క శాఖలోని ఒక్కొక్కపాట ఒక్కొక్క వజ్రపు తునక."

—"శ్రీవాత్సవ" తెలుగుస్వతంత్ర.

"ఏదేశపు సాంఘిక జీవితాన్ని సమగ్రంగా తెలుసుకోవాలన్నా ఆ దేశపు జానపద సాహిత్యం అవలోడన చెయ్యాలి....ఆంధ్ర జానపద సాహిత్యం అపారమైనది. దీనిలో ప్రత్యేకకృషి చేసిన పండితులు శ్రీ నేదునూరి గంగాధరంగారు....ఏడు విభాగాలుగా జానపద గేయాలు క్రోడీకరింపబడ్డాయి. ఇలాంటి ఉత్తమ గ్రంథాన్ని వెలువరించిన ప్రచురణ

కర్తలు అభినందనార్హులు. ప్రతి ఆంధ్రుడూ కొని చదవడమే గాక—పాడుకోవలసిన పాటల గ్రంథం యిది."

—ప్రజామత.

"....ఇందలి పాటలు ప్రతియొక్కటి సహజంగా సామాన్య ప్రజానీకం పాడుకొంటున్నవి.....ఈ గేయాల సేకరణలో జరిపిన కృషి ప్రశంసనీయము. ఇందలి చిత్రాలు ప్రత్యేక ఆకర్షణ."

—గృహలక్ష్మి.

## 18. జీవనరంగం (15 ఏకాంక దృశ్యనాటికలు)
### (15 గురు రచయితలు - 2 భాగాలు)

వెల : ఇతరులకు రు. 3-8-0 సభ్యులకు రు. 3-1-0

"....వివిధ రచయితల ఏకాంక నాటికలు జీవన రంగం అనే పేరున రెండు సంపుటాలుగా ప్రచురించారు. పదిహేనుమంది రచయితలు నాటికా రచనలో కనబరచిన వైవిధ్యం చదువుకోవడానికే కాక, ప్రదర్శనలకుకూడా యోగ్యంగా ఉంది. ఈ రచయితల్లో తెలంగాణాలో యీనాడు గద్య, పద్య రచనల్లో ప్రసిద్ధులయిన ప్రముఖు లందరూ ఉన్నారు."

—"శ్రీ వాత్సవ" తెలుగు స్వతంత్ర.

"దేశోద్ధారక గ్రంథమాలవారు తెలంగాణా యువకుల రచనలను ఆంధ్ర సారస్వత లోకానికి పరిచయము చేయడానికి ఉద్దేశించిన పుస్తకాలు యివియని తెలుస్తున్నది. ఇది సంతోషకరమగు విషయము."

—గోలకొండ పత్రిక.

"ఉత్తమ గ్రంథాలను ప్రచురించి సాహితికీ, పాఠకులకూగూడా సేవచేస్తున్న ఈ ప్రచురణ సంస్థవారు....వివిధ రచయితల రచనలను

సంపుటీకరించి ప్రకటించడంలో ప్రత్యేకత గడించారు.... ఒక్కొక్క నాటిక ఒక్కొక్క ప్రత్యేకతను తెలుపుతున్నది."

—ప్రజామత.

"ప్రజల మనిషి", "ఉదయ ఘంటలు" వంటి ప్రయోజనాత్మక మైన గ్రంథాలు ప్రచురించిన దేశోద్ధారక గ్రంథమాలవారు ఈసారి నాటిక ప్రచురణలో కొత్త పోకడలు త్రొక్కారు.... ఈ ఏకాంకికలన్నీ ప్రజల ఆకాంక్షలను, హక్కులను, బాధ్యతలను వ్యక్తీకరిస్తున్నాయి. ఇతి త్తంలో, రచనా రీతులలో వైవిధ్యం ఉండేటట్లు చక్కటి వాటిని ాశకులు ఎన్నుకొన్నారు."

—ఆంధ్ర ప్రభ

"....నాటిక లన్నీ ప్రత్యేక ప్రయోజనాలకోసం వ్రాసినవి. రంగస్థలం న రక్తికట్టాయి, ఏకాంక దృశ్యకావ్యాల అవసరం ఎంతైనా ఉన్న ఈ కాలంలో ఇది ప్రజాదరణ పొందగలదని ఆశించవచ్చును.

........ఈ నాటికలన్నీ సంపుటాలుగా వెలువడిన కారణంచేత తెలుగునాట ఈనాడు దినదిన ప్రవర్ధమానమవుతూన్న నాటక కళా ప్రోత్సాహానికి తోడ్పడుతున్నాయి. వివిధ కళాశాలలు, యువజన సంఘాలు, సారస్వత సమితులూ, అమెచ్యూర్ నాటికలు ప్రదర్శించాలని కుతూహలం కనపరుస్తున్నాయి. కాని వాటికి తగిన మంచి నాటికలు సేకరించ లేక పోతున్నాయి. ఈ కొఱత తీర్చడానికి "జీవన రంగం" వంటి నాటికా సంపుటాలు ఎన్నివచ్చినా స్వాగత మీయవలసిందే."

—స్రవంతి.

"....వివిధ వృత్తులలోనుండి సాహిత్య కృషి చేయుచున్న యువ రచయితల నాటికలను రెండు సంపుటాలలో ప్రచురించటం ప్రశంసార్హ మైన విషయం.... నేటి ఆర్థిక, సాంఘిక సమస్యలెన్నో ఈ నాటకాలలో

చిత్రించబడినయి....వివిధ సామాజిక సమస్యల వెలువరిస్తూ వివిధ రచనా రీతులను తెల్పుతూ, పలు నవయువక రచయితలను ఆంధ్ర దేశానికి ఎరుకచేసిన దేశోద్ధారక గ్రంథమాలవారి కృషి అభినందనీయము."

—కృష్ణాపత్రిక

## రాబోవు ప్రచురణలు

1. ఆందోళన (*ప్రధాన రాజకీయ ప్రణాళికలు*)
2. కూర్చిన ముత్యాలు (*ప్రముఖుల ప్రవచనాలు*)
3. శ్రీ భాగి నారాయణమూర్తిగారి *రచనలు*
4. శ్రీ పొట్లపల్లి రామారావుగారి *కథలు, నాటికలు*
5. తెలంగాణా కవిమిత్రులు
6. గంగు (*నవల*)
7. అఖిల భారత తస్కర మహాసభ
8. నాలోనేను
9. ప్రాచీన తెలంగాణా
   (*రాజకీయ, చారిత్రక, ఆర్థిక, సాంఘిక పరిస్థితులు*)
10. విజ్ఞాన శాస్త్రము
11. తరంగాలు
12. స్త్రీలు—సమాజము
13. బుచ్చిపాపలు (*కథలు*)
14. భారతీయ కళావికాసము
15. సామెతకథలు



18

# నూతన ప్రచురణలు

| | సభ్యులకు తగ్గింపు @ 12½% | ఇతరులకు |
|---|---|---|
| 13. జైలులోపల (కథానికలు) | 0 9 3 | 0 10 0 |
| —శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి | | |
| 14. నా గొడవ (గేయాలు) | 1 5 0 | 1 8 0 |
| —శ్రీ కాళోజి నారాయణరావు | | |
| 15. ఉదయఘంటలు (గేయాలు) | 1 15 6 | 2 4 0 |
| — 56 అఖిలాంధ్రకవులు | | |
| 16. ప్రజల మనిషి (నవల) | 2 3 0 | 2 8 0 |
| —శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి | | |
| 18. సెలయేరు (జానపదగేయాలు) | 1 8 6 | 1 12 0 |
| —శ్రీ నేదునూరి గంగాధరం సేకరణ. | | |
| 17, 19. జీవనరంగం (ఏకాంక దృశ్య నాటికలు 2 భాగాలు) | 3 1 0 | 3 8 0 |
| 20. ప్రజలు - ప్రభుత్వం | 1 1 6 | 1 4 0 |
| — కౌంట్ లియో టాల్‌స్టాయి | | |
| 21. పునర్నవం (గేయాలు) | 1 3 6 | 1 6 0 |
| —శ్రీ దాశరథి | | |
| 22. పరిసరాలు (మొదటి భాగము) | 1 8 6 | 1 12 0 |
| —*17గురి రచయితల 17 కథలు* | | |

## త్వరలో

1. పరిసరాలు (కథానికలు, రెండవభాగము)
2. శ్రీ పొట్లపల్లి రామారావు గేయాలు
3. అఖిలభారత తస్కర మహాసభ (సభాచర్యలు)
4. పద్య సంకలనం

దేశోద్ధారక గ్రంథమాల

3-5-1027 నారాయణగూడ, హైదరాబాదు.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | RSK01 17226 |
| పుస్తకం పేరు | పరిశోధనలు |
| తారీఖు | 8-6-23 |
| ముందు అట్ట | ఉంది |
| వెనుక అట్ట | ఉంది |
| మొత్తం పేజీలు | 201 |
| పెద్ద సైజు పేజీలు | లేవు |
| ఖాళీ పేజీలు | 1, 17 |
| లేని పేజీలు | లేవు |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Rohith |
| స్కాన్ చేసినది | Sekhar |
| పరీక్ష చేసినది | Cancel |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | |
| పరిస్థితి | |